యన్.రామలింగేశ్వరరా



శ్రీ లక్ష్మీ అన్నపూర్ణ క్రియేషన్స్

# పుణ్యదంపతులు

నిర్మాతలు

బుల్లి సుబ్బారావు

కె.వెంకటేశ్వరరావు

అనిల్ కుమార్

Bhaskar

# పెరుగుతున్న పాఠకుల అభిమానానికి కారణం ఏమిటి?

'కేవలం సీరియల్స్, ప్రముఖ రచయిత(త్రు)ల పేర్లు, సినిమా కబుర్లే పత్రికల సర్క్యులేషన్‌కు శ్రీరామరక్ష' అనేది కేవలం అపోహేననీ, విభిన్నమైన ఇతివృత్తాలతో, మేధకు పదును పెట్టేకథలతో పాఠకుల హృదయాలలో సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకోవచ్చుననేది 'చతుర' నమ్మకం. ఆ నమ్మకంతోనే పాఠకుల ఆదరణ చూరగొనే విధంగా నెలనెలా విభిన్న ఇతివృత్తాలతో నవలలు అందిస్తోంది 'చతుర'.



## నవంబరు'86 బావి

ఓ పల్లెటూర్లో ప్రశాంతంగా సాగిపోయే ప్రజల జీవితాల్లో హఠాత్తుగా ఓ అలజడి బయలుదేరింది. ఆ ఊళ్లోవున్న మగవాళ్లందరికీ నపుంసకత్వమూ, ఆడవాళ్లందరికీ విపరీతమైన కామవాంఛా ప్రబలిపోయాయి. ఈ వింత మార్పుకు కారణం కనుక్కోవడానికి ప్రభుత్వం ఓ కుర్రడాక్టరును, డాక్టరమ్మను ఆ ఊరు పంపింది.

పేజీ పేజీకి ఆసక్తిని పెంచే సైన్స్ ఫిక్షన్.



## డిసెంబరు '86 ముగింపు

భర్తవుండీ, విధవరాలిగా ముద్రవేయించుకొని, తన ఏడేళ్ల కొడుకూ, పేషెంట్లే లోకంగా బతుకుతున్న డాక్టర్ సమీర మోడువారిన జీవితంలోకి వసంతంలా ప్రవేశించాడు డాక్టర్ శరత్.

ఎదురుచూడని అనుబంధాలు, ఊహించని మలుపులతో కూడిన ప్రేమకథ.



## జనవరి '87 నిజం

ఓ యువతి సామూహిక మానభంగానికి గురయి, హత్యచేయబడింది. నీతి, నిజాయితి, వృత్తిపట్ల గౌరవంవున్న ఓ యువ రిపోర్టర్ ఆ దారుణానికి పాల్పడ్డవాళ్లను బయటకు లాగాలనుకొన్నాడు.

అడుగడుగునా ఉత్కంఠను రేకెత్తించే ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం - దాని సాధకబాధకాలు.



## ఫిబ్రవరి '87 స్వేచ్ఛ

ప్రేమించే భర్త, ఆప్యాయంగా చూసుకొనే అత్తగారూ, ముద్దులొలికే పాప, లెక్చరర్ ఉద్యోగం... సాధారణంగా స్త్రీ కోరుకొనేవన్నీవున్న అరుణ తన ఇంటినీ, తనవారినీ వదలి వెళ్లిపోయింది.

స్త్రీ స్వేచ్ఛ - సామాజిక కట్టుబాట్లను విశ్లేషిస్తూ సాగిన రచన



## మార్చి '87 జైలు

ఏ నేరం చేయని ఒవ్యక్తి తన శ్రమకుతగ్గ ప్రతిఫలం ఉండాలన్నందుకు కఠినకారాగారశిక్ష విధించారు. నేరస్థులను సంస్కరించడానికి బదులుగా, వారిలోని మానవత్వాన్ని హరించేసి, మంచివారినిసైతం క్రూరులుగా రూపొందిస్తున్న మన జైళ్ళయదార్థ స్వరూపాన్ని చిత్రీకరించిన నవల.



## ఏప్రిల్ '87 పావులు

ఇంట్లో తండ్రి పెత్తనం భరించలేని ఓ యువకుడు, స్నేహితులతో కలసి మందు, మగువ, మార్ఫియాలతో ఓకొత్త ప్రపంచంసృష్టించుకొన్నాడు.

దేశానికి వెన్నెముకలాంటి యువకులు ఇంటా బయటా అనేకవత్తిడులకు లోనై, కుటిలరాజనీతిలో పావులుగా ఎలా మారుతున్నదీ వివరించే సాంఘిక ప్రయోజనంగల నవల.

# చతుర

నెలనెలా 'చతుర' ఇచ్చే బహుమానం!
రెండున్నర రూపాయలకే
మీ స్వంత గ్రంథాలయం!

# చతుర ప్రపంచం



## నవ్వా? ఏడుపా?

**'నవ్వు'** దీర్ఘాయువుకు మూలమని చాలా మంది నమ్మకం. ప్రఖ్యాత గ్రీకు తత్వవేత్త అరిస్టాటిల్ కాలంనుండే మనిషి జీవనానికి మనసారా నవ్వడం ఎంత ముఖ్యమో శాస్త్రజ్ఞులు చెబుతూనే ఉన్నారు. 'నవ్వు' ఊపిరి తిత్తులను బలపరచడమేగాకుండా, రక్తప్రసరణను వృద్ధి పరుస్తుంది. నవ్వుతున్నప్పుడు హానికరమైన సూక్ష్మక్రిములు ఊపిరితిత్తుల నుండి బయటికి నెట్టివేయబడతాయి. హాయిగా నవ్వడం వల్ల, అలసట, మానసిక ఒత్తిడి, స్థబ్దత తొలిగిపోతాయి. కీళ్ళనొప్పులు, కొన్నిరకాల అలర్జీలు కూడా తగ్గుతాయని ఇటీవల కొన్ని పరిశోధనల్లో వెల్లడయింది. అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన 'స్టాన్‌ఫర్డ్ మెడికల్‌స్కూల్'కు చెందిన డాక్టర్ విలియమ్‌ఫ్రై 'నవ్వు' అనేది లేకపోతే జీవితానికి అర్థమేలేదని అంటారు. నవ్వు శరీరంలోని కండరాలను సరయిన స్థితిలో వుంచుతుంది. అంతేకాకుండా మెదడులోని 'క్యాట్‌కాల్‌మైన్' అనే ఒక ముఖ్యమైన జీవపదార్థాన్ని చురుగ్గా ఉంచుతుంది. ఇది యాండ్రోఫిల్ గ్లాండ్స్‌ను ఉత్తేజపరుస్తుంది.

కొంతమంది శాస్త్రజ్ఞులు మానవజీవితంలోనవ్వు కంటే ఏడుపుకే అధిక ప్రాధాన్యత వుందని వాదిస్తారు. ఏడుపు మనశ్శాంతిని ఇవ్వడమేగాకుండా రోగాలను కూడా తగ్గిస్తుందంటారు. పశ్చిమజర్మనీకి చెందిన ఓ శాస్త్రవేత్త కొన్ని పరిశోధనలు జరిపి కన్నీటిలో నీరు, ఉప్పు, చెక్కర, ప్రోటీనులు వుంటాయనీ, కన్నీరు వ్యాధి నిరోధక శక్తిగా పనిచేయగలదని కనుగొన్నాడు. ఆడవారి కన్నీళ్ళకూ, మగవారి కన్నీళ్లకూ తేడా ఉంటుంది. ఆడవారి కన్నీటిలో 'యాంటీసెప్టిక్' పదార్థం ఎక్కువగా ఉండటమేగాక, బాక్టీరియాను, హానికరమైన సూక్ష్మక్రిములను చంపేశక్తి అధికంగా ఉంటుంది. ఏడవటంవల్ల బాధ, మానసిక వత్తిడి తగ్గుతాయి. ఏడ్చే అలవాటు ఉన్నవారు ఏడవనివారికంటే, జబ్బునుండి తొందరగా కోలుకోగలుగుతారు. అప్పుడప్పుడు ఏడవటం అలవాటు చేసుకుంటే ఎంతో ఆరోగ్యంగా ఉండవచ్చునంటాడు ఓ అమెరికన్ డాక్టరు. సాధారణంగా ఆడవాళ్లే బహిరంగంగా ఏడుస్తారనీ, మగవాళ్లు ఏడవకూడదనీ మనలో ఓ అభిప్రాయం ఉంది. ఏడ్చే మగవాళ్లని చులకనగా చూడ్డం కూడా కద్దు. ఆడవాళ్లకు ఎప్పుడుబడితే అప్పుడు, ఎక్కడంటే అక్కడ ఏడ్చేస్వేచ్ఛ ఉండటం వల్లేనేమో మగవాళ్ల కంటే ఆడవాళ్లు ఎక్కువ కాలం బతగ్గలుగుతున్నారు. మగవారు కూడా తమ బాధను, మానసిక వత్తిడిని దాచుకోవడానికి ప్రయత్నించకుండా, కన్నీళ్ల ద్వారా వ్యక్తంచేయగలిగితే హృద్రోగాలను నివారించవచ్చని అమెరికాకు చెందిన మానసిక శాస్త్రవేత్త 'డాక్టర్ విలియమ్‌బ్రైన్' అంటారు.

మధ్యప్రదేశ్‌కు చెందిన కొన్ని గిరిజనతెగల్లో ఆడపిల్లలకు ఏడవటం చిన్నప్పటినుండే నేర్పుతారు. పెళ్లికూతురుకు ఏడ్చేపద్ధతి, మెళకువలు తెలియకపోతే ఆమె పెళ్లికి అర్హురాలు కాదని వారి అభిప్రాయం.

మగవాళ్లు హాయిగా నవ్వడానికి వెనుకాడరుగానీ, ఏడవటానికి మాత్రం సిగ్గుపడతారు. నిజానికి నవ్వు, ఏడుపు- బొమ్మ, బొరుసులాంటివి. ఆనందానికీ, ఆరోగ్యానికీ రెండూ





అవసరమే. ఆరోగ్యవంతమైన మనసూ, శరీరం, దీర్ఘాయువుకు సోపానాల్లాంటివి. కాబట్టి మనసారా నవ్వడమేకాదు, ఏడవడానికి కూడా మొహమాటపడకూడదు.

## డొమస్టిక్ కంప్యూటర్లు

బ్రహ్మచారులందరికీ ఓ శుభవార్త! 'పెళ్ళి' ఇష్టమున్నా లేకపోయినా ఇంటి బాధ్యతలు మొయ్యడానికి ఓ ఆడమనిషి అవసరం కాబట్టి, పెళ్ళి చేసుకోవాలను కొనేవారు, ఇకమీదట ఆ కారణంగామాత్రం పెళ్ళిళ్ళు చేసుకోనక్కర లేదు. కొన్నింటినిమాత్రం మినహాయించి ఇంటి ఇల్లాలుచేసే పనులన్నీ చేయగలిగే 'డొమస్టిక్ కంప్యూటర్లు' వచ్చాయి. కంప్యూటర్లలోవున్న మరో సుగుణం ఏమిటంటే 'పెళ్లాం'లా విసుక్కోవడం, తిట్టడం వుండదు. ఎంచక్కా చెప్పిన పనల్లా మారుమాటలేకుండా చేస్తాయి. ప్రస్తుతం అమెరికాలోని ధనవంతులందరూ ఇళ్ళలో 'డొమస్టిక్ కంప్యూటర్ల'ను వాడుతున్నారు.

ఇంట్లో ఓ డొమస్టిక్ కంప్యూటర్ వుంటేచాలు అన్ని పనులూ సునాయాసంగా చేసేస్తుంది కారు గారేజ్ నుండి తీసుకొని తలుపు మూయడం మర్చిపోతే ఖంగారు పడక్కరలేదు. ఓరిమోట్ కంట్రోల్ బటన్ నొక్కితేచాలు తలుపు దానంతటఅదే మూసుకొంటుంది. మరో బటన్ నొక్కితే ఇంటి తలుపు మూసుకొంటుంది. ఇంట్లోవున్న వ్యక్తి కారులో ఎక్కడో వెళుతున్న మరో వ్యక్తితో మాట్లాడవచ్చు. డాక్టర్లు రోగి వివరాలన్నీ కంప్యూటర్‌లో చూసుకొని రోగ నిర్ణయం చేయవచ్చు. ఇంట్లో ఎవరూ లేనప్పుడువచ్చే ఫోన్‌కాల్స్ అన్నీ టేప్ రికార్డర్‌లో రికార్డు చేస్తుంది. కుటుంబ సభ్యులందరూ ఎవరెవరేయే సమయాలకు లేవదలచుకుంటారో ఆ సమయాలను కంప్యూటరుకు ఫీడ్ చేస్తేచాలు; అందరినీ ఖచ్చితంగా అదే సమయానికి లేపుతుంది. స్నానాల గదిలో కావలసినంత వేడిలో నీళ్ళు సిద్ధంగా



ఉంటాయి. కంప్యూటరు నీటిని వేడిచేయడానికి సోలార్ ఎనర్జీని ఉపయోగిస్తుంది. ఉక్కపోతగా వుంటే చలిగావుంటే గమనించి కిటికీలు తెరవడం, మూయడం చేస్తుంది. కంప్యూటరైజ్ చేసిన 'డిజిటల్‌లాక్'ని దొంగలు తీయలేరు. దానికి ఓ ప్రత్యేకమైన 'కోడ్‌నెంబరు' వుంటుంది. ఆ నెంబరు తెలిసిన ఇంటి యజమానితప్ప దాన్ని మరెవరు తీయడానికి ప్రయత్నించినా వారికి ఎలక్ట్రిక్ షాక్ తగులుతుంది. అంతేగాకుండా దొంగలు వచ్చట్టుగా అలారమ్‌మోగుతుంది. యజమాని తలుపు తీయగానే ఎయిర్ కండీషనర్లు, లైట్లు అన్నీ పనిచేయడం ప్రారంభిస్తాయి. బయటకెళ్ళగానే అన్నీ ఆటోమాటిక్‌గా స్విచ్ ఆఫ్ అవుతాయి. ఇంట్లో ఎవరూలేని సమయంలో పొగరావడం జరిగితే వెంటనే అగ్నిమాపకదళం వారిని హెచ్చరిస్తుంది. ఇంటికి సంబంధించిన పద్దులన్నీ ఖచ్చితంగా రాసేస్తుంది. తమ డొమెస్టిక్ కంప్యూటర్‌తో 'మాచ్' అయిన కంప్యూటర్లుగల ఇంటివారికి ఉత్తరాలు కూడా కంప్యూటర్ ద్వారానే రాయవచ్చు. కుట్లు, అల్లికలకు కావలసిన అందమైన డిజైన్లను కూడా కంప్యూటర్ ఇవ్వగలుగుతుంది.

మరో అయిదేళ్ళలో అమెరికాలోని ఇళ్ళన్నీ కంప్యూటర్ల సహాయంతోనే నడుపుతారని ఓ అంచనా. ఇరవయ్యేళ్ళలో డొమెస్టిక్ కంప్యూటర్లను ఆస్పత్రిలకు లైబ్రరీలకు, స్టోర్స్, సూపర్ బజార్లకు 'లింక్'చేసి ఇంట్లో కూర్చొనే అనేక పనులు చేసుకోగలిగేలా చేస్తారట.

“ఇవన్నీ ఏ అమెరికాలోనో, జపాన్‌లోనో జరిగేవేగానీ మనదేశంలో ఎక్కడ సాధ్యపడుతుందిలే” అనిమనం నిరాశచెందనవసరంలేదు. మొన్నటి దాకాలేని టీవీలు, టేప్ రికార్డర్లు ఈనాడు విరివిగా ఉపయోగిస్తున్నట్టుగానే 'డొమెస్టిక్ కంప్యూటర్లు' కూడా మనం తప్పకుండా ఉపయోగించుకోగల్గుతాం!

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: టి.ఎస్.ఎస్. ప్రసాద్

# Talcum powders can't fight your prickly heat like Nycil can.



# Use NYCIL for quickest relief from prickly heat.






GLL 8606

Nycil is a medicated powder, specially formulated to fight prickly heat at every stage. It immediately relieves that itchy feeling, and unlike talcum powders it fights infection and prevents the problem from getting worse.

Nycil. It's the safest, surest way to relieve prickly heat.

1. Prevents excess perspiration. 2. Absorbs sweat.
3. Destroys odour-causing bacteria. 4. Soothes the skin.

# 'జైలు' నవలపై చతుర సమీక్షలు

చతుర నవలల పోటీలో ప్రత్యేక నవలగా ఎన్నికై మార్చి సంచికలో ప్రచురితమైన 'జైలు' పై మాకు అందిన 'చతుర సమీక్ష' లలో ఉత్తమంగావున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందినవారికి మా అభినందనలు!

## విలక్షణ సందేశం

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

ఈమధ్య తరచుగా సంభవిస్తున్న పోలీసుల అమానుషకృత్యాలూ, హత్యలగురించి పేపర్లలో చదివి, ఆవేదనతో వూగిపోయే పాఠకుల్ని "జైలు"మరింతగా కదిలిస్తుంది. ప్రతిమనిషీ అనుభవించటానికి భయపడే, తెలుసుకోవటానికి కుతూహలపడే జైలు జీవితాన్ని అక్కడి అమానుషకృత్యాల్నీ ఖైదీల దయనీయస్థితిగతుల్నీ కళ్లకు కట్టినంత సవివరంగా, ఉత్తేజకరంగా చిత్రించారు రచయిత. విలక్షణమైన, ప్రయోజనకరమైన ఇటువంటి రచనల్ని బహుమతులిచ్చి ప్రోత్సహిస్తూ, సాహిత్యరంగంలో వాస్తవిక దృక్పథాన్ని పెంపొందింపచేయాలనే "చతుర" నిర్వాహకుల కృషి అభినందనీయం.

పరిస్థితుల ప్రాబల్యానికో, వ్యక్తిగతమైన బలహీనతలకో లోబడి నేరస్థులైనవారిని సన్మార్గులుగా చేయడానికి ఉద్దేశించిన జైళ్లలో నిజంగా జరిగే తంతు ఇదా? అని విస్తుపోయేంతగా పచ్చినిజాల్ని అతిధైర్యంగా పాఠకుల ముందుంచారు రచయిత. ప్రజలలో శాంతిభద్రతల్ని కాపాడాల్సిన రక్షణసిబ్బంది స్వయంగా పరాన్నభుక్కులుగా, ప్రాణభక్షకులుగా, లైసెన్స్‌డ్ గూండాలుగా మారి జులుం చెలాయించడాన్ని ప్రభుత్వం అరికట్టలేదా? కంచే చేను మేసినట్లు, దొంగలు దొంగలు చేరి వూళ్లు పంచుకుంటున్నట్లుగా జైళ్లలోజరిగే పోలీసుల అమానుషాల్ని పట్టించుకునే సాధుడేలేడా? ఇటువంటి ప్రశ్నలతో మస్తిష్కాన్ని మధించిన మేటినవల ఇది. విచారణలపేరిట జరిగే ప్రహసనం వచ్చి లంచగొండితనంతో అంతమవుతుంటే ఇక న్యాయం ఎలా లభిస్తుంది?

ఇందులోని పోతాలు, జైలర్, సబ్‌జైలర్, హెడ్, నజీం, గోవిందం అన్నీ సజీవమైన పాత్రలు. ఖైదీలుకూడా మనుషులేనని, వారిలో కూడా మనసూ, మానవత్వం వుంటాయని మరిచి వారిని పందులకంటే హీనాతిహీనంగా భావిస్తూ పైశాచిక పద్ధతులతో వారి మానప్రాణాల్ని హరింపజూసే సబ్‌జైలర్‌లాంటి అధికారమదాంధుల తీవ్రమైన హింసాత్మక పద్ధతులవల్ల పోతాలులాంటి తర్కశీలి, హేతువాది, శాంతికాముకుడు సైతం హంతకుడుగా ఎలా మారిపోగలడో హేతుబద్ధంగా వివరించారు. ఇటువంటి జైళ్ళు ఖైదీలలో మరింతగా నేరప్రవృత్తినీ, కసినీ, నిర్భయత్వాన్ని పెంచుతాయే తప్ప ఏమాత్రం వారిని సంస్కరింపజాలవు. నిజంగా హృదయాన్ని కరిగించి, కొన్ని సందర్భాలలో కన్నీరు కార్పించిన రచన "జైలు"

సామాజిక స్వేచ్ఛ లభించనిదే వ్యక్తి స్వేచ్ఛకు స్థానంలేదనీ, ప్రతివారూ సామాజిక స్వేచ్ఛకై పోరాడాలనే సందేశంతో నవలను ముగించటం సమంజసంగా వుంది. ఇంత విలక్షణమైన రచనను అందించిన రచయిత అభినందనీయులు.

—విజయలక్ష్మి పాండే, హైదరాబాదు

## జైలుకాదు నరకకూపం

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

అమాయకులైన నేరస్తులు సైతం కటకటాల వెనుక ఎంతటి భయంకర హింసకు గురిఅవు




తున్నదీ, దుర్భరమైన జైలు జీవితంనుండి స్వేచ్ఛ కొరకు వారు చేసే ప్రాణాంతక ప్రయత్నాలెలాంటివో వాస్తవంగా చిత్రీకరించిన నవల 'జైలు'. ఇటువంటి కథాంశాన్ని ఎంచుకుని నిర్భయంగా, నిజాయితీగా నవలను నడిపిన రచయితకు, ధైర్యంగా పాఠకులకు అందించిన "చతుర"కు అభినందనలు.

నవలలో చిత్రీకరించిన సంఘటనలన్నీ పాఠకులమీద గాఢమైన ప్రభావాన్నిచూపి చెరగనిముద్ర వేసేవిగా ఉన్నాయి. లోగడ జైలు జీవితం ఇతివృత్తంగా వచ్చిన నవలలు ఒకటి రెండు మాత్రమే. ఆ నవలల కంటే ఇది భిన్నంగా ఉన్నదనటంలో సందేహంలేదు. మేరీ టేలర్ 'భారతదేశంలో నా జైలు జీవితం' నవీన్ 'చీకటిరోజులు' అధికారుల అవినీతిని చిత్రీకరిస్తే, ఈ నవల జైలులోపలి నికృష్ట జీవితంతోపాటు ఖైదీల స్వేచ్ఛాప్రియత్వాన్ని చాటుతోంది. 'జైలంటే ఖైదీలకు సత్ప్రవర్తననేర్పే గృహంకాదు. తప్పు చేయకుండా శిక్షపడి ఇందులోకి వచ్చినవారు ఇకముందు తప్పులు చేయడం ఎలాగో నేర్చుకొనేలాచేసే సంస్థ, అన్నయదార్థం బలంగా చూపించబడింది. జైలు వ్యవస్థలోని లోపాలు, అధికారుల స్వార్థం, క్రౌర్యం, లంచగొండితనం, ఖైదీల నిస్సహాయత చదువుతుంటే మనసు వికలమైపోతుంది.

'నిరీక్షణ'లాంటి సినిమాలు, 'జైలు'లాంటి నవలలు ప్రజలను స్పందింపజేయుటంవరకే పరిమితం కాకూడదు. సేవాసంస్థలూ, ప్రభుత్వమూ జైలుసంస్కరణ ఉద్యమాన్ని చిత్తశుద్ధితో చేపట్టాల్సిన అవసరం ఎంతైనావుంది. అపరాధులైనా, నిరపరాధులైనా ప్రస్తుతం కొనసాగుతున్న జైలు వ్యవస్థలోని లొసుగులకు ఖైదీలు బలికాకుండా బయటపడే దెన్నటికో! ఖైదీలకు బేడీలనుండి విముక్తి కలిగించి పోలీసులకు చిక్కిపోయిన ధర్మయ్య, వత్తిచేలో పోతాలును కాపాడిన ముసలమ్మ, పోతాలును పోలీసులకు పట్టియివ్వకుండా, చేతనైన సాయంచేసి స్వేచ్ఛను కల్పించిన రాఘవయ్యల పాత్రలనుండి జైలు అధికారులు నేర్చుకోవలసిన మానవత్వం ఎంతైనా వుంది.

— **టి. వింధ్యారాణి,** నాగార్జునసాగర్.

## ముగింపు సరిగాదు

**(తృతీయ బహుమతి రు. 50/- బహుమతి పొందిన సమీక్ష)**

హీరోయిను, రొమాన్సు లేకుండా నవలను రాయడమే కష్టతరం. అలాంటి నవలను పాఠకులలో చివరి వరకూ చదివించేలా ఆసక్తికరంగా రాయడం మరీ దుర్లభం. అయినా అది సాధ్యమేనని నిరూపించారు కొమ్మిరెడ్డి విశ్వమోహన్‌రెడ్డిగారు తన నవల 'జైలు' ద్వారా. రచయిత 'జైలు'ను కేవలం స్పృశించలేదు. పాఠకులను తనతో తీసుకెళ్లి కటకటాల అవతలి పరిస్థితిని ప్రత్యక్షంగా సమీక్షించారు. అందుకే హృదయముండి స్పందించగల ప్రతి పాఠకుడూ ఖైదీల తరవున పిడికిలి బిగిస్తాడు.

పోతాలు పాత్ర చిత్రీకరణలో రచయిత పూర్తిగా కృతకృత్యులు కానట్టు కనబడుతుంది. నవలంతా చదివాక ఇద్దరు పోతాలులు మన మనస్సులో వుండిపోతారు. ఒకరు జైలు పరిస్థితులతో రాజీపడలేక ప్రతిఘటించే పోతాలు. ఇంకొకరు జైలునుండి తప్పించుకుని 'స్వేచ్ఛ' కొరకు పరితపించే పోతాలు. ఇద్దరి మధ్యా లింకులేదు. అంటే కథనంలో ఎక్కడో లోపంవుందన్నమాట!

జానపద కథల్లో పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమైనట్టు, చివర్లో ఓ చుట్టతాగే వ్యక్తి తారసపడటం, స్వేచ్ఛను గురించి కొంచెమే అయినా, విలువైనదే అయినా చెప్పడం, పోతాలు జ్ఞానోదయమైన యోగిలా బస్సెక్కడం... ఇదే ముగింపు అంటే ఏదో వెలితిగా కనబడుతోంది. పోతాలు ఏవిధంగా సమాజంలోకి చొచ్చుకుపోతాడో అన్యాయాన్ని ఎలా ప్రతిఘటిస్తాడో చర్చించి వుంటే ఇంకా "జైలు" మంచి నవలగా మారి వుండేదనిపిస్తోంది.

నవలంతా చదివాక మంచి నవల చదివామన్న సంతృప్తితోపాటు కొన్ని కొత్త విషయాలు తెలుసుకున్నామన్న భావం కూడా కలుగుతుంది. ఎక్కడా సహజత్వం చెడకుండా రాసిన రచయితను అభినందించకుండా వుండలేము.

— **పి. వెంకటరామిరెడ్డి, తిరుపతి.**



## ప్రయోజనాత్మక నవల

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

'జైలు' నవలా సాహిత్యానికి వుండవలసిన ముఖ్య లక్షణాల ప్రకారం నిస్సందేహంగా ప్రయోజనాత్మకంగానూ, సామాజిక ప్రయోజనాన్ని ఆశించే నవలగానూ కూడావుంది. కథ చెప్పిన తీరు చాలా ఆసక్తిదాయకంగా, చదవాలని పించేదిగావుంది.

నవలలో ఎంచదగ్గ ప్రశంసనీయమైన ముఖ్య విశేషాలు ఇవి: జైలు జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించిన పద్ధతి, జైలు అధికారులను వ్యక్తిగతంగా, వృత్తిగతంగా అతిక్రూరులుగానూ, ఖైదీలను త్యాగధనులుగానూ చిత్రించే వుద్దేశం లేకుండా వ్యక్తులను వ్యక్తులుగా, వ్యవస్థలో పాత్రధారులుగా చిత్రించేందుకు రచయిత ప్రదర్శించిన చిత్తశుద్ధి, సాక్షీభావం, చక్కగా, చిక్కగా ఏకబిగిని చదివించేలావున్న కథా సంవిధానం, నాటకీయమైన పరిష్కారాలు కల్పించకుండా, సూచనగా తన సందేశం అందించటంలో రచయిత చూపిన నేర్పూ, ఆలోచనాత్మకంగా నవలను మలచిన తీరూ!

ఎన్నుకున్న విషయానికి ఇంకా పూర్తిగా న్యాయంచేకూర్చాలంటే ఈ నవలను మరికొంత సుదీర్ఘంగా రాయాల్సిందేమో. బాలఖైదీలు, స్త్రీ ఖైదీలు, పోతాలు సహఖైదీల వృత్తాంతాలు క్లుప్తంగా వుండటం చిన్నలోపంగా అన్పించింది. అలాగే ఖైదీల ఆహార సమస్యకే ఎక్కువ ప్రాధాన్యతఇచ్చి వారి ఇతర సమస్యలను అంతగా ప్రస్తావించక పోవటంకూడా కొంత అసంతృప్తి కలిగించింది.

— మ. హనుమంతరావు, గుంటూరు.

## మన "పాపిలాన్"

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

'జైలు' నవల నాగరిక సమాజం సృష్టించిన ఒక భీషణ జీవిత కావ్యం. మనిషిలోని రాక్షసత్వం అసహాయుల మీదనే విజృంభిస్తుంది. జైలు నాలుగు గోడల మధ్యన బందీలైన ఖైదీలు ఎంతటి అమానుషత్వానికి బలవుతారో చిత్రించిన హృదయాల్ని కదిలించే నవల 'జైలు'. ఈ నవల చిత్రీకరణలో ధ్వనించిన సిన్సియారిటీ చాలా గొప్పది, విలక్షణమైనది. ఆమధ్య అందర్నీ ఆలోచింపజేసిన సినిమా "పాపిలాన్"ను గుర్తుకు తెచ్చింది నవల. ఆకలితో నకనకలాడే కడుపులతో, మండేగుండెలతో, ఎగిసే ద్వేషంతో, రగిలే ఆవేశంతో రాసిన రచనల్లోని వేగం, ఒరవడి పాఠకుడిని నిలదొక్కుకోనివ్వవు. ఆ శక్తి ఆ ఒరవడి, ఆ చురుకు, ఆవాడి, ఆవేడి పదాల కూర్పులోనుండిరాదు. రచయిత అనుభవంలోనుండి హృదయంలో నుండి వస్తుంది.

'జైలు' నవల పాఠకులను ఒక తెలియని ప్రపంచంలోకి తీసుకెళుతుంది. అక్కడి బాధలు, వ్యధలు, ఈసడింపులు, ఛీత్కారాలు మనిషిలోని ప్రిమిటివ్ ఎమోషన్స్ను అవలి పరిధిలోకి కూడా మనలను లాక్కెళుతుంది.

— ఎ.బి. ప్రసాద్, మంగళగిరి.

## జైలు న్యాయాలు

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

బలహీనునికి బలవంతునినుండి రక్షణ కావాలి. ఆ రక్షణ బాధ్యత పోలీసులది. కాని 'దోపిడి' బుద్ధి ఇతర్లకన్న పోలీసుల్నే ఎక్కువగా పట్టుకుంది. పాతకాలం నిరంకుశ పోలీసు విధానాన్నే ఈనాటికీ భారత పౌరుల మీద ప్రయోగిస్తున్నారు. నేరం ఆపాదింపబడిన ముద్దాయిపైన కేవలం 'దండం' వుపయోగించి మాత్రమే నేర నిరూపణ చేయడానికి ప్రయత్నం జరుగుతోంది.

ఈ వ్యవస్థలోని లోపాలను నిరూపించే 'జైలు' విస్తృత పరిశీలన తర్వాతే రాసినట్లు అవగతమైంది. పోతాలు జైలులో న్యాయంకొరకు పోరాడే అన్యాయమైపోయాడు. స్వేచ్ఛ కొరకు పారిపోయాడు. తన ఒక్కని స్వేచ్ఛకై ప్రయత్నించడంకాదు, మొత్తం సమాజానికే 'స్వేచ్ఛకావాలి' అన్న సత్యం తెలుసుకుని అందుకై నడుంకట్టాడు.

కొమ్మిరెడ్డి విశ్వమోహన్‌రెడ్డి భాష-శైలి ఆకట్టుకునేలావున్నది.

—డి. శ్రీధరాచార్య, జైనద్.

# మినీ కథల పోటీ

నేటి కాల్పనిక సాహిత్యంలో హాస్యం మరీ కొరవడుతోంది. ఈనాడు వెలువడుతున్న హాస్య రచనల సంఖ్య అత్యల్పం. మనిషి ఆరోగ్యానికి నవ్వు ఎంత అవసరమో కొత్తగా చెప్పనక్కరలేదు. అందుకే నవ్వించగలిగే హాస్య ప్రధానమైన మినీ కథలకోసం ఈ పోటీని నిర్వహిస్తున్నాం! అందంగా విస్తరింపచేసిన కొత్త తరహా జోక్ కూడా మినీకథగా చక్కగా రూపొందుతుందని మా నమ్మకం! కొత్తా-పాతా తేడా లేకుండా రచయిత(త్రు)లంతా ఈ మినీకథల పోటీలో పాల్గొని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాం!

## బహుమతులు

**మొదటి బహుమతి** రు. 100

**రెండవ బహుమతి** రు. 75

10 మూడవ బహుమతులు రు. 50 చొప్పున

## నిబంధనలు:

★ మినీకథ 3 అరఠావు పేజీలకి మించగూడదు. పేజీకి ఒక వైపునే రాయాలి.

★ బహుమతి పొందని మినీకథల్లో ప్రచురణార్హమైనవాటిని సాధారణ ప్రచురణకు స్వీకరించే అవకాశంవుంది. అలా ప్రచురించే మినీకథలకి రు. 25 చొప్పున పారితోషికం వుంటుంది.

★ అనువాదాలూ, అనుసరణలూ పంపరాదు. మినీకథ తమ స్వంత రచనేనని, అనుకరణకాదని, ప్రచురితం, ప్రసారంకాలేదని, మరే ఇతర పత్రికల పరిశీలనలోలేదని ధృవపరిచే హామీపత్రాన్ని విధిగా జతపరచాలి.

★ ప్రచురణకు ఎన్నికకాని మినీ కథలను తిప్పి పంపేందుకు తగు పోస్టేజీతో కవరు జతపరచాలి. అలా జతపరచకుండా తర్వాత ఆ రచన గురించి ఉత్తరాలు రాయటంవల్ల ప్రయోజనం వుండదు.

★ బహుమతుల నిర్ణయం, ఇత్యాది విషయాలన్నింటిలోనూ సంపాదకునిదే తుది నిర్ణయం. ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాద వివాదాలకు అవకాశంలేదు. గడువుతేదీ ముగిశాక వచ్చిన మినీ కథలు పోటీకి పరిశీలించబడవు. సాధారణ ప్రచురణకు మాత్రమే పరిశీలించగలం.

**మినీ కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ 31-5-1987**

కవరుపై 'మినీకథల పోటీకి' అని పేర్కొంటూ కింది చిరునామాకి పంపాలి.

ఎడిటర్, 'చతుర'
ఈనాడు కాంపౌండ్,
హైదరాబాదు-500 482.

# చతుర

సంపుటి :10 మే '87 సంచిక : 4


## ఈనెల సమగ్ర నవల

సర్దార్ మాట పూర్తయిందోలేదో ఓ పహిల్వాన్ వచ్చి మల్లిగాని మెడమీద చెయ్యేశాడు.

మల్లిగానిమెడ అతని పిడికిట్లో ఇమిడిపోయింది.

"పైసలిచ్చేదాక నేను నీతోనే ఉంట... మరి నా కూలి కూడా కట్టెయ్యాలె... పా..." అంటూ లాక్కుపోసాగాడు పహిల్వాన్.

మల్లిగానికి కేకేసే శక్తి కూడాలేక విలవిలా కొట్టుకుంటున్నాడు.

"ఆ గుర్రి బాంచెను... ఆయిన్నేం జేయకుర్రి..."

మల్లిగాని భార్య ఏడుస్తూపరుగెత్తివచ్చింది. ఆ వెంటనే తన మెడలోవున్న పసుపుతాడును పుటుక్కున తెంపింది. చిన్నచిన్న నల్లపూసలన్నీ కిందపడిపోయాయి. దారాన్ని తీసిపడేసి చిన్న పుస్తెను పహిల్వాను చేతిలోపెట్టిందామె.

మనువునాడు మగడు కట్టిన తాళిని, మగడు బతికుండగానే తెంపుకోవాల్సిన ఖర్మ ఆ ఇల్లాలికెందుకు ఎదురయ్యింది?

నేటి సమాజంలో ఆర్థికస్తోమతలేని వారి ప్రాణం, మానం, అభిమానం అన్నీ అది ఉన్నవారి గుప్పిటిలోనే ఉంటున్నాయా?

ఆత్మగౌరవంతో బతకాలనే ప్రయత్నంలో నిజాయితీగా, కష్టించి పనిచేస్తూ అనుక్షణం బతుకుతో పోరాడే పేదప్రజల కన్నీటిగాథలు ఎలాంటివి?

ఎం.వి. తిరుపతయ్య రచన 'బతుకు' ఈ నెల చతుర సమగ్ర నవల.

చతుర నవలల పోటీలో మూడవ బహుమతి నాలుగువేల రూపాయలు పొందిన నవల 'బతుకు' డబ్బుకేగాని, మరి దేనికీ విలువలేని సమాజానికి దర్పణం.

ఒక వర్గంవాళ్లు బతుకుతో, బతకడానికి చేస్తున్న పోరును, నా నవల్లో ఫోకస్ చేశానంటున్న శ్రీ యం.వి.తిరుపతయ్య, 'బతుకు'లో కథా స్థలానికి పాత్రలకి అనుగుణంగా తెలంగాణా మాండలికాన్ని- ముఖ్యంగా కరీంనగర్, వరంగల్ ప్రాంతపు మాండలికాన్ని ఉపయోగించారు. గతంలో వివిధ పత్రికల్లో కొన్ని కథలు, గేయాలు రాసిన తిరుపతయ్య మొదటి నవల 'బతుకు'.

1965 నుంచీ లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్న ఆయన ప్రస్తుతం వరంగల్ కాకతీయ గవర్నమెంట్ కాలేజీలో లెక్చరర్.



పట్టణం కప్పుకున్న మేలిముసుగులా పొగ మంచు... ఎముకల్ని సూదుల్లా గుచ్చుతూ, శరీరంలో మిగిలిన వేడిని చల్లారుస్తూ గోలగా ఈలవేస్తూ పరుగులు తీస్తున్న చలిగాలి... ఈదురుగాలి...

గంపల్లోని కూరగాయల్ని తీసి నాలుగు చక్రాల బండిమీద ఆదరాబాదరా సర్దుతున్నాడు రాయలింగు. సర్దడంలో అతని భార్య గౌరమ్మ అతనికి తోడ్పడుతోంది. ఏటవాలుగా వున్న ప్రదేశంలో బండివుండటం వల్ల, సర్దినకొద్దీ బడబడా దొర్లిపడుతున్నాయి కూరగాయలు.

"ఆ వంపుకున్న గీరెల కింద ఎత్తుపెట్టకపోతివి. గీబూమిని ఎత్తువంపుల్లేకుంట సమానం చేయిమని బండి తెచ్చినప్పట్నుంచి చెప్తాన... నీకు తీర్తనే లేదాయె. ఓ దిక్కుపొద్దుబోబట్టె...గీ అడ్డమైన బూమిల రోజు గింతగనం సదురుడాయె." విసుక్కుంది గౌరమ్మ.

గౌరమ్మ అలా అనగానే కోపం వచ్చింది రాయలింగుకు.

"ఏందే...! అడ్డమైన బూమా...? నీయవ్వ... గీబూమే దొర్కకుంటె చెట్లు గుట్టలు పట్టుకొని పోదుం... గీబూమే సమానంగవుంటె... మన గుడిసెకోసం మిగిలేదానె... పిచ్చిదానా! ఈత యెన్నడో బంగ్లాలులేసి నిలబడేవి ఎరికేనా? తీరినప్పుడు సమానంచేసుకుందాంగానీ... ఇంకోపాలి అడ్డమైన బూమని అనకు." భార్యను మందలించాడు రాయలింగు.

గౌరమ్మ ఎత్తువంపులని పేర్కొన్న ఆ ప్రదేశం నిజంగా భూమికాదు. పూర్వం కాకతీయులు పోసిన చెరువుకట్ట అది. ఆ కట్ట ఆపే నీరు చిన్న సముద్రంలా వుండేది కావచ్చు... లేకుంటే ఆ నీళ్ళు పాలలా వుండేవి కావచ్చు... ఇప్పుడుకూడా అనాటిపేరుతోనే... దాన్ని బాల సముద్రం కట్ట అంటారు.

పూర్వం ఇంకా ఎత్తుగా ఉండేదట... ఇప్పుడుకూడా నలభై యాభై ఫీట్ల ఎత్తుంటుంది. కట్టకుమధ్యగా గండిపడింది. బాలసముద్రమూ, పొలాలూ ఉండే ప్రాంతం భవనాలతో నిండింది. చెరువులో వెలిసిన కాలనీ బాలన ముద్రంకాలనీకాగా... పొలాల్లో ఎన్నోవాడలు వెలిశాయి.

గండికి అటు యాభై ఇటుయాభై గుడిసెలుంటాయి. కట్టకు ఆవేపు బస్స్టాండుకెళ్ళే రోడ్డుంది. కాలనీ డ్రెయినేజీ గండిగుండా బయటికి వచ్చి... కట్టకూ, రోడ్డుకూ మధ్య పెద్దమడుగై వుంటుంది.

కట్టకటువేపున్న వాళ్ళిటూ, ఇటువేపున్న వాళ్ళటూ పోవాలంటే తప్పనిసరిగా కట్టకొనలు దిగి, మడుగు నానుకున్న రోడ్డుగుండా పోవలసిందే.

మడుగునిండా దట్టంగా పెరిగిన సర్కార్ తుమ్మలుంటాయి. రోడ్డునానుకొని ఆటల మైదానం— ఆ తర్వాత కాలేజీలు...మేడలు...

కట్టకోవేపు సినిమాహాలుంది. మరోవేపు బస్స్టాండుంది. అక్కడా యిక్కడా హోటళ్ళూ, కిళ్ళీకొట్లు, లాడ్జింగులున్నాయి.

ఎదురుగావున్న రోడ్డుమీద అర్ధరాత్రి దాటేదాకా జనసంచారం, వాహనాల రాకపోకలుంటాయి.

ఉదయమూ, సాయంత్రమూ మైదానంలో ఆటలు... బడిపిల్లల పరుగులు...

బస్స్టాండుకెదురుగా కట్టనానుకొని పెద్ద కొండ... ఆ కొండను పగలేసే వడ్డెర్ల ఉలీసుత్తెల చప్పుడులూ, ప్రేలుళ్ళు...

అలా తెల్లవారుజాముసుండి అర్ధరాత్రి దాకా ఆ ప్రాంతం జనారణ్యంలా వుంటుంది.

రెండుమూడు ఫర్లాంగులు పొడవుతో అకొన నుండి ఈ కొనవరకు ఎత్తుగా వుండి, తన లాంటి ఎందరికో ఆశ్రయమిస్తున్న ఆ చెరువుకట్టంటే... పుట్టినూరు వదిలి బతకడానికొచ్చిన రాయలింగుకెంతో ఇష్టం.

అటుసర్ది ఇటుసర్ది ఇద్దరూ కూరగాయల కుప్పల్ని అందంగా పేర్చారు.

వంకాయలు, టమాట, చిక్కుడు, పచ్చిమిర్చి, ఆకుకూరలు, దుంపకూరలు... అలా వేరు వేరుగా కుప్పల్ని అమర్చారు.

"మల్లవ్వా! గిన్ని నీళ్లు తీస్కరా బిడ్డా!" కేకేసింది గౌరమ్మ.

తపేలలో నీళ్ళు తీసుకొని లేడిపిల్లలా ఎగురుతూ వచ్చింది, పద్దెనిమిదేళ్ల కూతురు మల్లికాంబ.





తపేలా అందుకుని కుప్పలమీద నీళ్ళు చల్లింది గౌరమ్మ!

నీళ్ళుపడగానే మెరుస్తూ తాజాగా కనిపించాయి కూరగాయలు.

"నీయవ్వ... ఎంతురికురికి చేసినా గింతపొద్దుబాయె... నేను కాలనీకి పోయొస్తగనీ... బుజ్జిగాన్ని యాళ్లపొద్దుగాల లేపి, ఇయ్యాల్నన్నగిన్ని పైసలు ఎన్కేసుకరమ్మను" బీడీ అంటించుకుని తువ్వాలు తలకు చుట్టుకుంటూ అన్నాడు రాయలింగు.

"మాగలేవుతగనీ, పొల్లగాడు... వాడేంసంపాయిస్తడు? ఏ మెన్కేసుకొస్తడు? లేవంగ లేవంగ లేస్తడు... అనంగనంగ పోతడు. అడతిరిగి ఈడతిరిగి ఉత్తచేతులూపుకుంటొస్తడు. పోరనికి గాపనులు చేసుడిష్టంలేదటగాదు! ఇష్టమైన పనిదొరికెదాక వాడేం సంపాయిస్తడూ" కొడుకును వెనకేసుకొచ్చింది గౌరమ్మ.

"గట్లనా? మరిష్టమైన పనిదొరికెదాక ఎంతింటడటా? రెక్కలు ముక్కలుచేసుకొని అయ్యగాడు సంపాయిస్తాంటె, తిని కూసుంటడటనా? నీతల్లి... గింతగింత పోరగాండ్లు అంతో ఇంతో సంపాయించి అయ్యవ్వలకానరైతాండ్రు. అకరికి వాని పొల్లమందమన్న వాడు సంపాయించుకోకుంటెట్లనే?" ఆవేదనతో అన్నాడు రాయలింగు.

"మాగసంపాయిస్తడులే... ఎంతపోరడని వాని మీద గంతగనం కోపం చేస్తానవ్?" అంది గౌరమ్మ.

"ఇగో... గౌరూ! ఎంతపోరడెంతపోరడనుకుంట గింతదాకతెచ్చినవ్. అకరిసారి చెప్తాన... ఇయ్యాల పొద్దుగూకెటాలకు అంతోఇంతో తెచ్చిండానసరె... లేకుంటె మాపటికి వాడోనేనో... ఒక్కలమే తిండి తినాలె... ఆ"

దిమ్మెరపోయి చూస్తున్న గౌరమ్మను కోపంగా ఉరిమిచూసి, బండిని తోసుకుంటూ వెళ్ళిపోయాడు రాయలింగు.

టాకీసుదాటి, క్రాసురోడ్దాటి, సర్క్యూట్ హౌస్ రోడ్డుగుండా బండిని నెమ్మదిగా తోసుకుంటూ... అరగంటకు ఎక్సయిజ్ కాలనీ చేరాడు.

రంగులు పులుముకుని రకరకాలుగా ముస్తాబై మెరుస్తున్న బంగళాలు... ఆకుల చేతులతో సూర్యుణ్ణాహ్వానిస్తున్న కొబ్బరి, యూకలిప్టస్‌చెట్లూ... రకరకాల రంగులతో విరగబూసిన బోగన్‌విల్లాలు...తళుక్కున మెరుస్తూ పులకరిస్తున్న అరటిచెట్లు... గులాబీలు, క్రోటన్లు, సన్నజాజులు, సంపంగెలు, మల్లెలు మందారాలు... అన్నీ గాలికి ఉయ్యాలలూగుతూ ఆ కాలనీసోయగాన్ని పెంచుతున్నాయి... పిట్టగోడపై నుండి నగంనగం కనిపిస్తూ బైటకి నిక్కిచూస్తున్నట్లుగా వున్నాయి.

నవనాగరికతను పులుముకున్న ఆ కాలనీకి... నాగరికతవాసనకూడా సోకని, నలుపెక్కిన పాతబండి... మాసిన గుడ్డలతో, బక్కచిక్కిన శరీరంతో ఆ బండిని తోసుకుంటూ వచ్చిన రాయలింగు...

"వంకాయలూ, బీరకాయలూ, పాలకూరా, పచ్చిమిరపకాయలూ" అని ఓసారీ

'టమాటా, చిక్కుడుగాయా, పుల్లకందా...' అని ఓసారీ రాగంతీస్తున్నట్లుగా కేకేసుకుంటూ నెమ్మదిగా బండిని తోస్తున్నాడు.

నాలుగు సైకిల్ చక్రాలమీద లుక లుకలాడుతూ ఎవరో మూలుగుతున్నట్లున్నదాబండి. నలుపెక్కిన పల్చని చెక్కలు... చిలింపట్టి ఎప్పుడు విరిగిపోతాయో అనిపించే చక్రాలు... కప్పల్ని మింగిన పాముల్లా అక్కడక్కడ ఉబ్బి ఉన్నటైర్లు... పాతబడ్డ తరాజు... ఒకటి రెండు బాట్లు... కొన్నిరాళ్ళు...ఆబండి రోగానపడ్డ ముసలాడిలా వుంది.

తెల్లవారు జామున నాలుగ్గంటలకే లేచి, వరంగల్ మార్కెట్‌కెళ్ళి హోల్‌సేల్ దుకాణంలో కూరగాయలు కొనుక్కొని, బండిమీద పేర్చుకుని, ఎనిమిదిగంటలలోపుగా ఆ కాలనీకి వస్తాడు రాయలింగు.

అతడాకాలనీకే రావడానికి రెండు కారణాలున్నాయి. కూరగాయల మార్కెట్‌కు ఆకాలనీ దూరంగా వుండటం ఒక కారణం. ఆ కాలనీలో రోడ్డుసరిగా వుండవు. వర్షాకాలం నడవడానికే ఇబ్బంది! ఆ దారికి భయపడి ఇతరబేరగాళ్ళు అటురాకపోవటం మరోకారణం.

రాయలింగు తెచ్చే కూరగాయలు తాజాగా

# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి



# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రాచుర్య పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.ఎన్.రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.

డబ్బుకోసమేనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చెంత !!



**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిస్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

కనిపిస్తాయి తప్ప, తాజాగా వుండవు.

అయినా ఎనిమిదిన్నరకల్లా పిల్లల్ని బడులకూ, భర్తల్ని ఆఫీసులకూ పంపాల్సిన గృహిణులు ఆ కూరగాయల్నే కొంటారు.

ఎనిమిదిన్నర దాటితే లోకల్స్ దొరక్క పిల్లలకూ, ఉద్యోగులకూ ఇబ్బంది. ఆ లోపల వాళ్ళు తయారు కావడమే అడావిడి తప్ప, కూరగాయలు తెచ్చే సమయం దొరకదు.

రాయలింగుది ఖచ్చితమైన బేరంకాదు. చెప్పిన ధరకు ఐదు పది పైసలు దిగి అమ్ముతాడు.

అందుకే, ఎక్కువ రాకపోయినా, సరుకులు మాత్రం అమ్ముడుపోతాయి.

"వంకాయలెట్లిస్తున్నావ్?" ఒకావిడ కేకేసింది.

"పావుకిలో రూపాయి పావలా" బండిని ఆ ఇంటి ముందుకు తోశాడతను.

"మార్కెట్‌లో ముప్పావలేకదా! పైగా ఇవి వాడిపోయాయ్" కుప్పను కెలుకుతూ, మంచివి ఏరుకుంటూ అందామె.

"మార్కెట్ ధరకే నేనుగూడమ్మితే నేనెట్ల బత్కాలెతల్లీ" తాను ఎక్కువధర చెప్పినట్లొప్పుకున్నాడు రాయలింగు.

"లేదు లేదు... రూపాయికిస్తే ఇవ్వు, లేకుంటేలేదు" ఏరినవి త్రాసులోవేస్తూ అందామె.

"సరే తల్లీ! అట్లనే తీసుకో" అరకిలో జోకి ఓ కాయ కొసరేశాడు.

"ఈడికీడనే అర్ధరూపాయి సంపాదించినవ్... కాస్త తాజా కూరల్ని తీసుకుని పొద్దునే రాలేవూ? పైగా ఇవి రేపు వండుకునేవాయె" వంకాయల్ని కొంగులో వేసుకుంటూ రెండు రూపాయల నోటునందిస్తూ అందామె.

"బజారుకు సరుకుగిట్లనే వస్తాందమ్మగారూ! ఇంకేం తీసుకోరా?" నోటందుకుంటూ అన్నాడతను.

"ఏం సరుకులోయేమో! సాయంత్రం తెచ్చుకోడానికి ఇంట్లో అందరికీ బద్ధకమేనాయె. రేపు తీసుకుంటగానీ కాస్త మంచికూరలు తేవయ్యా" ఇంట్లోకి నడుస్తూ అందామె.

"సరే తల్లీ... గట్లనేతెస్త" బండిని తిప్పాడతను.

రాయలింగు దగ్గర సరుకులు కొనే ప్రతివారూ ఏదో ఒటి అంటూనే వుంటారు.

'మంచికూరలుతేవయ్యా.. ఇంకాస్త పొద్దునే రారాదూ?... కొత్త త్రాసుకొనుక్కో... ఆ రాళ్ళు సరిగ్గా ఉన్నట్టులేవు. కొత్త బాట్లు కొనుక్కో...' ఇలా సలహానో, ఆదేశాన్నో ఇస్తూనేవుంటారు.

రాయలింగు ప్రతిరోజూ 'అలాగే' అంటూ వుంటాడు. ప్రతిరోజూ ఎప్పటిలానే వస్తూ వుంటాడు.

ఐదారు వీధులు తిరిగేసరికల్లా సరుకుల మున్నైపోయాయి.

పెట్టుబడి పోను పదిహేను రూపాయిలూ, పుచ్చువీ పాడైనవీ కొన్ని కూరగాయలూ మిగిలాయి.

బండిని వెనక్కితిప్పి ఒక దీర్ఘనిశ్వాసాన్ని విడిచాడు రాయలింగు.

అతడు బస్తీకొచ్చి ఈ వ్యాపారం మొదలుపెట్టి మూన్నెల్లయింది. మొదట్లో అతనికి ఒకపూట తిండి దొరకటమే కష్టమయ్యేది. ఇప్పుడిప్పుడు పదోపదిహేనో మిగులుతున్నాయి.

ఇంట్లో భార్యాకూతురూ అంతో ఇంతో సంపాదిస్తున్నారు. బట్టా పొట్టా వెళ్ళిపోతోంది.

'తన ఆలోచనకో రూపం వస్తోంది... తన బతుక్కు ఓ ఆధారం దొరికినట్లనిపిస్తోంది. తన వూళ్ళోనే వుంటే ఈ పాటికి తన కుటుంబమేమై పోయేది?' అనుకున్న రాయలింగుకు. ఆ రోజులు మనసుపట్టిన అద్దాలగుండా కనిపించినట్లుగా దృశ్యాలుగా ఒక్కొటీ కనిపించసాగాయి.

★ ★ ★

వరంగల్‌కు నలభై కిలోమీటర్ల దూరంలోవున్న ఓ పల్లెటూరు రాయలింగుది.

ఆవూళ్ళో తాతముత్తాతల కాలంనుండీ ఎదుగూబొదుగూ లేకుండా, ఊరునానుకుని పదిగుంటల భూముండి రాయలింగుకు.

ఆ భూమంటే అతనికి పంచప్రాణాలు. అందుకే ఆ భూమిలోనే ఓ ఇల్లేసుకున్నాడు.

ఆరు గజాల పొడుగూ, నాలుగ్గజాల వెడల్పూవున్న ఒక గది. దాన్నానుకుని మరో చిన్న

గది. మట్టి గోడలులేపి గూన వేసుకున్నాడు. వెనుక వంటకోసం చిన్న తాటాకుల పాక వేసుకున్నాడు. బావి తవ్వుకున్నాడు. జాలారుకూ, స్నానానికీ పొరుకలదడి కట్టుకున్నాడు. ఇంటిముందు పందిరి వేసుకున్నాడు. ఇంటి చుట్టూ చెట్లు పెంచుకున్నాడు.

రాయలింగుది వంశపారంపర్యంగా పాలేరు వృత్తే. అయితే అతడావూరి పెద్ద భూస్వామి సేరిదారు- పెద్ద పాలేరు.

గౌరమ్మ వెనుకంతల మనిషి. కూలీలను మాట్లాడి పిల్చుకొచ్చి పనిచేయించడం, కూలి వాళ్ళకు ముందుంటూ పనిచేయడం ఆమె పని. దానివల్ల ఆమెకో కూలీ ఎక్కువ వచ్చేది.

గౌరవంగా గుట్టుగా రాయలింగు సంసారం గడిచేది.

రాయలింగుకు ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టిపోయారు. తర్వాత చాలా కాలానికి భిక్షపతి పుట్టాడు. భిక్షమెత్తుకొనైనా సరే... ఆరోగ్యంగా బతకాలని అతనికాపేరు పెట్టారు. తర్వాత మల్లికాంబ పుట్టింది. ఆ తర్వాత మరి సంతానం కలుగలేదు.

ఇద్దరు పిల్లల్నీ కళ్ళలో పెట్టుకుని పెంచుకున్నా ఆ దంపతులకు భిక్షపతంటే వెర్రి ప్రేమ.

రాయలింగు పలుకుబడినీ, గౌరమ్మ తెలివితేటల్నీ ఇద్దరు పిల్లలతో సుఖంగావున్న వాళ్ళ సంసారాన్నీచూసి అందరూ రాయలింగును అదృష్టవంతుడన్నారు.

భిక్షపతిని పదేళ్ళదాకా ఊరిబడిలో చదివించారు. ఐదో తరగతికి మరోవూరుకు పంపించే ఇష్టమూ, అవకాశమూలేక చదువాపేశారు.

వ్యవసాయప్పనుల్లో ఆరితేరితే, ఊళ్ళోనే కళ్ళముందుంటూ, ముందుముందు తనలానే సేరిదారవుతాడని తనకుతాను సరిపెట్టుకున్నాడు రాయలింగు. ఆ తర్వాత భిక్షపతి చదువు గురించాలోచించలేదు.

మొదట్లో బర్రెల్నీ తర్వాత గొడ్లనూకాసి, కొన్నాళ్ళు చిన్న జీతగాడై, ఇరవైయేళ్ళు దాటేసరికి భిక్షపతి పెద్ద జీతగాడైనాడు.

రాయలింగు ఎనిమిది కుంచాల సేరితనం, భిక్షపతి ఆరు కుంచాల జీతం, గౌరమ్మా మల్లికాంబల కూల్లు... రాయలింగు సంసారం సుఖంగా గడచిపోయేది.

భిక్షపతికి ఇరవై రెండేళ్ళు, మల్లికాంబకు పద్దెనిమిదేళ్ళు వచ్చాయి. ఇద్దరికీ మంచి సంబంధాలుచూసి ఒకేసారి పెళ్ళిచేయాలనుకున్నాడు రాయలింగు.

అలా... హాయిగా వాళ్ళను చూసుకుంటూ కాలం గడపాలనుకున్న రాయలింగు కలలు ఒకేసారి కల్లలైపోయాయి.

ఒక్క సంవత్సరంలోనే ఊర్లో అనేక మార్పులొచ్చాయి. రాయలింగు ఊహల్నీ జీవితాన్నీ ఒక్క కుదుపుతో తారుమారు చేశాయి.

ఊళ్ళోకి ఓపార్టీ వాళ్ళు వచ్చారు. ఆడామగా కలిసి పదిమంది దాకావున్న కోడెవయసు పిల్లలు వాళ్ళు. ఆటలతో, పాటలతో వాడవాడా, ఇల్లిల్లూ తిరిగి ఊళ్ళోవాళ్ళందర్నీ ఆకర్షించారు. ఊళ్ళోని యువకులు చాలామంది వాళ్ళతో కలిసి తిరగడం మొదలెట్టారు.

వారం రోజుల్లోనే ఊళ్ళోని యువకులతో వాళ్ళో యువజన సంఘాన్ని పెట్టించారు. వాళ్ళకు ఆటలూ పాటలూ నేర్పారు. రాత్రి పాఠశాలలు నడిపారు.

మరోవారం రోజుల్లోనే భూస్వాముల నుండి ప్రతిఘటన వచ్చింది. వాళ్ళు సంఘంనుండి యువకుల్ని చీల్చే ప్రయత్నాలు చేశారు.

ఫలితంగా సంఘంవాళ్ళు పాలేర్లతో, కూలీలతో పనులు బందు చేయించారు. వ్యవసాయ ప్పనులన్నీ ఆగిపోయాయి.

నాలుగు రోజుల తర్వాత భూస్వాములకూ, సంఘంవాళ్ళకూ చర్చలు జరిగాయి. ఇద్దరిమధ్యా ఓ ఒప్పందం కుదిరింది.

పాలేర్ల జీతాలు పెరిగాయి. రోజుకూలీ పెరిగింది. వాళ్ళ బతుకునుండి భయం పారిపోయింది.

వీలు దొరికినప్పుడల్లా సభలూ, సమావేశాలు జరిగాయి. సంఘంవాళ్ళు ఎన్నో విషయాలు చెప్పారు.

ఈ భూమి దున్నేవానిదే అన్నారు. దేవుళ్ళు దయ్యాలు లేవన్నారు. పనిచేసేవాళ్ళే దేవుళ్ళన్నారు. కులం లేదన్నారు. మతం వద్దన్నారు. ఓట్లు వేయడం మోసమన్నారు. ఓట్లు వేయొ




ద్దన్నారు. ఇంకా ఎన్నోఎన్నో విషయాలను ఊళ్ళోవాళ్ళకు వివరించి చెప్పారు.

ఆ ఒక్క ఊళ్ళోనేకాక వాళ్ళు చుట్టుపక్కల వున్న పదూర్లల్లో సంఘాలు పెట్టారు. సభలు జరిపారు.

కొద్దికాలంలోనే ఆ ప్రాంతంలో కొత్త పరిస్థితి ఏర్పడింది. పంచాయితీల తీర్పులు సంఘంవాళ్ళే చెప్పుతున్నారు.

అంతటితో ఆగకుండా-ఇదివరకు తీర్పులు చెప్పి దరువతులకింద పెద్దలు వసూలుచేసిన డబ్బుల్ని తిరిగి ఇప్పించడం మొదలెట్టారు. ఇవ్వనివాళ్ళని బెదిరించారు. కొందర్ని చంపుతామని గడువుపెట్టారు.

క్రమంగా ఆ ప్రాంతపు కూలీనాలీ జనం ఒక్కటైనారు. ఒక వూళ్ళో సంఘంవాళ్ళు ఒక భూస్వామిని బహిరంగంగా విచారించి కొట్టారు. ఇంకో ఊళ్ళో ఒక షావుకారు పత్రాల్ని చించి, అప్పులు తిరిగిఇవ్వం అన్నారు. మరో ఊళ్ళో సంఘానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నాడని ఒకన్ని చావుదెబ్బలు కొట్టారు.

ఇట్లావుండగా ఊర్లోకి ఓ పోలీస్ వ్యాన్ వచ్చింది. ముందే ఎలా తెలుసుకున్నారో కాని సంఘాల్ని స్థాపించిన వాళ్ళంతా పారిపోయారు.

పోలీసులు ఊళ్ళోని యువకుల్నందర్నీ వ్యాన్‌లో ఎక్కించుకుని వెళ్ళిపోయారు. అందులో భిక్షపతి కూడా వున్నాడు.

ఊరంతా ఏడ్పులతో అరుపులతో నిండిపోయింది.

రాయలింగు తన యజమాన్ని కలిసి, తన కొడుకును విడిపించమని కాళ్ళావేళ్ళాపడి బతిమాలుకున్నాడు.

తానా విషయంలో ఏమీచేయలేననీ, విడిపించే ప్రయత్నంచేస్తే తననూ పోలీసులు పట్టుకుంటారనీ, ఆ సంఘంవాళ్ళే వచ్చి వీళ్ళను విడిపించాలనీ, ఆ విషయంలో తన దగ్గరకు రావద్దని కచ్చితంగా చెప్పాడు యజమాని.

రాయలింగు హతాశుడయ్యాడు... అలమటించిపోయాడు.

చివరకంతా కలిసి పక్కవూళ్ళోని ఒక నాయకుణ్ణి కలిశారు. తలెముంతలమ్ముకుని, అప్పులుచేసి, తలామూడొందల రూపాయలు అతని చేతిలో పోశారు.

అటుతిరిగి ఇటుతిరిగి ఆ నాయకుడు వారంరోజులకు అందర్నీ విడిపించాడు.

వచ్చినవాళ్ళంతా... ఏండ్లకిందటి నుండి నవిసిపోయిన వారిలావున్నారు. ఒక్కడూ సరిగ్గా నడువలేకపోయాడు.

"పార్టీ వాళ్ళెవరు? సంఘం వాళ్ళెవరు? వాళ్ళేం చెప్పారు? ఇప్పుడెక్కడున్నారు? వసూలుచేసిన డబ్బంతా ఏంచేశారు? ఇంకా ఏమేం చేయాలనుకున్నారు?" అని అడుగుతూ పోలీసులు వాళ్ళను హింసించారట.

కొడుకునావిధంగాచూసి రాయలింగు గుండెలవిసిపోయాయి. గౌరమ్మ యేడ్పు కంతులేకపోయింది.

కడుపులో పెట్టుకుని, కళ్ళల్లో వత్తులేసుకుని గారాబంగా పెంచుకున్న కొడుకునాస్థితిలో చూసి ఆ దంపతులిద్దరూ హడలిపోయారు.

సంఘంవాళ్ళనూ, పోలీసుల్నీ తిట్టారు. ఈసారి సంఘంవాళ్ళు వస్తే వాళ్ళ నీడకూడా తొక్కవద్దని కొడుక్కి చెప్పారు.

వారంరోజులు గడిచాయి. భిక్షపతి ఇంకా పూర్తిగా కోలుకోనేలేదు. పనికి పోనీయకుండా ఇంట్లోనే ఉంచి జాగ్రత్తగా చూసుకుంటున్నారు. అంతలో మళ్ళీ పోలీస్ వ్యాన్ ఊళ్ళోకి వచ్చింది.

తమమీద కంప్లయింటిచ్చాడని ఒక ఊళ్ళో ఎవరిమీదో పార్టీవాళ్ళు దాడిచేశారట. తమ ఆచూకీ తెలిపాడని మరో ఊర్లో ఒకనిచేయి నరికేశారట. ఇంకో ఊర్లో ఇల్లు తగులబెట్టారట. రాత్రిళ్లు కావలికిపోయే పాలేర్లు వాళ్ళకు తిండిపెడుతున్నారట.

ఈసారి పోలీసులకందరూ దొరుకలేదు. దొరికిన వాళ్ళనే వాళ్ళు తీసుకుపోయారు. అందులో కూడా భిక్షపతి వున్నాడు.

అప్పుడు ఊళ్ళోనే ఓ పైరవీకారు బయలుదేరాడు. అప్పటిదాకా లీడర్ల దగ్గరుండి పైరవీలు నేర్చుకుని ఇప్పుడతడు చిన్న లీడరై పలుకుబడి పెంచుకున్నాడు.

అవీ ఇవీ... చివరకు తిండి గింజలు కూడా



అమ్ముకుని, అప్పులుచేసి కొడుకుల్ని విడిపించుకున్నారు తలిదండ్రులు.

ఇంటికొచ్చిన కొడుకునుచూసి రాయలింగు గుండె చెరువైపోయింది... గౌరమ్మ తల్లడిల్లిపోయింది.

మోచేతులూ, మోకాళ్ళూ వాచాయి. వీపు నిండా వాతలు... కండ్లూ, చెంపలూ లోపలికి ఈడ్చుకుపోయి, అస్థిపంజరంలా మారిపోయాడు భిక్షపతి.

"ఆ సంగపొల్ల దగ్గిరికెందుకు పోయినవ్ కొడుకా" అంటూ భిక్షపతిని కౌగిలించుకొని ఏడ్చింది గౌరమ్మ.

'తానుపోలేదనీ, వాళ్ళు కూడా రాలేదనీ, ఇదంతా ఎవరో చేయిస్తున్న పననీ' తెలిపాడు భిక్షపతి.

తానిన్నాళ్ళు చేసిన సేవలూ, దొరలకూ తనకూ వున్న సంబంధం, తన మంచిపేరు... ఇవేవీ తనకు అక్కరకు రాకుండా పోయాయే అని... మొదటిసారిగా తననుతాను చూసుకున్నాడు రాయలింగు. ఎంతో పెద్దగా, గంభీరంగా వుండే తన రూపం పొట్టిగా వికారంగా కనిపించి కుమిలిపోయాడు.

వారంపదిరోజులు భయంభయంగా గడచిపోయాయి. పగలూ రాత్రీ కొడుకును వదిలిపెట్టకుండావుంది గౌరమ్మ. రాయలింగు కూడా కొడుకేం చేస్తున్నాడో, ఏమాలోచిస్తున్నాడో గమనించాడు.

మళ్ళీ ఆ ప్రాంతంలో అలజడి..



సంఘంవాళ్ళు ఒక ఊర్లో దొరమీద బాంబులు విసిరారట. మరోవూర్లో పోలీసులకూ, వాళ్ళకూ కాల్పులు జరిగి ఇద్దరు ముగ్గురు చనిపోయారట. మరోచోట పోలీసులమీద దాడిచేసి, ఒక పోలీసును చంపి తుపాకులెత్తుకుపోయారట.

అంతే... పోలీసు వ్యాన్లు ఊర్లలో ఎడతెగకుండా తిరిగాయి. పోలీసులు యువకుల్ని వేటాడి పట్టుకుపోయారు. అనుమానమున్న ప్రతివారినీ ప్రశ్నించారు... హింసించారు... పట్టుకుపోయారు.

అప్పటికే కొందరు యువకులు సంఘం వాళ్ళలోచేరి వాళ్ళతో వెళ్ళిపోయారు. కొందరు ఊరువిడిచి పారిపోయారు. ఎటూపోనివారు పనులు విడిచి జాగ్రత్తపడుతున్నారు.

ఊర్లోకి వ్యాన్‌వచ్చే వార్త ముందే తెలిసిపోతోంది. వ్యాన్ వచ్చీరాగానే యువకులు కొండల్లోకి పోయో, మరో ఊరుకు పారిపోయో దాక్కుంటున్నారు. వ్యాన్ వెళ్ళిపోగానే తిరిగివస్తున్నారు. పోలీసులు తండ్రుల్నీ తాతల్నీ పట్టుకుపోతున్నారు. ఆడామగా భేదంలేకుండా అందర్నీ హింసిస్తున్నారు. ఊరును అల్లకల్లోలంచేసి, 'వారం రాజుల్లో వాళ్లను తెచ్చి ఒప్పజెప్పకపోతే ప్రాణాలు దక్కవని' హెచ్చరిస్తున్నారు.

రాయలింగూ, గౌరమ్మా దెబ్బలుతిన్నారు. పోలీసులకు దొరకకుండా భిక్షపతిని కాపాడారు.

దెబ్బలు భరించలేక ఊరునుండి కొన్ని కుటుంబాలే వెళ్ళిపోయాయి. ఊళ్ళో పనులు స్తంభించిపోయాయి. కూలీ నాలీ చేసుకు బతికేవారు 'ఎప్పుడు పోలీసులొస్తారో... ఎప్పుడు పట్టుకుపోతారో' అన్న భయంతో పనులు మాని... తిండిలేక తల్లడిల్లిపోయారు.

రాయలింగూ, గౌరమ్మా ఏడ్వని క్షణంలేదు.

'భిక్షపతికి సంఘం వాళ్ళతో సంబంధంవున్నదో లేదో తమకు తెలియదు. సంబంధం లేదన్నా పోలీసులు వదిలేటట్టులేరు. ఒకవేళ నిజంగానే సంఘం వాళ్ళతో కలిసి, ఇప్పుడు వాళ్ళనొదిలేస్తే వాళ్ళూ వదలరు. ఏవిధంగా చూసినా భిక్షపతి తమకు దక్కేట్టులేడు' అనుకున్నారా దంపతులు.

'చావగా చావగా మిగిలిన ఒక్క కొడుకు... ప్రాణాలన్నీ వానిమీదే పెట్టుకుని బతుక్కు అర్థం వెదుక్కుంటున్న తాము... ఈ ఊళ్ళో వుంటే... ఈ బాధలు భరించలేక భిక్షపతి సంఘంవాళ్ళతో కలిసి వెళ్ళిపోయినా వెళ్ళిపోవచ్చు... ఎటుచూసినా భిక్షపతి తమకు దక్కుతాడనిపించడంలేదు. వాన్ని దక్కించుకోవాలంటే, ఊరిడిచివెళ్ళిపోవాలి. వాని కోసమే కదా తమ బతుకులు!' అనుకున్నారిద్దరూ.

'ఎవని సుఖంకోసం తాము బతుకుతో పోరాడుతున్నారో వానికోసం ఊరేమిటి... ప్రాణాలైనా సరే విడుద్దాం' అని వాళ్లు నిర్ణయించుకున్నారు.

అంతే... తాను పాలేరుగా కుదిరినప్పుడు

తీసుకున్న అప్పుబాకీకింద ఇల్లు కుదువబెట్టి... మూటాముల్లే సర్దుకుని కుటుంబంతోసహా వరంగల్ వచ్చేశాడు రాయలింగు.

వస్తూనే తనకు దారిచూపించమని దేవయ్యను కలిశాడు.

ఆ ప్రాంతంనుండి వచ్చే బీదా బిక్కీ రాగానే దేవయ్యను కలుస్తారు. దేవయ్య వాళ్ళకు చిన్న చిన్న పనులుచేస్తూవుంటాడు. బతకడానికొచ్చిన వారికి బతుకుదారి చూపిస్తూవుంటాడు... గుడిసెలకు స్థలాలిప్పిస్తూవుంటాడు.

దేవయ్యది కూడా ఒకప్పుడు రాయలింగు వూరే. పదిహేనేళ్ళ క్రితం ఊరొదిలి వచ్చాడు. కట్టమీద ఒక కొసకు... హనుమాండ్ల గుడివక్క గుడిసేసుకుని స్థిరపడ్డాడు. ఆనాటినుండి అక్కడేవుంటూ కొంత పలుకుబడి సంపాదించాడు.

ఆ దేవయ్య రాయలింగును చేరదీశాడు. చెరువు కట్టమీద గుడిసె స్థలం చూపించాడు. అంతేకాదు... కూరగాయల వ్యాపారానికి సర్దార్ గిరిగిరి బ్యాంకు నుండి అప్పుకూడా ఇప్పించాడు. ఆ విధంగా మొదలయింది రాయలింగు వరంగల్ జీవితం.

పల్లెటూళ్ళో గుడిసెలూ, కొట్టాలూ కట్టిన అనుభవంతో ఇక్కడ కూడా రాయలింగు స్వంతంగా తనకు నచ్చినట్లు గుడిసేసుకున్నాడు.

వెనుకాముందూ స్థలం... రెండు చిన్న గదులు... ముందు పందిరి... వెనుక జాలారు... చుట్టూ దడి...

మట్టిగోడలు తానూ తన భార్యాపిల్లలూ కలిసి కట్టుకున్నా... బొంగులకూ, పైనకప్పే పాత డబ్బాల రేకులకూ, పందిరిగుంజలకూ, పొరుకలదడికీ, రాయలింగు ఊరునుండి తెచ్చుకున్న డబ్బేకాక, గౌరమ్మ వెండికడియాలు ఖర్చయ్యాయి.

గౌరమ్మా మల్లికాంబలు, అంట్లు తోమి పాచి పనులు చేసేందుకు ఇళ్లు చూసుకున్నారు.

వరంగల్ వచ్చింతర్వాత ఓ ఇరవై రోజులు భిక్షపతి పనేచేయలేదు. తర్వాత కొన్నాళ్ళు బొంబాయి మిఠాయి, అల్లం మురబ్బాలమ్మాడు. మరి కొన్నాళ్లు సినిమాహాలు దగ్గర పల్లీలు, బఠాణీలు అమ్మాడు. కానీ ఏ పనిలోనూ స్థిరపడలేదు.

భిక్షపతితో కూలిపని చేయించే ప్రయత్నం చేశాడు రాయలింగు. కాని భిక్షపతి అందుకొప్పుకోలేదు.

దినదినమూ సంపాదన ఖర్చులకే చాలకపోయేసరికి రాయలింగు దిగులు పడిపోయాడు. కొడుకు రోజూ అంతో ఇంతో సంపాదిస్తే బాగుండుననుకున్నాడు. దేవయ్యతో చెప్పి ఏదన్నా చిన్నపనిలో ఇరికించాలనుకున్నాడు.

'నిజంగా దేవయ్యే లేకపోతే తనగతి ఏమయ్యేది? ఈ మహాపట్నంలో తనకు గుడిసె ఎలా నిలబడేది? తామెక్కడ వుండేవారు? తనకప్పెవరిచ్చేవారు?' అనుకున్న రాయలింగు మనసులోనే దేవయ్యకు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

'ఈ వ్యాపారం ఇలాగే నడుపుకుంటూ రోజూ తనే పదిహేనిరవై రూపాయలు సంపాదించొచ్చు. పనిలోకెక్కితే కొడుకుకూడా పదో పదిహేనో తెస్తాడు. అప్పుడు తన రాబడి పెరుగుతుంది'

'అప్పుడు వారంవారం సర్దార్‌కు కట్టాల్సిన కిస్తులు సులభంగా కట్టి అప్పు తీర్చేయవచ్చు. కొంతకాలానికి స్వంత పెట్టుబడితో వ్యాపారం నడుపుకుంటే కొంతకొంత వెనకేసుకుని స్వంత బండి కొనుక్కోవచ్చు. అపుడు బండి కిరాయ కూడా మిగులుతుంది. అలా అలా...మరికొంత కాలానికి కాలనీలోనే ఓ కూరగాయల డబ్బా తెరువవచ్చు. ఆ తర్వాత కొంతకాలానికి మంచి సంబంధాలు చూసి పిల్లలిద్దరికీ పెళ్ళిళ్లుచేసి... వాళ్ళను చూసుకుంటూ హాయిగా తను....' ఇట్లా కలలుకంటూ బండిని నెమ్మదిగా తోసుకుంటూ రాయలింగు తన గుడిసెకు చేరుకున్నాడు.

★ ★ ★

తన దగ్గరున్న డబ్బంతా లెక్కించుకున్నాడు రాయలింగు.

వందా పదిహేను రూపాయలూ, కొంత చిల్లరా వున్నాయి.

సర్దార్ కిస్తు ముప్పై, బండి కిరాయి ఇరవై పోగా ఇంకా అరవైయ్యైదు రూపాయలు మిగు





లుతాయి. పది ఇంట్లోకి, ఐదు తన ఖర్చుకూ పోతే ఇంకా యాభై రూపాయలు పెట్టుబడికి మిగులుతాయి.

ఈ యాభై రూపాయల పెట్టుబడిని వంద రూపాయలుగా పెంచాలని మూన్నెళ్ళుగా ప్ర యత్నిస్తున్నా రాయలింగుకు అది సాధ్యంకా వడం లేదు.

నెలకోసారి కట్టాల్సిన బండి కిరాయి అంత భారమని పించడం లేదుగాని... వారం వారం కట్టాల్సిన సర్దార్ కిస్తు రాయలింగుకు ఎంతో భారమనిపిస్తోంది.

సర్దార్‌ది గిరిగిరి బ్యాంకు. గిరిగిరి బ్యాంకంటే మనీ రోలింగ్ బ్యాంకు. డబ్బు గిరగిరా తిరిగి, డబ్బు పిల్లల్ని పెట్టే బ్యాంక్.

ఊరి నిండా ఎన్నో గిరిగిరి బ్యాంకులు న్నాయి.

సైకిళ్ళపై, లూనాలపై, మోటర్ సైకిళ్ళపై, స్కూటర్‌లపై స్వయంగా తిరుగుతూ ఈ బ్యాంకుల్ని నడిపేవారు, సాయంత్రాలు చౌర స్తాల్లో విరివిగా కనిపిస్తారు.

ఐస్‌ఫ్రూట్లమ్ముకునేవారు మొదలుకొని, వేల వ్యాపారం చేసుకునేవారు కూడా ఈ బ్యాంకుల్లో అప్పులు తీసుకుంటారు.

గవర్నమెంట్ బ్యాంకుల్లో వసూళ్లు ఆలస్యం అవుతాయేమోకాని, ఈ బ్యాంకుల్లో వాయిదానా డే వసూలయి తీరుతాయి.

వేయి రూపాయల పెట్టుబడితో సంవ త్సరం తిరక్కుండానే రెండు, మూడు, నాలుగు వేలు సంపాదించినవాళ్ళు ఎంతోమందున్నా రు.

తెగువా, సాహసంతోపాటు దయలేకుండా ఉంటే చాలు... ఈ వ్యాపారం సునాయాసంగా నడుపుకోవచ్చు.

పది రూపాయలు ముందువాయి...అంటే లాభం, రెండు రూపాయలు కాగితాల ఖర్చు పట్టుకొని 88/- రూపాయలిచ్చి వంద రాసు కుంటారు. ఆ తర్వాత రోజూ ఒక రూపాయి చొప్పున వందరోజులూ వంద రూపాయలు వసూలు చేస్తారు. అంటే ఆ వందరోజుల్లో 24 రూపాయలు లాభం.

ఈ పద్ధతిలో ఆరు శాతమో, ఏడు శాతమో వడ్డీ గిడుతుందని అనుకుంటే అది తప్పే అవుతుంది. గిరిగిరి బ్యాంకుల్లో నూటికి నూరు శాతమూ... ఇంకా అంతకన్న ఎక్కువే వడ్డీ వస్తుంది. పెట్టుబడి ఎక్కువైనకొద్దీ వడ్డీ శాతం ఎక్కువవుతుంది.

వారంవారం వసూలు చేసే పద్ధతిలో ఈ లాభం స్పష్టంగా కనిపిస్తుంది.

వేయి రూపాయలతో గిరిగిరి బ్యాంకు నడ పడం మొదలుపెట్టినవాడు ఆ వేయి రూపా యల్ని ఒక్కొక్కరికి 80 రు.ల చొప్పున 11 మందికి అప్పిస్తాడు. పదకొండు వందలు అత నికి బాకీలుంటాయి.

వారం తిరిగేసరికి ఒక్కొక్కరూ 30 రు.ల చొప్పున చెల్లిస్తే అతనికి 330/- రు.లు వస్తాయి. ఆ వారంలో అతడు మరో ముగ్గురికి అదే పద్ధతిలో అప్పిస్తాడు. రెండోవారం అతని కి 11+3=14X30=420/- వస్తాయి.

ఈ డబ్బునూ, వేయిలో మొదటివారమూ, రెండో వారమూ మిగిలిన డబ్బూ కలిపితే మరో ఐదుగురికి అప్పుపెట్టవచ్చు. ఆ వారాంతంలో అతనికి 11+3+5=19X30=570/- వస్తాయి.

అలా కాతాదార్లూ, వాళ్ళిచ్చేడబ్బూ పెరు క్కుంటూపోయి సంవత్సరం నాటికి వేయిరూ పాయలు రెండువేలూ, అంతకుపైనే అవు తాయి. పెట్టుబడి వేలల్లో వుంటే ఆదాయం లక్షల్లో వస్తుంది.

అలా అనేక పద్ధతుల్లో అనేకాలైన గిరిగిరి బ్యాంకులున్నా ఊళ్లో అన్నిటికన్నా పెద్ద గిరి గిరి బ్యాంకు సర్దారుదే.

మొదట్లో అంతటా ప్రచారంలో వున్న పద్ధ తులు అనుసరించినా, తర్వాత్తర్వాత అతనిష్ట మొచ్చినట్లుగా వడ్డీ పద్ధతుల్లో డబ్బు వసూలు చేస్తూ వున్నాడు సర్దార్. ఒక్కోసారి అతడేపద్ధ తిలో వడ్డీ తీసుకుంటాడో తెలియదు. అయినా... చిన్న వ్యాపారస్థులు మొదలుకొని అతిపెద్ద వ్యాపారస్థులు అతని కాతాదారుల్లో వున్నారు.

ఒకనికి ప్రాణం మీదకువచ్చి అప్పడిగాడు. సర్దార్ గుత్తామాట్లాడి రు. 200 ఇచ్చాడు. సరిగ్గా మూడునెలలు నిండిన్నాడు రు. 350

వసూలు చేశాడు.

అట్లాగని ప్రాణం మీదికి వచ్చినప్పుడే అప్పిస్తాడని కాదు. మామూలు అవసరాలకు కూడా ఇస్తాడు. అయితే వసూలు పద్ధతులు ఒకదానికొకటి కలువకుండా విచిత్రంగా వుంటాయి.

ఒకనికి 1000/- రూపాయలిచ్చి ఏడునెలలకు 1330/- రూపాయలు వసూలు చేశాడు. 30 రూపాయలు కాగితాల ఖర్చు, మూడు శాతం వడ్డీ మాత్రమే తీసుకున్నానన్నాడు. అట్లయినా 240 రూపాయలే అవుతాయి... మిగతా 90 రూపాయలెందుకు? అని ఎవరూ అడగలేదు.

డబ్బు రూపంగానేకాక పనిరూపకంగా కూడా వడ్డీ తీసుకుంటాడు సర్దార్.

ఒక లంబాడీవాడు రు. 800 అప్పు తీసుకుని, అతనికి సంవత్సరంన్నర పనిచేశాడు. అయినా అసల్లో పైసా తగ్గలేదు. రోజుకు 10 రూపాయల కూలీ లెక్క కట్టినా ఈ పద్దెనిమిది నెలల్లో అతడు రు. 5400 వడ్డీ కట్టినట్లు... 5 రూపాయల కూలీ కట్టినా రు. 2700 వడ్డీ అవుతుంది. ఇంత వడ్డీయా అని అడిగే ధైర్యం లేక ఆ లంబాడీవాడు తనకున్నదంతా అమ్మేసి రు. 600/- కట్టి విముక్తి పొందాడు.

ఒక అభాగ్యుడు రు. 600 తీసుకుని తన కూతురును ఒక సంవత్సరం పనిమనిషిగా వుంచాడు. పది నెలలు గడిచాయి. ఆ అమ్మాయికి పెళ్ళి నిశ్చయమైంది. రు. 500 తీసుకుని అమ్మాయిని వదిలేయమని ఎంత బతిమాలినా సంవత్సరం కాలేదని సర్దార్ ఒప్పుకోలేదు. చివరకా వందరూపాయలకింద అతడు తనమేకపోతునిచ్చేసి కుమార్తెను విడిపించుకున్నాడు.

ఇలా చెప్పుకుంటూ పోతే సర్దార్ వడ్డీ వ్యాపారం గురించి ఓ పెద్ద గ్రంథమే అవుతుంది. అయితే చాలామందికి తెలిసిన సర్దార్ గిరిగిరి బ్యాంక్ పద్ధతులు మూడున్నాయి.

మొదటిది నెలవసూలు — దీన్నే కుదువ పద్ధతంటారు. దీనిలో సర్దార్ తానిచ్చే డబ్బుకు మూడింతల విలువైన వస్తువునో, ఇల్లునో, భూమినో, బంగారాన్నో తన దగ్గర పెట్టుకుని, నూటికి పది రూపాయలు పట్టుకుని డబ్బిస్తాడు. నెలవగానే నూటికి పది చొప్పున కలిపి డబ్బు తెచ్చివ్వాలి. లేకుంటే వడ్డీని అసలులో కలుపుతాడు. ఈ పద్ధతిలో సర్దార్ దక్కించుకున్న వెన్నో వున్నాయి.

రెండోది వారం వసూలు పద్ధతి. రు. 90 ఇచ్చి వంద రాసుకుంటాడు. వారానికి 30 చొప్పున నాలుగు వారాలు చెల్లించాలి.

ఇక మూడోది దినం వసూలు పద్ధతి. దీంట్లో కూడా ఇవ్వడం రాయడం అంతే. అయితే రోజుకు నాలుగు రూపాయల చొప్పున 30 రోజులు కట్టాలి. ఒక్కరోజు తప్పినా దాన్ని వారం కిందికి మార్చి, నాలుగు రూపాయలు జరిమానా తీసుకుంటాడు.

తాకట్టు పెట్టే వస్తువుల్లేనివాళ్ళంతా ఈ వారం, దినం పద్ధతుల్లో అప్పుతీసుకుంటారు.

రిక్షావాళ్ళు, గంపలబేరగాళ్ళు, అంగళ్ళబేరగాళ్ళు, ఇతర మారుబేరగాళ్ళు... ఎంతోమంది రోజూ సర్దారింటికి వస్తుంటారు.

ఐదారుగురు పహిల్వాన్లు, దాదాలు, వసూలు చుత్రాళ్ళు సర్దార్ దగ్గర నౌకర్లుగా వున్నారు.

పేదవాళ్ళకేకాదు పెద్దవాళ్ళకుకూడా సర్దార్ గిరిగిరి బ్యాంక్ వివరాలు తెలుసు. అయితే ఏం! సర్దార్ మున్సిపల్ ఛెయిర్మెన్‌కు కుడిభుజం. అధికార్లకూ, నాయకులకూ మిత్రుడు. తాను స్వయంగా పదిమంది కౌన్సిలర్‌లను గెలిపించుకున్నాడు.

రాయిలింగు మొదటరోజు వసూలు పద్ధతిలోనే అప్పు తీసుకున్నాడు.

వచ్చిన 90 రూపాయలలో రెండు బస్ కిరాయికూ, మూడు చాయ్‌టిఫిన్‌లకూ, పది ఇంట్లో ఖర్చుకూపోగా 75 రూపాయలతో వ్యాపారం మొదలుపెట్టాడు.

కొన్నాళ్ళది బాగానే నడిచింది. రోజూ అతనికి పది పదిహేను రూపాయలకు తక్కువ కాకుండా మిగిలేవి.

కాని నెలకాగానే బండికి ఒకేసారి ఇరవై రూపాయలు ఇవ్వాల్సి వచ్చినప్పుడూ, రోగమో నొప్పో వచ్చినప్పుడూ, పండగో పబ్బమో వచ్చిన




మండువేసవిలో కొన్ని కొన్ని అనుభూతులు చెప్పలేనివి.

మామిడిపండు, మల్లెపూలు, మల్లాది నవల...




మిట్టమధ్యాహ్నం ఎండలో తిరిగొచ్చి ఎయిర్‌కూలర్‌గదిలో, అప్పుడే ఫ్రిజ్‌లో నుండి తీసిన కోకోకోలా తాగిన అనుభూతిని గుర్తుతెచ్చే

ఆంధ్రుల ఆహ్లాదరచయిత
మల్లాది వెంకటకృష్ణమూర్తి తాజా నవల.

# "ఒక నువ్వు - ఒక నేను"

(వెల Rs. 24-95 న. పై.)

మార్చి 10 న విడుదలై మార్కెట్లో ఉంది.

ప్రతి సిగరెట్‌కి రెండు క్షణాల ఆయుర్దాయం తగ్గుతుందని చెప్పిన డాక్టర్లు, ప్రతి చిరునవ్వుకి నాలుగు క్షణాల ఆయుష్యు పెరుగుతుందని కూడా చెప్పారు. ఈ నవల చదివేప్పుడు ఎన్నిసార్లు నవ్వితే అన్నింటూ నాలుగు క్షణాల వయస్సు పాఠకుడికి పెరుగుతుందని గ్యారంటీ. అలా పెరగక, ఈ గ్యారంటీ అబద్ధం అయితే ఈ పుస్తకం వెల వడ్డీతో సహా వాపస్ అని హామీ ఇస్తున్నాం.

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్

మ్యూజియంరోడ్, విజయవాడ -520 002.

Phone:63322

ప్పుడూ అతనికిబ్బంది కలిగేది. పెట్టుబడి తగ్గేది-ఆదాయం తగ్గేది. అందుకే రెండోనెల లోనే నాలుగురూపాయలు జరిమానా చెల్లించి వారం పద్ధతికి మార్చుకున్నాడు.

అయితే వారం తిరిగేసరికల్లా 30 రూపాయలు ముల్లెకట్టడం అతనికి సాధ్యంకాలేదు. మరో నెల తిరిగేసరికి అతనికి చివరి కిస్తులో పదిరూపాయలు తగ్గిపోయాయి. అప్పుడు సర్దార్ 80 రూపాయలు ఇచ్చి వంద రాసుకున్నాడు.

ఈ నెల చివరికిస్తులో 15 రూపాయలు తగ్గాయి. అప్పుడతనికి 75 రూపాయలే దొరికాయి.

గౌరమ్మామల్లికాంబలు నెలజీతాలు తెచ్చినప్పుడు పెట్టుబడి కొంత మెరుగవుతోంది. కాని ఒకటి రెండురోజుల్లోనే తగ్గిపోతోంది.

నెలలు గడుస్తున్నా కొడుకింకా పనిలోకెక్కలేదనే బాధ ఈ కిస్తులు కట్టాల్సినరోజు కోపంగా బయటికి వచ్చేది.

'ఇప్పుడు కిస్తుకట్టి, బండి కిరాయ ఇచ్చినా 60 రూపాయలు మిగులుతున్నాయి. వాటిని వందచేసుకుని తగ్గకుండా చూసుకోవాలి. భిక్షపతి ఎంతో కొంత సంపాదిస్తే అలాగే అవుతుంది' అని ఆలోచించుకుంటూ సర్దారిల్లు చేరాడు రాయలింగు.

సర్దార్‌ది లంకంత మేడ. పెద్ద కాంపౌండు... కాంపౌండు నిండాచెట్లు. కాంపౌండుదాటి కొంతదూరం నడిచిన తర్వాత, ఏడుమెట్ల మీద.... రెండు స్తంభాల మీద ఎత్తుగా కట్టిన మేడ.

ఒక స్తంభానికి కట్టేసిన పులిలాంటి కుక్క. దానిలాగే భయంకరంగా కనిపిస్తూ ఓ వేపు నుంచున్న పహిల్వాన్లు. ఓ మూలకు తెల్లనిపరుపు...దానిముందో డెస్కు...డెస్కుమీద పెద్దపెద్ద కాతాబుక్కులు... ఓ కాతాబుక్కును పరిశీలిస్తూ పరుపుమీద కూర్చున్న గుమాస్తా.

అటూ ఇటూ సపోటా చెట్లు. వాటి చుట్టూ గుండ్రంగా సిమెంటు గద్దెలు. గద్దెలమీద అప్పుకోసం వచ్చిన మనుషులు.

ఓ పక్క బెంగుళూర్ గూనతో వేసినగది... ఆ గది నిండా వసూలు కుర్రాళ్ళు. గదిముందు వరుసగా సైకిళ్లు.

అంతమంది జనమున్నా కుక్కస్తంభం చుట్టూ తిరుగుతూ చేస్తున్న కుఁయ్‌కుఁయ్ శబ్దం తప్ప మరే శబ్దమూ విన్పించడంలేదు. కుక్క నిశ్శబ్దంగా వుంటే చీమచిటుకుమన్నా వినిపించేంత నిశ్శబ్దం.

తనకు తెలిసినవారిని చూపులతోనే పలకరించి ఓ చోట నుంచున్నాడు రాయలింగు.

సర్దారింకా బయటికి రాలేదు. స్తంభం చుట్టూ తిరుగుతూ ఎర్రని నాలుకసాచి సర్దార్ కోసం లోపలికి చూస్తోంది కుక్క.

ఇంతలో ఓ వసూలు గుమాస్తా ఒక మనిషిని తీసుకొచ్చాడు. అతని వెంట వచ్చిన అతని భార్య, ఒక పిల్లవాడూ దూరంగా నుంచున్నారు.

ఆ మనిషి ముఖం భయంతో పాలిపోయి వుంది. తలపీచులా పైకిలేచి, గడ్డం మాసిపోయి, దీనత్వమే ఆ రూపంతో వచ్చిందా అన్నట్లుగా వున్నాడతను.

అతని గుడ్డలు చినిగిపోయి దుమ్ముపట్టి వున్నాయి. ఆ చినుగులగుండా అతని శరీరం సగం తిన్న తర్వాత చెదలు దులిపిన కర్రలా బయటికి కనిపిస్తోంది.

కాసేపటికి పరదా తొలగించుకుని బయటికి వచ్చాడు సర్దార్.

తెల్లగా ఇస్త్రీచేసిన ఖద్దరు లాల్చీ, పైజామాలు, పైకి నున్నగా దువ్విన బట్టతల. నున్నగా క్షవరం చేసుకున్న కండపట్టిన ముఖం. పైకి ఉబికి వచ్చిన కళ్ళు. చెవుల చివర్లవరకూ బలిసిన మెడ. మెడలో సన్నగా మెరుస్తున్న బంగారు గొలుసు. మొట్టమొదటిసారి చూసినవాడు తప్పకుండా భయపడేట్టుగా వుంటుంది. సర్దార్ రూపం.

అటూ ఇటూ పరకాయించి చూసి వరండాలో ఉన్న సోఫాపై కూర్చున్నాడు సర్దార్.

గొలుసు లాక్కుంటూ ముందుకాళ్ళు పైకి లేపి కుఁయ్ కుఁయ్‌మని రాగం తీస్తూ గారాబంచేసింది కుక్క.

సర్దార్ దానికేసి ఆప్యాయంగా చూసి, కాసేపు మాటాడి అది గమ్మున కూర్చునేట్టు చేసి సోఫా వెనక్కివొరిగి కూర్చున్నాడు.




"సాబ్! మల్లిగాడు కిస్తుకట్టలేదు. పైసలెల్లు తలేవని మొండికేసిండు... ఈడికే పట్టుకొచ్చిన" మల్లిగాన్ని మెట్ల దగ్గరకు తీసుకొచ్చి అన్నాడు వసూలు గుమాస్తా.

సర్దార్ వేరగా మల్లిగానికేసి చూశాడు. ఆ చూపుల్ని తట్టుకోలేక మల్లిగాని చూపులు నేలకువాలిపోయాయి. చేతులు కట్టుకుని, అతడు ముడుచుకుపోయి నుంచున్నాడు.

"ఎన్నో కిస్తువీంది?" లెక్కలురాసే గుమాస్తానడిగాడు సర్దార్.

"రెండో కిస్తు" పేజీలు తిరగేసి అన్నాడు గుమాస్తా.

"ఏందిరా మల్లయ్యా! పైసలేవిరా ?" అడిగాడు సర్దార్.

"పోరనికి పానం బాగలేక మందులకు కర్సయినయ్. నీబాంచెను. గీఒక్కసారి మనిగాయి నీకాల్మొక్త. వచ్చే వారంల రొండుకిస్తులొక్కపాలేకడ్త" చేతులు నలుపుకున్నాడు మల్లిగాడు.

"అరేయ్! ఎవలు నమ్ముతారని గీమాటలు చెప్తానవ్? నాలుగు వారాలల్ల రొండువారాలు కాలేదు. భాంచత్... గప్పుడే పైసలయిపోయినయంటానవ్! కాయపేయతింటె కర్సుకాకుంటె ఏమయితయ్?" గుడ్లురిమాడు సర్దార్.

"గట్ల కర్సుసేయలే నీకాల్మొక్త. నా కొడుకు బీమారయిండు... అయెపాయె పానాలు చేసిండు... అగొ నూడు బాంచెనెట్లయిండో! మల్ల వారందాక కాపాడు" మల్లిగాడు దీనాతిదీనంగా వేడుకున్నాడు.

"అరేయ్...ఫుజూల్ మాటలు చెప్పకు. ఇన నీకి నాకు టైంలేదు. ఈ వారంల ముప్పైలేవట... వచ్చే వారంల అరువై కడ్తడట... ఇంట్ల పైసల చెట్టుగిన మొలుస్తదా ఈవారంల? మొలుస్తే నువ్వే తెంపుకో... ఇప్పుడు మాత్రం పైసలాడపెడ్తెనే ఇంటికి పోతవ్" అంటూ పహిల్వాన్‌కేసి చూశాడు సర్దార్.

సర్దార్ మాట పూర్తయిందోలేదో ఆ పహిల్వాన్ వచ్చి మల్లిగాని మెడలమీద చెయ్యేశాడు.

మల్లిగాని మెడ అతని పిడికిట్లో ఇమిడిపోయింది.

"పైసలిచ్చేదాక నేను నీతోనే వుంట.... మరి నా కూలికూడ కట్టియ్యాలె... పా..." అంటూ చెయ్యి తియ్యకుండానే ఆ పట్టుతోనే లాక్కుపోతున్నాడు పహిల్వాన్.

మల్లిగానికి కేకేసే శక్తి కూడాలేక విలవిలా కొట్టుకుంటున్నాడు.

అప్పులకై వచ్చినవాళ్ళంతా ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

"ఆగుర్రి బాంచెను.... అయిన్నేంజేయకుర్రి..." వరుగెత్తుకు వచ్చి మల్లిగాని పక్కన నుంచుందతని భార్య.

వెంటనే మెడకున్న తాడును పుటుక్కున తెంపుకుంది. చిన్నచిన్న నల్లపూసలన్నీ కింద పడిపోయాయి. దారాన్ని తీసి పడేసి చిన్నపుస్తెను పహిల్వాన్ చేతిలో పెట్టిందామె.

మల్లిగాన్ని విడిచి, ఒకసారి ఆమెను ఎగాదిగా చూసి, మెట్లెక్కిపోయి అపుస్తెను సర్దార్‌కిచ్చాడు పహిల్వాన్.

ఒక క్షణందాన్ని చూసి గుమాస్తా కందించాడు సర్దార్. గుమాస్తా అక్కడేవున్న త్రాసులో దాన్ని తూచి "సాబ్... వీసానికి రెండు గురిజలుతక్కు వున్నది" అన్నాడు.

"ధరకట్టి మిగిల్ని పైసలు జమరాసి పెట్టు లెక్కచూసి వాడే తేవాల్నో మనమే ఇయ్యాల్నో వానికి చెప్పు" అని మల్లిగానికేసి తిరిగాడు సర్దార్.

"ఓరి మల్లిగా...ఇయ్యాల నీ పెండ్లం నీ ఇజ్జత్ గాపాడింది.

దొంగగాడ్డికొడ్క... ఏదో ఇంత పనిచేసుకుంట జాగర్తగ వాడుకుంట బత్కుమని పైసలిస్తె... అయింత వాటిని నాలికకు రాసుకున్నావ్! కర్సుపెట్టి ఆడదాని గోసబుచ్చుకున్నావ్! ఓరి కుక్కలకొడ్కా! ఈ కానుంచైన యవారం మంచిగ చేసుకో. అప్పుకట్టు... మల్లతీస్కో... పో" అన్నాడు.

"నీ అప్పు తేరిపోయింది... ఇంక రెండువారాలు కట్టకున్నా తేరిపోయింది. ఇగొ మిగిల్న పైసలు" కొంత డబ్బు మల్లిగాని చేతిలో పెట్టాడు లెక్కల గుమాస్తా.

భార్యనోచేతా, పిల్లవాన్నోచేతా పట్టుకుని గు

డ్లనీరు గుక్కుకుంటూ నడిచిపోయాడు మల్లిగాడు.

రాయలింగు కడుపులో చేయేసి కెలికినట్లయింది. ఒక్కమాటకూడా మాట్లాడకుండా 30 రూపాయిలు తీసి లెక్కల గుమాస్తా చేతి కందించి, సర్దార్‌కు సలాంచేసి ఇంటికి తిరిగొచ్చాడు.

ఇంటికొచ్చింతర్వాత కూడా అతడు మౌనంగా కూర్చుండిపోయాడు. మల్లిగాని కుటుంబం అతని కళ్లముందు మెదులుతోంది. ఎన్నో ఆలోచనలు అతని మనసును తొలచివేస్తున్నాయి. భయం అతని నరాల్లో ప్రవేశించి అటూ ఇటూ పరిగెత్తుతున్నట్లనిపించింది.

ఈ స్థితిలో అతడు దేవయ్యా రావడాన్నీ వచ్చి తన పక్కనే కూర్చోవడాన్నీ గమనించలేదు.

"మూగనోంగిన బట్టినావె బావా! ఏమొ గంతగనం ఇసారించుకుంట కూకున్నవ్?" రెండు నిమిషాలాగి అన్నాడు దేవయ్యా.

"నువ్వారా, దేవన్నా... ఎంతసేపాయె వచ్చి? మనసు తిమితంలేక నువ్వొచ్చిందే సూల్లే..." అన్నాడు రాయలింగు.

"ఏమొ గట్లున్నవేందే? ఏమయింది?" బీడీ అంటించుకుని అడిగాడు దేవయ్యా.

"ఏమున్నదిరా... దినదినం పెట్టుబడి తగ్గిపోబట్టె... ఒక్కచేయిమీద గిన్ని జీవాలు బతుకాల్నాయె... ముందు ముందెట్ల గడుస్తదో, ఏమైపోతామో అని బయమైతాందిరా దేవయ్యా!"

"అగో... ఒక్క చెయ్యేందే? మరి బుచ్చిగాడేం సంపాయిస్తలేడా? ఏమిస్తలేడా? ఆకరికి వాని పొట్టమందమన్న సంపాయించుతలేడా?" ఆశ్చర్యపోయాడు దేవయ్యా.

"ఏందో వానికే ఎరుక... గాబుడ్డబుడ్డ పనులు, బుడుబుడుకల పనులు చేయడట... అయినా గీబస్తీల... పోరడు... వాడేం చేస్తడూ. ఏం సంపాయిస్తడు?"

"ఆఁహా... గట్లనా? బుచ్చిగాడింకా పోరడేనానె? మరి కూసుండి తిన్నా మనుమడా అని వాని తాతగిన ఏదన్న ముల్లె దాసిపెట్టిండానె? నీయవ్వ... మూతి నల్లబడుతాంది... వాడింక పోరడేనట... పోరడు. అయితే తింటాండు తిరుగుతాండు... గంతేనా?"



"పూర ఊకెనే వుంటలేడనుకో! కని యేపని గూడ పట్టుకొని వుంటలేడు. రూపాయో రొండో వస్తె వాడె కర్సుపెట్టుకుంటాండు. ఇదేందిరా అంటె... గామునులోల్లపనికి ఇంటికీయనీకి మిగుల్తయా? అన్నడట తల్లితోని"

"చూసినవా? వాడు వైనుపోరడు మాట్లాడినట్లే మాట్లాడిండు మరి... వైసోల్లు చేసేపని చేస్తనంటాండు. గది జెప్పవ్ మరీ... ఇస్టంలేని పనిని ఎవ్వలైన ఎట్ల చేస్తరే! వాన్ని మాపటికి నా దగ్గెరికి తోలు- వానికిస్టమైన పనేదో ఇసారించి గండ్లనే పెడదాం"

"యాడపెడుతావ్? ఏపనిల బెడుతవ్?"

రాయలింగు అప్పటికే కొడుక్కు పనిదొరికినంత సంబరపడిపోతున్నాడు.

"నీ యవ్వ... సంపాయించుకునేటోడు యాడబెట్టినా సంపాయించుకుంటడు. బండమీన పావుసేరు పుట్టించుకుని బత్కుతడు. పనిలయేముంటదే నీ పిచ్చిగానీ... కని ప్యాద ముండకొడ్కులకు ఇస్టముండుడు. ఉండకపోవుడు వుండొద్దు. ఏపని దొర్కుతె ఆ పని చేసుకుంటనే వుండాలె"

"గసొంటి గిసొంటి పనులు వద్దంటాండు మరి..."

"మాపటికి నేను సమజైప్పుతగనీ... తోలు. మొద్దు కస్టంచేసే చెట్టంత కొడుకును ఇంట్ల పెట్టుకోని... ఏమో రంది పెట్టుకుంటానవ్... రందిల బడకు" అని ధైర్యం చెప్పి, కాసేపదీయిదీ మాట్లాడి వెళ్లిపోయాడు దేవయ్య.

"ఓరి దేవయ్యా! నిజంగా నువ్వు దేవునివేరా! దేవునివే కాకపోతే గింతమందికి గిన్నితీర్ల సాయమెట్ల చేస్తవ్? నీకోసం కాకుండ గింత మంది కోసమెందుకు బతుకుతవ్? నీ అవ్వకడుపు సల్లగ.. నా ఆవునుగూడ పోసుకుని నూరెండ్లు బతుకు బిడ్డ..." వెళ్లిపోతున్న దేవయ్యను మనసులోనే దీవించాడు రాయలింగు.

★ ★ ★

తనను కలుసుకోవడానికి వచ్చిన భిక్షపతిని చూసీచూడనట్టు చూసి కోపం నటించాడు దేవయ్య.

"ఏమొ రమ్మన్నవట మామా!" పక్కన కూర్చుంటూ అడిగాడు భిక్షపతి.

వయసును మించిన శరీరంతో, ఆరోగ్యంగా బలంగా చామన ఛాయతో మెరిసిపోతున్న భిక్షపతికేసి తలతిప్పి, అలాగే చూస్తుండిపోయాడు దేవయ్య.

ఒడ్డూ పొడుగూ మేళవించి... ఆరడుగులకు కొంచెం తక్కువగా వున్న ఆకారం. కళ్లల్లో తళుక్కుమంటున్న మెరుపు. ముఖమంతా ఆవరించిన చురుకుదనం- కోలమొఖంలో కొనదేరిన ముక్కు- అంతంత కళ్లు- ఒత్తుగా నల్లగా పెరిగిన జుట్టు. విశాలమైన ఛాతీ. బలమైన కండరాలతో మోకాళ్లవరకూ సాగిపోయినట్లున్న చేతులు- రాగిరంగుతో సన్నగా గదువకింద పెరిగిన వెంట్రుకలు... వయస్సు అద్భుతంగా శోభిస్తున్న భిక్షపతిని దగ్గరగా చూడటం దేవయ్యకు అదే మొదలు. అతని ఆకారాన్ని పరిశీలనగా అలాగే చూస్తూ వున్నాడు దేవయ్య.

"ఎందుకు రమ్మన్నవే నన్నూ?" మళ్లీ అడిగాడు భిక్షపతి.

"అడ్డగాడిదంతెదిగినవ్ గాదురా బుచ్చిగా! ఇరవైయేండ్లు దాటినవ్... ఇంకా మీ అయ్యగాని కస్టం తప్పదాయె... ఎందుకురా ఈ కండలు?" తెచ్చిపెట్టుకున్న కోపంతో మందలించాడు దేవయ్య.

"అదికాదు మామా..." నవ్వుతూ చెప్పబోయాడు భిక్షపతి.

"ఏదికాదురా? మల్ల అది కాదు ఇదికాదంటవ్! ఆడదానివైతె ఇప్పటి కిద్దరు పోరలగందువు. ఇంకా ఊరుమీదబడి తిరుగుతాంటివి. ఆ మునలోడు ఎంతకని సావాల్రా?"

"నువ్వట్లంటానవ్‌గని... యాడపని దొర్కుతాందే?"

"అగో... పని దొరుకుతలేదా? పనోల్లు దొర్కుతలేరని, ఊరంత లొల్లిపెడుతాంటె నువ్వు పనేదొర్కుత లేదంటవ్... నీమాట యెట్ల నమ్మాల్రా?"

"నీయవ్వ... గవిగూడ పనులేనంటవా? నేను గాపనులు పానంబోయినా చేయ"

"గాపనులా... గాపనులంటె ఏవనుల్రా?"

"గాబొంబాయి మిఠాయ్, లేవిడిపట్టీలమ్ముడు. పల్లికాయల, బటానీల పొట్లాలమ్ముడు... గాపనులు నాతోనిగావు"

"నీతోని గావా? ఎందుగ్గావురా?"

"బొంబాయ్ మిఠాయ్ అని కేకేయంగనే ప్యాదపోరగాండ్లు బిలబిల నుట్టు చేర్తరు. వాల్లల్ల అందరి దగ్గర పైసలుండవ్... ఇద్దరో ముగ్గురో కొనుక్కుంటరు. మిఠాయిని సాగదీసి గడియారాలు చేసి వాల్లచేతులకు చుట్టాలె... ఆ పొలగాండ్లు దాన్ని నాక్కుంట... మునిరే ఈగల్ని కొట్టుకుంట తింటాంటె, మిగిలిన పొలగాండ్లు ఊరిల్లురుకుంట మిట్టమిట్ట చూస్తాంటరు... సూడబుద్ధిగాక తలాయింత పెడుత... మిటాయయిపోద్ది. ఇంక పల్లికాయలు, బటానీలు... రక్షలోల్లకు పైనకోకాయ అమ్ముడు... అమ్మి అమ్మి అయిదురూపాలు సంపాయించుడు... గీపనులు నాతోని కావు మామా!"

నిజంగానే వాటినమ్ముతున్నట్లుగా చేతులు తిప్పుతున్న భిక్షపతిని చిరునవ్వుతో చూస్తున్నాడు దేవయ్య.

"గింతచేస్తె... ఓ నాడమ్మితె ఉంకోనాడమ్మయ్... గాడిదెత్తుండి, మునులోనోలె కట్టె పట్టుకుని, బుట్ట పట్టుకొని గావాట్నమ్ముడు... నాకు సిగ్గయితాందే..."

"పనిచేసెటోడు గవన్ని చూస్తాడ్రా?"

"మరి గవన్ని చూసెటోడు పనిచేస్తడా?"

భిక్షపతి ఈ మాటకు ఖంగుతున్నాడు దేవయ్య. తర్వాత చిన్నగా నవ్వాడు. వీనికి మంచిపని దొరుకుతే బాగుపడతాడు' అనుకున్నాడు.

"నేను మునులోన్ని ముతుకోన్ని కాను... నాకు కస్టంజేసే రెక్కలున్నయ్... నా శరీరంల బలమున్నది... నా రెక్కలకు తగ్గపనైతె నవ్వుకుంట చేస్త మామా!" దృఢంగా అన్నాడు భిక్షపతి.

"చూడ్రా బుచ్చయ్యా! పని ఎసుమంటిదని ఆలోచించెటోడు ఏపనిగూడ సక్కగ సేయడు. ప్యాదోనికి బతుకే బరువాయె... ఓ పోరాటమాయె. గాబతుకుతోని పోరాడాలంటె, ఏదో ఒటి... దొర్కిన పనినే పట్టుకోని పోరాడాలె.





గట్లగనీ... గాపనొద్దు, గీపనొద్దు అనుకుంట పనిలేకుంట బతుకెట్ల ఎల్లదీసుకుంటవ్‌రా? పనిమీదలుగుతెల్లరా?" నిదానంగా అడిగాడు దేవయ్య.

"శాతగానోల్లు, బలంలేనోల్లు చేసుకునే పను లెట్ల చేయాల్నే? గాపనులు పట్టుకొని బతుకు బరువెట్ల తీర్సుకోవాల్నే? నీయవ్వ.... గాబతుకు లేకుంటెమాయె చావనన్న చస్తగని గాపనులు మాత్రం చేయ" అని లేచి నుంచున్నాడు భిక్షపతి.

"ఓరి ఉరుకులాడకురా అయ్యా...కనకూసో" బుజ్జగిస్తున్నట్లుగా అంటూ భిక్షపతి చేయి పట్టుకుని కూర్చోపెట్టాడు దేవయ్య.

మూతి ముడుచుకుని ఎటోచూస్తూ కూర్చు న్నాడు భిక్షపతి.

"ఇగ జెప్పు...ఏంపని చేస్తవో చెప్పు మరిపె ట్టుబడి పెట్టే పనులు మనతోని కావు. మీ నాయనే బవుకష్టపడుతాండు. ఊరి నిండ బొచ్చెడన్నిండ్లు కడుతాండ్రు...అడ పారపని చేస్తవా? తట్టమోస్తవా? చెప్పు...గివ్వయితె పెట్టు బడిలేకుండా రోజుకు పదో పదిహేనో సంపా యించుకునే పనులు".

"తట్ట పని గిట్టపని నేను చెయ్య. అసలు ఉంకోడు చేయించే పనే నాకొద్దు. వానికే కోపమొస్తదో, నాకే కోపమొస్తదో...గందుకే సొంత రెక్కల కష్టం చేసుకొని బతికే పనైతెనే చేస్త"

"ఇగెట్లరో...చేయించెటోడులేని పనుంటదా ఎక్కన్నన్నా?"

"ఎందుకుండదే...నేను...నేను రక్ష తొక్కుత మామా! రెక్కల కష్టమే పెట్టుబడి. నాపని నేను చేసుకుంట"

"మరింక పనే దొర్కుతలేదని, ఏంపనిచే యాల్నని ఎందుకంటావురా?"

"నాకు రక్షెవ్వలిస్తాండ్రు? ఒక్క ముండకొ డ్కుగూడ దగ్గెరకు రానిస్తలేడు...ఆకరికి రక్షలో ల్లు చెప్పినా ఇస్తలేరు"

"అవ్‌గాదురో... ఈడ నీ మ్యానమామలే డాయె... బామ్మరిదిలేడాయె... డిపాసిట్టు పైస లు గూడలేవాయె...మరి రక్షెట్ల దొర్కుతది?"

భిక్షపతి నిరాశచెందాడు. అతని చూపులు నేలకు వాలిపోయాయి.

"అవ్‌గాని బుచ్చయ్యా! రక్ష తొక్కుడు మాత్రం సుకమారా? దినమంతా తొక్కి తొక్కి రౌతం నీల్లు చేసుకోవాలె. సంపాయించినయి ఓనరోనికీ, రిపేరింగుకూ పొంగ ఏం మిగులు తయ్? సరె మిగిల్నయనుకో...బలం కోసం తినే కురాకుకు పొంగ నువ్వు ఇంట్లకేమిస్తవ్?"

"కొన్ని రోజులు తొక్కనూస్తనే..ఏంమిగుల కుంటె యేరే పని చూసుకుంట. ఎట్లనన్న నాకో రిక్షనిప్పియ్యి మామా!" వేడుకున్నాడు భిక్ష పతి.

దేవయ్య కాసేపాలోచించాడు.

"సరే..రేప్పొద్దుగాల యాద్గిరిసేటు దగ్గెర రక్షనిప్పిస్తగనీ...మరి నేర్చుకోంగ పైలంగ తొక్కుతవా?"

"రక్ష తొక్కనేర్సుకునుడు పెద్ద పనానె? నేనె ప్పుడో నేర్సుకున్న" ముసిముసిగా నవ్వుతూ అన్నాడు భిక్షపతి.

"ఎప్పుడు నేర్సుకున్నవ్‌రో?" దేవయ్య ఆశ్చ ర్యపోయాడు.

"ఇన్నిరోజులు బుట్టపట్టుకోనమిన్ననుకు న్నవా? అడ్డాల కాడికిపోయి ఎప్పుడో నేర్సుకు న్న"

"అయితే సరె...ఇగ ఇంటికిపోయి ఇంత తిని పండుకో పో...పొద్దుగాల వంపుకాడికి యా ద్గిరిసేటు దగ్గెరికి రా"

దేవయ్య అలా అనగానే భిక్షపతి మనను తేలికైపోయింది. ఆనందంగా తలూపుతూ సె లవు తీసుకుని ఇంటివేపు నడిచాడు భిక్షపతి.

ఆ మర్నాడే రిక్షాలు కిరాయలకిచ్చే యాద గిరి సేటు ఇంటివద్ద ఎదురు చూస్తూ నుంచు న్నాడు .

అప్పటికే భిక్షపతికి రిక్షాతొక్కించడం నేర్పిన నంద్యా, మదునయ్యా, ఇంకా కొందరు రిక్షావాళ్ళు రిక్షాలు తీసుకున్నారు.

'అందరం కలిసేపోదామని' నిర్ణయం తీసుకుని దేవయ్య కోసం ఎదురుచూస్తుండ గానే వచ్చాడు దేవయ్య.

భిక్షపతి రిక్షాకు దేవయ్య పూచీపడ్డాడు.

"ఓరి పిలగా! రక్ష కావాలె, రక్ష కావాలె అని తిరిగినవ్. దేవయ్య జిమ్మెదారుమీద నీకు రక్ష

నిస్తాన. వంపుచార్రైనా, బిరికుపోయినా, పుల్లలి రిగినా నీదే జిమ్మెదారు. యాన్నన్న టక్కర్ పెట్టుకొని రక్ష పాడుచేస్తే నువ్వే దరకట్టి య్యాలె. నువ్వు సక్కగ తొక్కినా దానికదే యేద న్న పాడైందనుకో...గప్పుడు నేను బాగుచే యిఁ చిస్త...మరి గీషర్తులకిష్టమేనా?'' రిక్షాని స్తూ అడిగాడు యాదగిరి.

ఇష్టమే అన్నట్లుగా తలూపాడు భిక్షపతి.

''నువ్వు తొక్కుకో తొక్కుకోకపో...నీ గిరాకితోని నాకు సమందంలేదు. రోజు లెక్కైతె రోజుకు నాల్రూపాయలు తెచ్చియ్యాలె. వారానికైతె ఇరువైఐదు. నెలకైతె నూరు... తెలిసిందా? కొత్తోనివి...కొంచెం నిమ్మలంగుండాలె'' అన్నా డు యాదగిరి.

భిక్షపతి అన్నింటికీ సరే అంటూ వారంలె క్కన రిక్షా తీసుకున్నాడు.

దేవయ్య వెంట నడుస్తూంటే, రిక్షాను నడి పించుకుంటూ కాంపౌండు దాటాడు.

ఏనుగు నెక్కినంత సంతోషంతో రిక్షాను నడిపించుకుంటూ వస్తున్న భిక్షపతిని చూసి చిన్నగా నవ్వారతని స్నేహితులు.

''బుచ్చయ్యా! రక్షతొక్కుడు కష్టమైన పనే గని.. మరేం జేత్తవ్? నీకిష్టమైన పనాయె...అదె పాయె...తొక్కితె తొక్కితివిగాని కొంచెం శరీరం కాపాడుకో, లేకుంటె దావకాన్లసుట్టు తిరగలేక సావాలె. శరీరం కాపాడుకుంట, అంతోయింతో సంపాయించి మీ అయ్యగానికాసరగావా లె...పేరునిలుపుకోవాలె బిడ్డ'' అంటూ భుజం మీద చేయేసి, భిక్షపతిని దగ్గరకు తీసుకున్నా డు దేవయ్య.

'ఎవరీ దేవయ్య మామ? ఎక్కడిదీ మమ కారం?' భిక్షపతి హృదయం ఆర్ద్రమైపో యింది.

''కొంచెం వీన్ని చూసుకోర్రి తమ్మీ! పల్లెటూ రు పోరడు...కుడుమంటే పండుగనెటోడు... యేమితెల్వనోడు, యాడ గిరాకుంటదో, యా న్నుంచి యాడికెంత కిరాయి తీసుకోవాల్నో ఎవలతోనెట్ల మెదులుకోవాల్నో గవన్ని తెలజె ప్పుర్రి'' భిక్షపతిని వాళ్లకొప్పజెప్పుతున్నట్లుగా అన్నాడు దేవయ్య.

''ఏం పర్వలేదులేవె...రెండ్రోజులైనంక నూ ర్రాదు... నువ్వే ఇచ్చుంత్రపోతవ్'' అన్నాడు మదునయ్య.

''ఇయ్యాల్నే కొత్త..రేపు నూర్రాదు...మాకన్న తేజ్ అయితడోలేదో'' అంటూ రిక్షా యెక్కాడు సంద్యా.

''ఇగ పోయ్‌రారా బుచ్చయ్యా! పైలంగ పోయిరా!'' అన్నాడు దేవయ్య.

భిక్షపతి కళ్ళు నీటితో నిండిపోయాయి. అతడు రిక్షానొదిలి ఒక్కసారిగా దేవయ్యను కౌగిలించుకున్నాడు.

''ఓరి...ఏందిరా యిది పొలగానోలె?'' భిక్ష పతి కళ్ళు తుడుస్తూ అన్నాడు దేవయ్య.

మరోసారి కృతజ్ఞతతో నిండిన కళ్ళతో చూసి రిక్షా ఎక్కాడు భిక్షపతి.

మూడు రిక్షాలు కనుమరుగయ్యేదాకా నిలబ డి చూసి, తర్వాత వెనుదిరిగేడు దేవయ్య.



**2**

ఆ మధ్యాహ్నం రాయలింగును కలుసుకు న్నాడు దేవయ్య.

జీవితంలో అతి ముఖ్యమైనదాన్ని దేన్నో పోగొట్టుకున్నట్లుగా దీనంగా పందిట్లో కూర్చు న్నాడు రాయలింగు.

గౌరమ్మా, మల్లికాంబలు విచారంగా గడ పలో కూర్చున్నారు.

''ఏమొ... అందరు మొకం మాడ్చుకొని కూసున్నరేందే? ఏమయింది బావా?'' రాయ లింగు పక్కన కూర్చుంటూ అడిగాడు దేవ య్య.

''మొకం మాడ్చుకోక యేంజేయమంటవ్? పొద్దుగాల చెప్పక చెయ్యక పోయిండు నీ అల్లుడు...ఇప్పటిదాక రాలే. చూసి చూసి

కండ్లుపాడైపోతానయ్. 'రాకుంటె యాడికి పోతడే...వాడే వత్తడే' అనెంత చెప్పినా మీ అక్క బెంగటీలి అన్నం తినదాయె. దాన్ని చూసి మల్లవ్వ తినదాయె...ఇగ నాకు కూడు నోట్లెకెట్లపోద్దీ?'' విచారానికి కారణం తెలిపాడు రాయలింగు.

''కడుపులకాల్తె వాడే వస్తడు. రాకుంటే యాడికి పోతడు? ఏమొ గంతగనం బయపడు తాంద్రు...యేమన్న కీసులాడుకున్నారే?''గౌరమ్మకేసి చూశాడు దేవయ్య.

''వాడెందుకు కీసులాడుతడు తమ్మీ! 'దేవయ్య మామను కల్సినవా? లేకుంటే పనిచేయ బడ్తదని తప్పించుకున్నవా? యేమన్నడు?' అని రాత్రి మొసమర్రకుంట అడిగిండీయినె. వాడే కాయాల్లున్నడో సప్పుడు చేయలే. గాయింతదానికే ఈయినకింత కోపం పొడ్సుకొచ్చింది... పోరన్ని ఆయిల్లగూడ అన్నం తినకుంట చేసిండు'' ఏడ్పుగొంతుతో చెప్పింది గౌరమ్మ.

''కోపమొచ్చి నేను మాత్రమేమన్ననే?'' రాయలింగు.

''ఏమన్లే పాపం... వాడే కావురంబట్టి పోయిండు'' వెటకారంగా అంది గౌరమ్మ.

''ఏమన్ననే? కూసుండి తింటె గుట్టలుగూడ కరిగిపోతయ్. దినాం అంతో యింతో సంపాయించుకుంటేనే మనసొంటోల్లకు బతుకుంటది. గాపని చెయ్యి, గీపనిచెయ్యినంటానవ్... నీ మొకానికింత సదువన్న లేదుగాదుర! దేవయ్య మామ రానీ... నీమీదనే ఊంచుతడో, నామీదనే ఊంచుతడో అన్న... గంతే! పోరడు పాడైపోతాంటె గాయింతనొద్దారా దేవయ్యా? గాయింతదానికే కోపం పొడ్సుకొచ్చి తిండిమీదికెల్లి లేచిపోయిండు'' అన్నాడు రాయలింగు.

''ఈనె సదివిత్తెగిన సదువుకోకపోయిండావాడు? సూడు తమ్మీ! గా ఆటగొలె పోరన్ని పట్టుకొని పెదపెద్ద మాటలనుకుంట ఆగంచేత్తాండు. గాబుద్ధి చెప్పుడు వాడు తినెటప్పుడె... బుక్క నోట్లోపెట్టుకునెప్పుడే చెప్పాల్నా?'' కళ్ళు తుడుచుకుంటూ అంది గౌరమ్మ.





''మరి యాడికి పోతడు తీరాదక్కా! అలిగిండు... పోయిండు. గాకోపం యెప్పటికుంటదా? పొద్దుగూకెటాలకు వాడేవత్తడుతీ'' సముదాయించబోయాడు దేవయ్య.

''వాని సంగతి నీకెరుకలేత్తమ్మీ! వాడు మంకుపోరడు. మనుసుల బడ్డది మాయిల్లం తీసేనుకోడు. అన్నం ఆగారంలేక యాడ తిరుగుతాండోయేమో! ఇంకేంది? ఈయిన కండ్లు సల్లబడ్డయ్'' కళ్ళు తుడుచుకుంటూనే రాయలింగుమీది కోపాన్ని వెళ్లగక్కింది గౌరమ్మ.

''తాను గట్టిగా మందలించడం తప్పేకావచ్చు''ననుకుని చూపులు నేలవాల్చి, తల దించుకున్నాడు రాయలింగు.

''గీయింతదానికే అనోసరంగగింత పరిశానయితాంద్రు... మీ మనుసులు తెలుసుకుందమని ఇంతసేపాగిన గౌరక్కా! వాడింకా పోరడే అనుకుంటునావె? పనిబాటల్లేకుంట తిరిగితె ఇంకా చిన్న పోరడే అయితడు. రాయలింగు బావా! ఇయ్యాల్రేపటి పోరగాండ్ల మనుసులు తెల్సుకోకుంట మాట్లాడుడు మానాలె''

దేవయ్య అలా అనగానే గౌరమ్మకూడా తల వంచుకుంది.

''ఆ... ఇప్పుడు చెప్పుతాన... యినున్లి. బుచ్చిగాడు యాడికీపోలే... పొద్దుగాల నాదగ్గెరికొచ్చిండు... పనిమీదికెక్కిండు'' నెమ్మదిగా చెప్పాడు దేవయ్య.

''ఆఁ... పనిమీదికెక్కిండా? ఏంపనిరా దేవయ్యా!'' రాయలింగు కంఠంలో ఆనంద తరంగాలు.

''ఏంపనికెక్కిండు తమ్మీ!'' సంతోషం పట్టని గౌరమ్మ.

''వానికి రక్ష తొక్కుడిష్టం... రక్షతొక్కుతాండు''

''రక్ష తొక్కుతాండా?'' రాయలింగూ, గౌరమ్మా ఇద్దరూ ఒకేసారి ప్రశ్నించారు.

'ఏదోటి... పనిలోకెక్కినాడు' అనే భావం రాయలింగు గొంతులో... 'రిక్షా తొక్కడాని కెంత బలంకావాలి?' అనేభావం గౌరమ్మ గొంతులో వినిపించింది దేవయ్యకు.

''ఆ... రక్ష తొక్కుతాండు... నేనే ఇప్పిచ్చిన'' అన్నాడు దేవయ్య.

''వానిదెంతకాలెంత చెయ్యితమ్మీ! ఇంక

వాని బొక్క ముదురలేదుగాదు తమ్మీ! నిన్న మొన్నటి పోరడు... రక్ష తొక్కితె ఎందుకపో డా?" గౌరమ్మ గొంతులో ఆవేదన.

"ఏశ్ నీయవ్వ... ఇరువైరొండేండ్లు దాటినయ్. ఇంక పోరడేనానె? ఊల్లెకు పోయినూడు.. గింతగింత పోరలు రక్షతొక్కి సంపాయించు కుంటాంద్రు. వైనుపోరడు... ఏమెందుకపో డు... ఇంక బొక్కగట్టివడ్తది" గద్దించినట్లుగా అన్నాడు దేవయ్య.

"వాడు కోపగొండోడు... ఎవలతోనేం తెచ్చు కుంటడో?"

"గౌరక్కా! పనిలబడితె కోపం గీవం అన్నీ పోతయ్. పనన్నపుడు కష్టముందదానె మరి? కష్టమని కూకుంటె మరి బతుకెట్లు?"

"ఏం బతుకు తమ్మీ... ఇంకేం పనిదొరక్కపో యిందా?"

"అక్కా! నువు ఉచ్చితార్థంగ అనుమానప డకు... సోకనాలు పెట్టుకోకు. ఉంకోపని దొర్కు తెమాత్రం... వాడు చెయ్యొద్దానె. ఏ పనికుండె కష్టం ఆ పనికుంటది. వాడే అల్వాటువడ్తడు. సక్కగ పనిచేసుకుంట మిమ్ముల సాత్తడు. మీ రు బయపడకుర్రి"

దేవయ్య సముదాయింపుతో గౌరమ్మ మనసు కాస్త కుదుటపడింది.

రాయలింగు మనసులో భవిష్యత్తు బంగా రంవలె మెరిసిపోయింది. తృప్తిగా శ్వాసపీల్చు కుంటూ అతడు ఒక్కసారిగా దేవయ్య రెండు చేతుల్నెత్తి తన తలమీద పెట్టుకున్నాడు. ఆ తర్వాత సుదుటిమీదకు తెచ్చుకుని తన చేతు లూ కలిపి దండం పెట్టాడు.

★ ★ ★

**రాయలింగంటి నుండి వచ్చినతర్వాత దేవ య్యకు తిండి తినబుద్ధి కాలేదు. ఎక్కడో కదిలి** పోయిన మనస్సు చలిస్తుండగా, ఇన్ని మంచి నీళ్ళు తాగి పడుకున్నాడు.

ఇన్నాళ్ళూ దేవయ్యకు తన బతుకుమీద అంత ఇష్టంకానీ, అయిష్టం కానీ ఉన్నట్లని పించలేదు. బుద్ధెరిగిన నాడున్న ఆశ, మమకా రాలెక్కడ పోయాయో అతనికి తెలియదు. ఒక విధమైన నిర్లిప్తతతో అతడలా బతికేస్తున్నాడు. అయితే ఈ నిర్లిప్తత తన బతుకు వరకే. ఇతరుల విషయానికొచ్చినపుడు అతనికో నిర్ది ష్టమైన మార్గం వుంది.

'మనిషి పుట్టాడు కాబట్టి చచ్చేదాకా బత కాలి. పేదవానికి బతుకు ఒక పోరాటం. సరిగ్గా పోరాడినవాడు బతుకును చెప్పుచేతుల్లో పెట్టు కుంటాడు. పోరాడలేనివాడు ఓడిపోతాడు' అనే అర్థం వచ్చే మాటలు అతని నోట విరివిగా వినిపిస్తూంటాయి.

ఎవడూ ఓడిపోవాలని కోరుకోడు. అయినా కొంతమంది బతుకులో కాలునిలదొక్కుకోక ముందే, కొంతమంది నిలబడి పోరాడుతూ పడిపోతూవుంటారు. అట్లాంటివారి మీద దేవ య్యకెంతో జాలి.

పది సంవత్సరాల క్రితం దేవయ్య తన బతుక్కు ఓ మార్గాన్నేర్పరచుకున్నాడు. అప్ప టినుండి ఆ దారిలోనే ప్రయాణిస్తున్నాడు.

'తన తల్లి పేదరికం...పేదవాళ్ళంతా ఆ తల్లి కన్నబిడ్డలు. వాళ్ళు తన తోబుట్టువులు. వాళ్ళంతా బతుకుతో పోరాడుతున్న బతుకును భారంగా మోసుకుంటున్నవాళ్ళు. వాళ్ళ బతు కుపోరులో పాలుపంచుకోవడమే తన బతుకు పోరు' ఇది దేవయ్య యెంచుకున్న మార్గం.

కాని రాయలింగింటినుండి వచ్చింతర్వాత అతనికి తన బతుకు మీద దయ కలిగింది. ఏదో వెలితి ఎదురుగా నిలిచి అతన్ని వెక్కిరి స్తోంది.

'కడుపు నిండా తిండి, కంటి నిండా నిద్ర, ఉండటానికో గూడు, మాట్లాడటానికెంతో మంది... కాలం గడచిందే తెలియదు... అయినా ఇప్పుడెందుకు తన మనసు చలించింది?'

'ఒక్కపూట తినకపోతే... ఒక్కపూట ఇంటికి రాకపోతే... క్షేమపతికోసం తపించే బతుకులు, ఏడ్చే కళ్ళున్నాయి. వాడేమీ సంపాదించకపో యినా బతిమాలి తినిపించే చేతులున్నాయి. వాడు సంపాయిస్తే తినడానికి నోళ్ళున్నాయి. వాని కష్టసుఖాలు పంచుకునే బతుకులు న్నాయి. తనకు...? తిన్నా తినకపోయినా... సంపాదించినా సంపాదించకపోయినా ఎవరి క్కావాలి? తను ఒంటరి... ఏకాకి...' ఈ భావంతో దేవయ్య హృదయం బాధగా మూ ల్గింది. తననిలా మార్చిన గతం అతని కళ్ళ ముందు కదలాడింది.

దేవయ్యది ఒకనాడు రాయలింగు వూరే. ఆ ఊళ్ళో వున్నప్పుడు దేవయ్యకు తల్లీతండ్రీ, భార్యా... కొంచెం ఆస్తీ వున్నాయి.

తల్లీతండ్రీ కూడబలుక్కున్నట్లుగా ఒకే సంవత్సరం మరణించినా అతనికి కుటుంబం భారం కాలేదు.

గుడిసే, బోడీ బొక్కా... సరిపోయే సామాన్లే కాక, తనకు నచ్చిన భార్యనూ, ఆ భార్య మీద అర్ధతులం బంగారాన్నీ తన మీద ఇంత వెండీ వుంచిపోయిన తల్లిదండ్రులంటే దేవయ్యకెంతో ప్రేమ.

జీవితం మీద అంతులేని విశ్వాసంతో, ఆశలతో, కలలతో బతుకులో అడుగుపెట్టాడు దేవయ్య. భార్యతో కలిసి ఆనందాన్ని పంచుకుంటూ హాయిగా బతుకు వెళ్ళదీస్తున్నారు.

కానీ... అతని విశ్వాసం సడలిపోవడానికి, ఆశలు అడుగంటడానికి, కలలు చెదిరిపోవడానికి ఎక్కువకాలం పట్టలేదు.

దేవయ్య పనిచేస్తున్న ఒక సంపన్నుడి తమ్ముడి కళ్ళు అతని భార్యమీద పడ్డాయి.

దేవయ్య భయపడిపోయాడు. కోపంతో దహించుకు పోయాడు. ఈ ఆపదనుండి ఎలా తప్పించుకోవాలా అని ఇరవైయేళ్ళు కూడా దాటని దేవయ్య మధనపడుతుండగానే... అంతా అయిపోయింది.

అతడు దేవయ్య భార్యను లేవదీసుకుపోయాడని ఊరంతా కోడై కూసింది.

'ఎందుకిట్లా జరిగింది? దీనికెవరు బాధ్య






లు? ఇప్పుడేం చేయాలి?' అతడీ అవస్థలో అలమటిస్తుంటే... ఊళ్ళోని యువకులంతా వచ్చి ప్రతీకారం తీసుకోవాలన్నారు.

"ఎవరిమీద ప్రతీకారం? దేవయ్య భార్యమీదనా? నంపన్నుడి తమ్ముడిమీదనా? ఇద్దరూ కలిసి లేచిపోయింతర్వాత ఎవరిమీద తీర్చుకుంటారు?" అని అడిగారు దేవయ్య కులంవాళ్ళు.

యువకులు మాట్లాడలేకపోయారు.

"మొగోడు సక్కగుంటే ఆడిది గిట్లెందుకయిద్దిరా?" అనికూడా ఒకరిద్దరన్నారు.

దేవయ్య ఆ మాటల్ని విని కుంగిపోయాడు. అవమానంతో కుమిలిపోయాడు. నిద్రాహారాలు మాని పిచ్చివాడై తిరిగాడు. అలా కొంతకాలం తిరిగి తిరిగి... ఇంక ఆ ఊళ్ళో వుండలేక ఊరొదిలి, ఇల్లొదిలి, సామాన్లొదిలి... వచ్చేశాడు.

ఇక్కడికి వచ్చిన కొన్నాళ్ళకు మళ్ళీ భార్య వార్తలు తెలిశాయి.

'యజమాని తమ్ముడే దేవయ్య భార్యను బలవంతంగా ఎత్తుకుపోయాడట. కొన్నాళ్ళు వాడుకుని వదిలేశాడట. ఆమె బావిలో పడి ప్రాణం తీసుకుందట.' ఇదొక వార్త.

'అలాకాదు... యజమానీ బంధువులూ కలిసి, దేవయ్య భార్యను హత్యచేసి బావిలో పడవేశారట' ఇది మరో వార్త.

ఏది నిజమో తెలుసుకోకముందే అందరూ ఆ విషయాన్ని మరచిపోయారు. ఆ తర్వాత దేవయ్యకూడా నిజం తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు. తర్వాతర్వాత ఎవరన్నా ఆ ప్రస్తావన తెచ్చినా వినడానికిష్టపడేవాడు కాదు.

కొన్నాళ్ళు మనుషుల్ని... ముఖ్యంగా ఆడవాళ్ళని అసహ్యించుకున్నాడు. వీధులన్నీ పిచ్చివాడై తిరిగాడు.

ఆకలైనపుడు ఏదో పనిచేసి, ఏ హోటల్లోనో ఇంత తినడం... స్టేషన్లోనో, బస్ స్టాండ్లోనో పడుకోవడం... అలా ఎంతకాలం గడిపాడో తెలియదు.

ఆత్మహత్య చేసుకోడానికి ప్రయత్నించాడు. కాని 'అసలు బతికుంటే కదా చావడానికి' అనుకుని మానుకున్నాడు.

ఆ స్థితిలో అతడు కష్టజీవులతో కలిసుండటం సంభవించింది. ఆడా మగా... మట్టి మనుషులతో సంబంధం ఏర్పడింది. క్రమంగా మనుషులపట్ల అసహ్యం తొలగిపోయి, ప్రేమా, దయా అతనిలో చోటుచేసుకున్నాయి.

'తనకు ఊరుతో బంధం తెగిపోయింది. భార్యతో, బంధువులతో బంధం తెగిపోయింది. పాతదేవయ్య ఆనాడే, ఊరు విడిచిన్నాడే పాడైపోయాడు. తనిప్పుడు మరో దేవయ్య... మళ్ళీ పుట్టిన దేవయ్య... చచ్చేదాకా బతకదల్చుకున్న దేవయ్య' ఈ భావం అతన్ని ఆవహించి... అతడు వరంగల్లోనే ఆ బరువు బతుకులతో

కలిసి వుండటానికి నిర్ణయించుకున్నాడు.

'చావు ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు దొరుకుతుంది. కాని బతుకు దొరకడమే కష్టం. మనిషి పుట్టింది చచ్చేదాకా బతకడానికే! తాను చచ్చి మళ్ళీ పుట్టిన మనిషి. ఓడిపోయి చావబోయే మనుషుల్ని తాను బతికించాలి బతుకుతో పోరాడుతున్నవారికి సాయంచేయాలి... ఇక తన బతుకుపోరుకూడా అదే' ఇదే తన జీవిత ధ్యేయంగా భావించాడు దేవయ్య.

దేవయ్య చుట్టుపక్కలవారి మీద మమకారాన్ని పెంచుకున్నాడు. తన బతుకు చుట్టూ కొన్ని బతుకుల్ని నిలుపుకున్నాడు.

'భూమి చాలా పెద్దది. దీనిమీద ఎంతో మందున్నారు. అందరూ మంచివాళ్ళు కానట్లే, అందరూ చెడ్డవారు కారు. పుట్టడం, బతకడం, చావడం అందరికీ వున్నాయి. ఉన్నవానికీ, లేనివానికీ, కుంటీ గుడ్డీ మూగ చెవుడూ.... అందరికీ ఈ మూడూ వున్నాయి. కాని వానిలో 'బతుకు' అనేది ఒక్కొక్కరికి ఒక్కోవిధంగా వున్నది. ఆ విధానాన్ని మార్చుకోవడానికి చేసే ప్రయత్నమే బతుకు పోరు.' అని బతుకుపట్ల భయం కలిగినవాళ్ళకు చెప్పి, ధైర్యం కలిగిస్తుంటాడు దేవయ్య

ఆ విధంగా ఎవ్వరూ లేకుండా కొత్తజీవితం ప్రారంభించిన దేవయ్యకు ఆ రోజుల్లోనే సర్దార్‌తో పరిచయమైంది.

సర్దార్ గిరిగిరి బ్యాంక్ నడిపేవాడు. సైకిల్ మీద తిరుగుతూ, కూలీనాలీ జనానికి పదీ ఇరవై అప్పిచ్చేవాడు.

పది రూపాయల కింద ఎనిమిది రూపాయలిచ్చి, పది రోజులూ రోజుకో రూపాయి చొప్పున పదిరూపాయలు వసూలుచేసుకునేవాడు. సైకిల్‌పై తానే రోజూ వచ్చేవాడు.

సర్దార్ అప్పుతో దేవయ్యకు అవసరమే లేదు. అయినా సర్దార్‌కూ, జనానికీ దేవయ్య మధ్యవర్తిగా వుండేవాడు.

ప్రతిరోజూ ఎవరికో ఒకరికి ప్రాణం మీదకు రావడమో, అత్యవసరంగా పదీ ఇరవై అవసరముండటమో జరిగేది. వాళ్ళు దేవయ్యను తీసుకుని సర్దార్ దగ్గరకు వెళ్ళేవారు.

కొంతకాలానికి అంచెలంచెలుగా సర్దార్ ధనవంతుడైపోయాడు. స్థలం కొని పెద్ద ఇల్లు కట్టుకున్నాడు. పలుకుబడి పెంచుకుంటూ, చివరకు పురప్రముఖుల్లో ఒకడయ్యాడు. ఎన్నికల్లో వెనకవుండి ఛైర్మన్‌ను గెలిపించుకున్నాడు. ఎం.ఎల్.ఎ.గారికి సపోర్టు చేశాడు.

తన దగ్గర అప్పుతీసుకొనే జనాన్ని పెంచుకున్నాడు సర్దార్. పల్లెల్నించీ బతకడానికొచ్చిన అందర్నీ కలిశాడు. ఆ జనం వేరేచోటకి పోకుండా ఛైర్మన్ సాయంతో, మునిసిపాలిటీ స్థలాల్లో వాళ్ళు గుడిసెలేసుకునేట్లు చూశాడు. గుడిసెలు కట్టుకోవడానికి అప్పులిచ్చాడు. అందరిపేర్లూ ఓటర్ల లిస్టులో నమోదు చేయించాడు.

సర్దార్‌కు వడ్డీ... ఛైర్మన్‌కు ఓట్లూ ఆవిధంగా లభించేవి. ఆ విధంగా ఏర్పడ్డవే బాలసముద్రం కట్టమీదవెలసిన గుడిసెలు. దేవయ్యకూడా దానిమీదే హనుమాండ్ల గుడిపక్కన ఓ చిన్నగుడిసెవేసుకున్నాడు.

ఇప్పుడు వరంగల్ నిండా దేవయ్యలాంటి మనుషులు సర్దార్‌కు చాలామందున్నారు. ఇప్పుడు వాళ్ళద్వారానే అప్పులిస్తాడు. వాళ్ళద్వారానే వసూలుచేస్తాడు. వాళ్ళొకవేళ అప్పుతీసుకొన్న వానిస్థితిగతుల్ని చూసి వాయిదాతేదీని వాయిదావేయమంటే మాత్రం ఒప్పుకోడు. అవి వసూలు చేయడానికి తన బలగాన్ని ఉపయోగించుకుంటాడు.

ఇప్పుడు... పదిహేనేళ్ళు గడచింతర్వాత... ముప్పైఐదేళ్ళ దేవయ్యకు గతమంతా మనకపట్టిన అద్దాలగుండా కనిపించినట్లుగా కనిపించింది.

ఎండిపోయిన చెట్టు మీద, ఒకకొమ్మమీద కూర్చున్న ఒంటరికాకిలా తనకు తనే కనిపిస్తున్నాడు.

అతని కళ్ళవెంట ధారాపాతంగా కన్నీళ్ళు...

అంతలోనే అతనికి తనబతుకు నియమించుకున్న మార్గం గుర్తొచ్చింది. తనింత అవివేకంగా ఆలోచించినందుకు సిగ్గుపడ్డాడు. కళ్ళుతుడుచుకుని తనను తనే నిందించుకున్నాడు.

తన చుట్టూ ఆకలికి తెరుచుకున్న నోళ్ళు




న్నాయి. ఆకలి తీర్చడానికి విరామంలేకుండా పనిచేసే చేతులున్నాయి. బతుకుతో పోరాడు తున్న జనం ఉన్నారు. ఇందరి మధ్య... బతుకు భారాన్నీడుస్తూ, రకరకాలుగా పోరాడు తూన్న 'మనిషి బతుకుతీరు' మధ్య తనున్నా డు. తనొంటరి వాడెట్ల అవుతాడు? అనుకున్నా డు దేవయ్య.

అలా గతంలో తిరుగాడి ప్రస్తుతంలోకి తిరి గివచ్చిన దేవయ్య మనస్సు అలసిపోయింది... ఆ అలుపులో ఎప్పుడో తనకు తెలియకుండానే అతడు నిద్రపోయాడు.




"పానం బాగలేదానె మామా! యాల్లగాని యాల్లపన్నవ్!"
దేవయ్యనులేపి మంచం అంచుకు కూర్చుంటూ అడిగాడు భిక్షపతి.

"ఎంతసేపయిందిరా వచ్చి? ఊకెనే అట్ల వొరిగిన... అట్లనే కన్నంటుకున్నది" లేచి మంచంమీద కూర్చున్నాడు దేవయ్య.

భిక్షపతి ముఖం ఆత్మవిశ్వాసంతో కళకళలా డుతోంది.

"ఏం సంగతిరా బుచ్చయ్య? నీ రిక్ష తొక్కు డెట్లున్నది? మంచిగనిపిస్తాందా? లేకుంటే కా ళ్ళుగిన గుంజుతానయా?"

"గాగుంజుడేంచేస్తదిగానీ... ఎంతైనా కొత్తగా దె! ఐతె ఊర్లె చేసినపనికన్నాపెద్దపనా? ఆక ష్టంకన్న పెద్దకష్టమా?"

"గట్లయితే మంచిదేవారి... మరందరితోని మంచిగుంటానవా? నీ అడ్డా యెక్కడ చూసు కున్నవ్‌రా!"

"మంచిగుండకుంటె నాకేం పంచాయితే! పంపుకాడి అడ్డలవుంటాన. ఆడ శానమంది నాదోస్తులే వున్నారు.

బస్సులు శాన ఆడనే ఆగుతయ్. అన్నుంచి యాడికెంత కిరాయడుగాల్నో... ముల్లెమూట లు, పిల్లజెల్లలుంటే ఎంతకు పోవాల్నో అన్నీ తెలుసుకున్నా. గాదానిదేంది కనీ..." నసిగాడు భిక్షపతి.

"మల్లకనీ అంటానవేందిరో!"

"ఆఁ..యేంలేదేరిక్షదొక్కుడు కష్టమేకాదు... ఒక్కొలను చూస్తాంటెనే బాగాకోపమొస్తాందే."

"ఒక్కొలంటే? ఎవ్వలా ఆ ఒక్కొల్లు?"

"గదేనే రిక్షలెక్కెటోల్లు.

నీయవ్వ రెండ్రూపాల తొక్కుడుకు రూ పాయే ఇస్తానంటరు. ఒక్కడు రిక్షనేయెక్కడు గాని... గింతచెప్తవా? గంతచెప్తవా? అని పంచా యతి పెట్టుకుంటరు. ఇంక కొందరైతె పావుల కాడ, పదిపైసలకాడ బ్యారమాడి సంపుతారు. గావాల్లంటెనే..."

"గావాల్లనంటనావ్? వాల్లిష్టంవాల్లది... నీయిష్టంనీది... అండ్లకోపమెందుకురా?"

"అదికాదే... వోటల్లకు, పాన్కుబీడీలకు, సికిలే ట్లకు రూపాయిలకూ రూపాయలు కర్సుపెట్టు కుంటారుగదా...
రిక్షోడు పదిపైసలెక్కువడిగిండని, దోపుకం చే సెటోన్ని చూసినట్టు చూత్తరు. గదేమంచిగని పిస్తలేదు"

"కొందరు ఎన్కనుంచి యేనుగులు పోయినా సూడరుగని ముందట్నుంచి చీమ ల్నిగూడా పోనియ్యరు. ఇష్టముంటెక్కుచ్చుకో, లేకుంటేలేదు... గంతేగని వాల్లతోని పంచాయి తిలకు, సెడాయిదిలకు దిగినవాయేంది?"

"ఏహె... పంచాయితేడదే? తొక్కెటోన్నినే ను... కష్టంనాది... గిషుతె తొక్కుత, లేకుంటె ఊకుంట... పంచాయితితోని నాకేంపనే!"

"ఆ..గట్లమరి... మీరిక్షలోల్లతోని మంచి గుంటునవా?"

"అదె... ఎందుకు మంచిగుండ? అప్పుడ ప్పుడు కొంచెం కటీమిటైద్ది...గమ్మున సదురుక పోత"

"కటీమిటెందుకయిద్దిరా?"

"గదేనే... కొందరు సవారీలు మంచిగున్న

రక్షనే యెక్కుతరు. రక్షోడు వైనోడయితేనే యెక్కుతరు. బస్సొగంగనె అందరం పోతంగద... ముందుగాలడిగినోని రక్షనెక్క కుంట, నాఅసొంటోనిరక్షయెక్కింద్రనుకో...గ వృడేకటిమి టయిద్ది''

"అవున్రా! వానికిగూడా కడుపున్నదిగదమ రి...గసొంటోల్ల నెక్కించుకోవద్దు. ముందుగాలడి గినోని రక్షల్నెఎక్కనియ్యాలె''

"గీరూలు ఆటోలకున్నదే...రక్షలోల్లకులే దు... గంతేననుకున్నావా? రొండ్రూపాలకిరాయి కి మూడురూపాలడిగిండనుకో... నాఅసొంటో డు రొండే అడిగిండనుకో...నవారీ నారక్షనెక్కు తడాలేడా? గప్పుడు గూడా కిరికిరి వుంటదే!''

"మరెట్లనెగుల్తవురో''

"ఏహె...గిదేమయిద్దే అటెంక అందరం కలిసేవుంటాం''

"గట్లమరి... గట్లనే పనిచేసుకుని సంపా యించుకో''

"అవ్‌గానీ... ఓ పాలిమాయింటికి పోయొ ద్దాంరామామా!''

"ఇప్పుడెందుకురా... పగటీలిమాగబోయి న..నీసంగతి, నీరక్షసంగతి చెప్పిన. అవ్‌గాని... ఏపనిచేయబోతానవో కసచెప్పిపోవద్దారా యింట్ల?''

"ఏమో...ఆజోబూజో...రక్షదొర్కుతదో, దొర్క దో అని చెప్పలేదే!''

"అదిసాయె... మరి రక్షదొరికినంకనన్న ఇంటికిపోయి గీపనిదొరికింది, గీపనిచేస్తాన అని చెప్పొద్దా? పొద్దుగాలసంగపోయి గీయాల్ల దాక రాకుంటుంటె... నువ్వేంచేస్తానవో, యాడ తిరిగుతానవో అని వాళ్ళు బెంగటీలపోరాన్రా? కన్న కడుపులు కాదురా...పాపం ఎంతెదిరి చూస్తాన్రోయేమో... పోపో... జప్పునపోయి వాల్ల గ్గనపడు, పో...'' తొందరచేశాడు దేవయ్య.

"మాగపోతగనీ... నువ్వుగూడరావే'' గారా బంచేశాడు భిక్షపతి.

"నేనెందుకురా...'' దేవయ్య సందేహించా డు.

"అట్లగాదే... నేను రక్షెట్ల తొక్కుతనో సూడన న్నసూడవా?
మల్లజప్పునే వద్దువ్...నేనే తొలిపోతాగనీ, నువ్వు రా మామా!''

దేవయ్యకు లేవక తప్పలేదు.

దేవయ్యను రిక్షాలో కూర్చొబెట్టి, హుషారుగా రిక్షా తొక్కుతూ, రోడ్డుగుండా తిప్పి ఇంటికి తీసుకొచ్చాడు.

గౌరమ్మ పరుగెత్తినట్లుగా వచ్చి కొడుకును అక్కున చేర్చుకుంది. లేచినుంచుని కొడు క్కేసి తృప్తిగా చూస్తున్నాడు రాయలింగు. పరుగున వచ్చి అన్న రెండుచేతులూ పట్టు కుని సంతోషంగా చూసింది మల్లికాంబ.

భిక్షపతి ముఖంలో గర్వం... అలసట... నుదుటిమీదా, గొంతుపైనా, చెవులకిందా ఎండిన తెల్లని చెమటచారికలు

"నీకెంతకష్టమొచ్చింది కొడుకా...గింతప ట్నంల నీకు గీపనే దొరికిందా కొడుకా'' భిక్షపతి నుదుటిపై చెమట తుడుస్తూ, రాగంతీసి ఏడ్వ బోయింది.

"గౌరక్కా! మల్లమొదలుబెట్టినావా? తొక్కితే క్క యాస్టపడి వాడొస్తె, ఇన్ని ఉడుకునీల్లు పోసి, కడుపునింద తిండిపెట్టాలెగని... గీసోక నాలేందే?'' మందలించాడు దేవయ్య.

గౌరమ్మ ఢాగమాగిపోయింది. మల్లికాంబ లోపలికి పోబోయింది.

పోతున్నచెల్లెలి రెండుచేతులూ పట్టుకుని ఆపాడు భిక్షపతి. జేబునుండి ఓ పొట్లంతీసి చెల్లెలు చేతిలో పెట్టాడు.

గబగబా పొట్లం విప్పింది మల్లి. అందులో నాలుగు రబ్బరుగాజులూ, ఓ రిబ్బనూ వున్నాయి.

గాజులు చేతులకు తొడుక్కుని, అన్నను ఒకసారి గట్టిగా కౌగిలించుకుని... అంతలోనే యేదో జ్ఞాపకం వచ్చినట్లు ఇంట్లోకి పరుగె త్తింది మల్లి.

భిక్షపతి పదిహేను రూపాయలుతీసి తల్లి చేతిలో పెట్టాడు. గౌరమ్మ వాటిని రాయలింగు కందించింది.

రాయలింగు ముఖం సంతోషంతో విక సించింది. ఆ సంతోషంలో అతడు తలమునక లైపోతున్నాడు.

 

''ఇయ్యాల మనసు నిమ్మలమైనాదె బావా?'' అడిగాడు దేవయ్య.

''ఇదంత నువ్వుపెట్టిన దీపమేరా దేవయ్యా! నీబాకి ఎట్ల తీర్చుకోవాల్నో యేందో! అదెపాయే... చచ్చి నీకడుపుల పుడుదామంటె నీకు పెండ్లాంలేదాయె'' అన్నాడు రాయలింగు.

''చూసినావుర అల్లుటా! మీనాయిన చచ్చి నా కడుపుల పుడుతడట. మరి నువ్వు జప్పున పెండ్లి చేసుకుంటే గౌరక్క చచ్చి నీకడుపుల పుట్టది... మనం మల్ల వాళ్లిద్దరికి పెండ్లి చేద్దాం'' అంటూ విరగబడి నవ్వాడు దేవయ్య.

''సరె సరె... సక్కదనమె... మల్ల జల్మల గూడ గీనెనే అంటగడ్తామని సూత్తానారు? ఇప్పుడే సాలయిందితమ్మీ!'' ముసిముసిగా నవ్వుతూ అంది గౌరమ్మ.

''అదె?... అదెనే? నీకు నేనేం తక్కువ చేసిన్నె గౌరీ? సాలయిందంటానవు. పుడుతె గిప్పుడున్నట్టె పుడుతననుకుంటానవా యేంది? మల్ల పిల్లగాన్నయిత'' తానూ నవ్వుతూ అన్నాడు రాయలింగు.

గౌరమ్మ మరీ సిగ్గుపడిపోయింది. దేవయ్యా, భిక్షపతీ హాయిగా నవ్వుకున్నారు.

అంతలోనే... ఏదో మరచిపోయినట్లుగా, గబగబా రిక్షా దగ్గరకు పరుగెత్తికెళ్ళి, చేతుల్లో ఓ కాగితపు పొట్లంతో తిరిగివచ్చాడు భిక్షపతి.

''ఇవి జప్పునవండే! దేవయ్య మామగూడ ఈపూట ఈన్నే తింటడు'' పొట్లాన్ని తల్లి కందించి అన్నాడు.

''ఏంటియి బిడ్డఇయి?'' పొట్లం విప్పింది గౌరమ్మ. ఎండు చేపల వాసన గుప్పున వ్యాపించింది.

''అట్లనే వండుతతీ బిడ్డ'' కొడుకును తృప్తిగా చూసిందామె.

''నాకెందుకురా... నేను యాన్నోతింట'' అన్నాడు దేవయ్య.

''అదెపాయెతమ్మీ! పిల్లగాడు సంబ్రపడుతాండు... ఈన్నే తినిపో తమ్మీ! మీరు మాట్లాడుకుంటుండుండ్రి'' అంటూ లోపల కెళ్ళింది గౌరమ్మ.

దేవయ్య భిక్షపతిని తదేకంగా చూశాడు. ఒక్కరోజే అతడెంతో ఎదిగినట్లు కనిపించాడు. తనపట్లవున్న గౌరవానికి దేవయ్య విచలితుడయ్యాడు. వెంటనే అతడీరోజు పెట్టిన ఖర్చు గుర్తుకొచ్చి గంభీరంగా మారిపోయాడు.

''వారీ బుచ్చయ్యా! ఇయ్యాల ఎంత సంపాయించినవో, ఎంత కర్చు చేసినవో చెప్పు'' అడిగాడు.

''కొత్తోన్నిగాదె... ఇయ్యాల ఇరువై రూపాయిలే దొరికినయ్. నాయినకు పది హేనిచ్చినా... మూడ్రూపాయిలు చెల్లెకు గాజులుకొన్న... రెండ్రూపాయిలు చాపల్తెచ్చిన... చిల్లర చిల్లర కిరాయిలు నా చాపలారాలకైనయ్''

''ఇయ్యాలిన్ని సంపాయించినవోలేదో... గిట్ల కర్చు చేసుడు నాకు మంచిగనిపిస్తలేదురా!''

''సిమాంట సంపాయించినగాదె మామా''

''దినాం గిట్లనే పైసలొస్తయనుకోకు... ఓనాడోనాడు రిక్షకిరాయి గూడగిట్టది. మరి రోజు గిట్లనే కర్చుపెడ్తవా?''

''నీయవ్వ... నాకు గాయింతెరుకలేదానె! దొరికిన్నాడు, దొరుకన్నాడు ఒక్క తీర్గనే వుంటనా?''

''ఆ... నువ్వు గట్లంటవని నాకెరికే. నేనే మంటాన్నంటే... దొరికిన్నాడు, దొరకన్నాడు ఒక్కతీర్గగే వుండాలె అని. నాలుగు పైసల్దొరికిన్నాడెగిరిపడకుంట దాసుకోవాలే. గవ్వే ఏం దొరుకన్నాడు పనికొస్తయ్... గట్లచేసుకోకుంటె నువ్వు దొరుకన్నాడు ఉపాసం పండాలెమరి... ఎరికేనా?''

''నీయవ్వ... నాగ్గివన్నెందుకే? దొరికినయ్ దొరికినట్టు తెచ్చి నాయినకే ఇస్త'' అన్నాడు భిక్షపతి.

కొడుకు సంపాదన తిండి ఖర్చుపోను... ఒక్క రోజుకు ఇరవై రూపాయలని తెలిసి రాయలింగు ఆనందంతో తలమునకలైపోతున్నాడు. నోరు తెరుచుకుని అలాగే చూస్తున్నాడు.

''ఇన్నవానె బావా! అల్లుడు రాజామాట మాట్లాడిండు. ఇంకనీకస్టాలు గట్టెక్కినట్టేనే. నీ అన్నం కుక్కలు ముట్టయ్... ఏమంటవ్ బావా!'' రాయలింగుకేసి తిరిగి అన్నాడు దేవ

య్య.

"నిజమే... తన కష్టాలు పోయినట్టే... కొడుకు తన సంపాదనంతా తెచ్చి తనకే ఇస్తానంటున్నాడు... ఇంక తనకేం కావాలి?' రాయలింగు మనస్సు తేలికై పోయింది.

ఇంతలో నీళ్ళు కాగినయని మల్లికాంబ పిలిచింది. భిక్షపతి స్నానం చేసొస్తాననిచెప్పి లోనికెళ్ళాడు.

"వాన్ని గంతగనం బయపెడ్తానవేందిరా దేవయ్యా! నిన్న మొన్నటి పోరడు... గావాడు పనిచేసుడే పదివేలు... ఏదో కొంతకాలం గిట్లన డువనీ... గిప్పుడే వానికి గీబయాలెందుకు?" అన్నాడు రాయలింగు.

"ఇగొ బావా! వాన్నింకా పోరడే అనుకునుడు మానున్రి... మొలుకప్పుడే జాగ్రత్తపడి మనకిష్టమున్నట్లు మలుసుకోవాలె... అటెంక వంగుడు శానకష్టం. ఇదేందనుకున్నవ్? నీవ ల్లెటూరనుకున్నవా? ఈడ వాడవాడకు సినిమాలున్నయ్... కల్లు దుకాండ్లు, సార దుకాండ్లు ఎటు చూసినా కనిపిస్తయ్.... లేసింది మొదలు పండుకునెదాక కండ్లముందట్నే వుండి పోరగాండ్లను పాడుజేస్తయ్... ఆయింత సోపతి మంచిది దొరకకుంటె జప్పున పాడైతడు... గప్పుడువాడు తిని తాగుడు కోసమే పనిచేస్తడు తప్ప బతుక్కోనం పనిచేయడు. నీకక్కెర్రాకుంట పోతడు... గందుకే వానికి ముందుగాల తెలజెప్పిన" అన్నాడు దేవయ్య.

"గది సరెగాని దేవయ్యా! గింతమందికి గిన్నతీర్ల సాయం చేసుకుంట, మంచి చెప్పుకుంట.. చెడ్డ చెప్పుకుంట దిద్దుతానవ్... మరి నీమంచి చూసుకోవా?"

"అగొ నాకిప్పుడేమయిందే? నేనిప్పుడు మంచిగలేనా?"

"ఏంమంచిరా? ఒయాల్లలేదు పొల్లలేదు... తింటె తింటవ్ లేకుంటె పంటవ్... ఆకలి చూసెటోల్లులేరు, దూప చూసెటోల్లులేరు... తోసిన్నాడు పనిచేస్తవ్, లేకుంటెలేదు. గిట్లెంత కాలంరా దేవయ్యా! ఆయింత మంచంల పడితె ఎవలుచూస్తర్రా?"

"అదె... మీరంత లేరానె? నాకు బుక్కెడు బువ్వేదొరుకదా?" అని అన్నాడే కాని దేవయ్య గొంతులో మార్పు స్పష్టంగా వినిపించింది.

"ఎప్పడో బుక్కెడు పెట్టుడువేరు... ఎల్లకాలం పెట్టుడు వేరు... ఎంతపెట్టినా నీసొంత మనుసులైతరా? నీనుకం పంచుకుంటరా... నీదుక్కం పంచుకుంటరా? నీ పిచ్చిగానీ... ఎవలోల్లు వాల్లకుండా్రలా దేవయ్యా!"

రాయలింగు మాటలు దేవయ్య గుండె మారుమూలల్ని తాకాయి. గుండెలోతుల్లోకి చొచ్చుకుపోయి అతన్ని విపరీతంగా కదిలించాయి. ఏమీ మాట్లాడకుండా... అలాగే రాయలింగును చూస్తూ వుండిపోయాడు.

"ఇప్పటికైన మించిపోలేదురా దేవయ్యా! నువ్వు ఊ అను... ఓ మంచి పిల్లనుచూసి పెండ్లిచేస్త.వానిల్లు నాశిడమై పోను... నీ సంసారాన్ని కూలగొట్టి వాడు కూడ గాబుద్ధితోనే నాశిడమై పోయిండు... గవన్నిప్పుడెందుగ్గాని... ఎవ్వలైనా కండ్లు మూసుకొని నీకు పిల్లనిస్తరు... నువ్వు పెండ్లి చేసుకోరాదురా దేవన్నా!" ఎంతో ఆప్యాయంగా అన్నాడు రాయలింగు.

ఒక క్షణం దేవయ్య హృదయం రెపరెపలాడింది. కాని వెంటనే తనకుతాను నిభాయించుకున్నాడు.

"పెండ్లా? నాకు పెండ్లా? గీ యాడులనాకు పెండ్లా? నీకు పిచ్చిగిన లేసిందానె రాయలింగు బావ? ముప్పైదాటిన నాకు పెండ్లేందే? నీయవ్వ ఎవ్వలన్నిన్నా నవ్వుతరు... గిప్పుడు నాకు పిల్లనిచ్చే పిచ్చోడుంటాడె" దేవయ్య నవ్వుతూ అన్నా అతని మాటల్లో కాని, నవ్వులోకాని జీవంలేదు.

"అదె...ఎందుకీయర్రా? నీకేమంతీడుబోయింది? ఎనుకట ముప్పైయేండ్ల మొగోనికి మూడేండ్ల పిల్లనిచ్చి పెండ్లిల్లు చేయలేదా? వాల్లు సంసారం చెయ్యలేదా? కనలేదా... పెంచలేదా? నీ అంతీడోల్లేంతమందో పెండ్లి చేసుకుంటాంద్రు... గవన్నెందుకు? నువ్వు ఊ అన్రాదు... పిల్ల సంగతి నేనే చూసుకుంట"

"ఇగొబావా! పొద్దువాలబోయే బతుకునాది. గిప్పుడు గీ బందనాలతోని ఉంకోల్ల బతుకు పాడుచేసి, వాల్ల వుసురుపోసుకొని బతుకు

మంటవా? అదికాని మాట... ఎనుకటంటె... అది గుడ్డికాలం... ఇంకా సంగతి మల్లెత్తకు బావా!" అన్నాడు దేవయ్య దృఢంగా.

మల్లికాంబ వంటయిందనీ, భోజనానికి రమ్మనీ పిలిచింది.

దేవయ్యను తీసుకొని లోపలకు నడిచాడు రాయలింగు.

రెండు మూడు వారాలు గడిచింతర్వాత, రిక్షాను నెల కిరాయి కిందికి మార్చుకున్నాడు భిక్షపతి. వారం వారం పోవడంకన్నా నెలకో సారి పోవడమే అతనికి సులభమనిపిస్తోంది.

పగలంతా సంపాదించిన పదిహేనో ఇరువయో తండ్రికిస్తున్నాడు. రాత్రి మొదటి సినిమా అయిపోయి, రెండో సినిమా మొదలు పెట్టేదాకా సంపాదించిన ఐదో పదో తన ఖర్చులకు వాడుకుంటున్నాడు.

రెండు నెలలిలా గడచిపోయాయి. రాయలింగు ఆదాయం వేయిదాటిపోయింది.

సర్దార్‌కు రు. 120/-. రిక్షాకు రు. 100/-. బండికిరాయి రు. 20/-. మొత్తం రు. 240/- నెలాఖర్న సులభంగా ఇవ్వగలిగాడు. రు. 300/- ఇంట్లో తిండికి ఖర్చైనా, రు. 200/- పెట్టి ఇంట్లోవాళ్ళకు తలా ఓ గుడ్డల జతకొన్నా, ఇంకా అతనిదగ్గర రు. 300/- రూపాయలదాకా మిగిలాయి.

రాయలింగు సంతోషానికంతులేదు. ఆ సమయంలో, సర్దార్ దగ్గర అప్పుతీసుకోకుండా, స్వంత పెట్టుబడితో వ్యాపారం చేయాలనుకున్నాడు. కాని అంతలోనే అతనికో ఆలోచనవచ్చింది.

"ఎప్పుడే కష్టమొస్తుందో... అప్పుడు డబ్బెక్కడ దొరుకుతుంది?" అనేదే ఆ ఆలోచన. అందుకని 200 రూపాయలు ముల్లెకట్టి దాచాడు.

సర్దార్ దగ్గర అప్పుతీసుకుని, కొంత స్వంత డబ్బు కలిపి 150 రూపాయలతో బేరం సాగించాడు రాయలింగు. రోజూ 25/- రూపాయలదాకా సంపాదించగలుగుతున్నాడు.

ఇప్పుడతని కుటుంబానికి రెండుపూటలా కడుపునిండా తిండి దొరుకుతోంది. అప్పుడప్పుడు చిన్న చిన్న సరదాలు కూడా తీరుతున్నాయి.



'కష్టం చేసుకోవాలిగాని... బస్తీల్లో సుఖంగా బతకవచ్చు. దేవుడు మేలుచేసి... ఇట్లాగే ఓ యేడాది కష్టపడితే... స్వంత పెట్టుబడితో వ్యాపారం సాగించుకుంటూ... తనే స్వంతబండినే కొనుక్కోవచ్చు. ఇంకా అదృష్టం కలిసివస్తే, ఆ కాలనీలోనే ఓ కూరగాయలకొట్టు తెరువవచ్చు. అలాగే గవర్నమెంటు లోను తీసుకుని భిక్షపతికి ఓ రిక్షా కొనివ్వచ్చు. అలా అలా డబ్బు కూడబెట్టుకుని, భిక్షపతికీ, మల్లికాంబకూ మంచి సంబంధాలుచూసి... రెండు పెళ్ళిల్లూ ఒకసారి చేయొచ్చు... ఆ తర్వాత తను కాలు మీద కాలేసుకుని హాయిగా...' రాయలింగుకు భవిష్యత్తు సుఖమయమై కనిపించింది.

పెట్టుబడెక్కువ... కొనే కూరగాయలెక్కువ... గంపలెక్కువ... మునుపటిలా బస్సులోవెళ్ళి బస్సులో కూరగాయలు తీసుకుని రావడం రాయలింగుకు వీలుకావడంలేదు.

ఇప్పుడతను బస్‌స్టాండ్‌లోనే ఒక కిళ్ళీకొట్టు పక్కన తన బండిపెట్టుకుంటున్నాడు. ఖాళీ గంపల్ని బండిమీదేసుకుని బస్టాండు కొస్తాడు. బండిఅక్కడే వుంచి... ఖాళీ గంపల్తో లోకల్ బస్ ఎక్కుతాడు. వచ్చేటప్పుడు మాత్రం రిక్షాలో వస్తున్నాడు.

చలికాలం వెళ్ళిపోయి, మార్కెట్‌కు సరుకు రావడం తగ్గిపోయింది. కాయగూరల ధరకూడా పెరిగిపోయింది. రాయలింగుకు కిలోకు 30.40 పైసలు... కొన్నింటికైతే అర్ధరూపాయి వరకు లాభమొస్తోంది.

తోటకూర, పాలకూర, బచ్చలి కూరల్లాంటి ఆకుకూరల్లో లాభమెక్కువ. వాటిని గంపలలెక్కన కొనుక్కుని కట్టలు కట్టుకొని అమ్మాలి. కానీ వాటితో వచ్చిన చిక్కల్లా అమ్ముడుపోకపోతే నిలువవుండవు. పొద్దు రెండు బారలెక్కేసరికే మొఖం తేలవేస్తాయి. తక్కువ ధరకైనాసరే సాయంత్రానికల్లా అమ్మవలసిందే.

మిగతా కూరగాయలు 'ఎత్తుల' లెక్కన కొనుక్కోవాలి. ఒక ఎత్తంటే రెండున్నర కిలోలు. హోల్‌సేల్‌లో ఎన్ని ఎక్కువ ఎత్తులు కొంటే అంత ధర తక్కువ. వాటిని పావుకిలో, అరకిలోల లెక్కన అమ్ముకుంటే లాభమెక్కువ.



వంకాయలు, బీరకాయలు, దొండ, దోస... వీటిని నీళ్లు చల్లుకుంటూ ఒకటి రెండురోజులు కాపాడుకోవచ్చు. టమాటాలు పూర్తిగా పండిపోయినవికాక దోరపండినవి కొనుక్కోవాలి. జాగ్రత్తగా వాడుకోకుంటే చితికిపోయి నష్టమొస్తుంది.

ఇలా కూరగాయల వ్యాపారంలోని మెలకువలన్నీ రాయలింగుకు తెలిసిపోయాయి. మార్కెట్‌లో ఇప్పుడతను, పెద్దమారు బేరగాళ్ల లో ఒకడైపోయాడు.

మార్కెట్ సరుకేకాక, అప్పుడప్పుడు పల్లెటూర్లనుండి వచ్చే గంపల్ని కూడా అతడు కొంటున్నాడు. హోల్‌సేల్‌వాని లాభం కూడా అప్పుడు రాయలింగుకే వస్తోంది.

ఇంకా తానే స్వంతంగా చుట్టుపక్కలవున్న పల్లెటూర్లకు వెళ్ళి, సరుకులు కొనుక్కొంటే ఇంకా ఎక్కువ లాభమొస్తుందని రాయలింగుకు తెలుసు. కాని పోవడం, రావడం... పెట్టుబడి చాలా కావడం... రాయలింగుకది వీలుకాలేకపోయింది.



ఒకనాడు... తెల్లవారకముందే బస్టాండ్ చేరాడు రాయలింగు. వరంగల్ వెళ్ళే బస్సు నాలుగున్నరయినా ఇంకా రాలేదు. అలస్యాన్ని భరించలేక రిక్షా మాట్లాడుకుని వరంగల్ మార్కెట్ చేరాడు.

మార్కెట్‌వద్ద రిక్షాదిగి ఆశ్చర్యపోయాడు రాయలింగు.

మెయిన్‌రోడ్డు నుండి మార్కెట్‌కు వెళ్ళే సందులో, ఒకరినొకరు ఒరుసుకుంటూ నడిచిపోయే మనుషులులేరు. వాళ్ళ కేకలులేవు. ఎక్కడెక్కడినుండో సరుకులతోవచ్చి, మనుషుల్ని నడవరాకుండాచేసే లారీలులేవు. ఆటోలు, రిక్షాలులేవు. తలమీద గంపలతో ఉరుకులూ పరుగులతో వచ్చేవాళ్ళులేరు. ఖాళీగంపలు పట్టుకుని పైనపైనకు బేరమాడే, మారుబేరం స్త్రీలులేరు. తట్టలు, గంపలు, కూజాలు, కుండలమ్మే వాళ్ళ అరుపులులేవు.

ఆ సందులో అటూ ఇటూ కుప్పలుగా... ముక్కుపుటాల్ని బద్దలుచేసే ఎండుచేపలు, రొయ్యల కుప్పలులేవు. పెల్సుల్లోని కోళ్ళకన్నా ఎక్కువగా అరిచే కోళ్ళ బేరగాళ్ళులేరు.

లోపల అంతటా పరచిన కూరగాయలు లేవు. దారినిండా వుండే కూరగాయల బురద లేదు. హోల్‌సేల్ వ్యాపారస్థుల అరుగుల మీద కూరగాయల కుప్పలులేవు.

మార్కెటంతా నిర్మానుష్యంగావుంది.

"తాను ముందుగా రాలేదుకదా!" అని తూర్పుకేసి చూశాడు.

అదేమీకాదు... తూర్పు పులుముకున్న ఎరుపురంగు క్రమంగా తెల్లబడుతోంది.

అటూ ఇటూ పరికించిచూస్తూ, అర్థంకాకుండావున్న రాయలింగుకు దూరంగా అరుగుమీద కూర్చుని పళ్ళు తోముకుంటున్న ఓ వ్యాపారి కనిపించాడు.

గబగబా అటువేపు నడిచాడు రాయలింగు.

అతని ద్వారా తెలిసింది రాయలింగుకు... ఆరోజు 'వరంగల్ బంద్' అని... బస్సులు, దుకాణాలు, హోటల్లు, సినిమాలు అన్నీ బందుంటాయని.

'ఈ బందెందుకు పెట్టారు? ఎవరుపెట్టారు?'' అని ఆలోచించుకుంటూ, రిక్షాకిరాయిలు దండుగైపోయినందుకు విచారిస్తూ నిరాశగా, గంపల్ని భుజానవేసుకుని బయటికొచ్చాడతను.

అతడు కాంపౌండ్ దాటగానే అటువేపున్న టీ డబ్బాముందు, చెక్కమీద కూర్చున్న రాగన్న కనిపించాడు. రాయలింగు అటువేపు నడిచాడు.

"ఇయ్యాల బందని ఎరుకలేదాన్నా?" రాయలింగు గంపల్ని చూస్తూ అడిగాడు రాగన్న.

"ఎరుకుంటెందుకొస్తనే? నీయవ్వ బ్యారం సంగతటుంచి, రానుపోను కిరాయిలు కూడ




దండుగైపాయె'' విచారంగా అంటూ రాగన్నకె దురుగావున్న చెక్కమీద కూర్చున్నాడు రాయ లింగు.

రాగన్నతోపాటు రాయలింగుకు కూడా సింగిల్ చాయందించాడు టీకొట్టువాడు.

''ఇంక గీదండుగ గూడపెట్టాల్నా?'' సందే హించాడు రాయలింగు.

''ఓర్నీయవ్వ... రానుబోను ఆర్రూపాయిలు పెట్టంగలేంది, గీఆటానకే వచ్చినాదిరా! తిన్నది తాగింది దండుగ్గాదురా!'' అన్నాడు రాగన్న.

''గీ బందేందే? ఎవలు చేత్తాను... ఎందుకు చేత్తాను?'' గ్లాసందుకుంటూ అడిగా డు రాయలింగు.

''బడిపిలగాండ్లు బందుపెట్టుమన్నరు. ఓ పార్టీ పిలగాన్ని ఇంకో పార్టీ పిలగాండ్లు చంపిన్రట. చచ్చిన పిల్లగాని పార్టీవోల్లు ఇయ్యాల ఓరంగల్లు బందన్నరు... అందరు బందుపెట్టిన్రు. గీసంగతి నిన్ననే అందరికెరు కైందిగాదురా... నీకెరుక కాలేదా?''

''నాకెరుకకాలేదే... అమ్ముకునెటాలకే యా ల్లయిద్ది... ఇంటికొచ్చి ఇంతతిని పండిలేచి నంక, అదోయిదో ఇంటిపనిచేసుకుంటుంట... నాకెట్ల తెలుస్తదే!''

''ఐతేమయింది తీరాదురా... కొత్తోనివి నీకు తెల్వదుగాని... గిసొంటియి వస్తనేవుంటయ్, పోతనే వుంటయ్. ఒక్కబడి పిలగాండ్లేనా... శానమంది శానసార్లు బందుపెట్టిన్రు''

''బందుపెట్టిచ్చిన బడిపిలగాండ్లీడ లేరు గాదె?''

''వత్తరు వత్తరు... ఇంత పొద్దెక్కినం కొత్త రు... వాల్లుంటెనే బందుపెడ్తరు, లేకుంటె లేదనుకుంటానవా? నిన్న పత్రికలు పరచింద్రుగద వాల్లు మాటన్నరంటెసాలు... అందరి కుచ్చపడ్తది. బందుపెట్టనోడు బత్కు తడా అని ఈవాల్లొచ్చి తంతరు, దుకానాన్ని నాశిడం పదారుబాల్లు చేస్తరు... ఎక్కువ తక్కువ మాట్లాడితె ఇంకేమన్న చేస్తరు''

''సదూకొమ్మని అయ్యవ్వలు పంపుతె... గీబ డి పిలగాండ్లు గిట్ల సంపుకునుడేందే?''

''అగో...గావాల్లల్లగూడ పార్టీలులేవా? సదు వైపోయినంక పార్టీలు నడిపెటోల్లెవలనుకు న్నవ్? గావాల్లేకాదుర!''

''జప్పున తాగుర్రి... పొద్దెక్కుతాంది ఎవలు చూడకముందు డబ్బ బందుచేయాలె'' కొట్టు వాడు తొందరచేశాడు.

చాయ్ చాలా వేడిగా వుంది. గబగబా తాగడం వల్ల రాయలింగు నాలిక తిమ్మిరెక్కింది.

ఇద్దరూ టీ తాగి, డబ్బులూ గ్లాసులూ అందించారు. అవి అందుకుని డబ్బా మూసే ప్రయత్నంలోవున్నాడు కొట్టువాడు.

''మూసేస్తానవా? పాలయిపోయినయా?'' రా గన్న అడిగాడు.

''యాడయిపోయినయ్... సాయంత్రంవ రకు ఉడుకుసల్లారదా! గప్పుడు తెరుసుకో వాలె, అప్పుడు గూడా తెరువకుంటె అంతకో యింతకో చెడాలె... ఏం చేస్తంమరి...'' అంటూ డబ్బామూసేశాడు కొట్టువాడు.

''సంపినోన్ని పట్టుకొని పోలీసులకొప్పజె ప్పక... గీబందులేంది? గీ బయాలేందే రాగ న్నా?'' సగం ఆర్పి చెవులో పెట్టుకున్న బీడీ ముక్కను తీసి అంటించుకుంటూ అడిగాడు రాయలింగు.

''ఊఁ... సంపినోడు గంతల్కదొర్కుతడను కుంటానవా? పట్టుకునుడు మా కస్టం... గట్ల కస్టపడైన పట్టుకోని, సిచ్చించాలని చెప్పుటా న్కె గీబందు'' తానూ బీడంటించుకున్నాడు రాగన్న.

''గావాల్ల పట్టుకోని సిచ్చేసుడే పోలీసోల్ల పనాయె. సర్కారు గది చూసుకోదా? వాల్లపని వాల్లను చూసుకొమ్మనుటానికి బందానె?'' ఈ బందు చేయడం ఏమాత్రం ఇష్టంలేని రాయ లింగుకు అది అసలే న్యాయమనిపించడంలే దు.

''గట్లంటెట్లరా రాయలింగూ! సర్కారోని గ్గూడ ఓ పార్టీవుండె... వానికి పడని పార్టీ లుండె. గీ పార్టీలన్ని ఎప్పటికి కీసులాడు కుంటనే వుండె, చిన్నబల్లల్ల పెద్ద బల్లల్ల వాల్లవాల్ల గుంపులుండనే వుండె పిల గాండ్లంటె బడిపిలగాండ్లే బందుచేయిస్తాన్ర నుకున్నవా? పార్టీలే బందుచేయిస్తానయ్''



సాధ్యమైనంత విడమరచిచెప్పాడు రాగన్న.

"గట్లనా... మరి గీ ఓరంగల్లు నిండ మన సొంటి ప్యాదముండకొడ్కులు శాన మందుండిరి. పొద్దెల్ల పనిచేసుకుంటెనే వాల్లకు మాపటికింత తిండి దొర్కుతదాయె మరియ్యాల గావాల్లంత ఉపాసం పండా ల్నంటరానె వాల్లు?"

"నీదంత సొదిరా రాయలింగూ! ఒక్కరోజు కష్టం చూసుకుంటవా, ఎల్లకాలం సుకం చూసుకుంటవా? ఇయ్యాలొన్ని రేపొన్ని గిట్లనే సంపుకుంటపోతే బూమ్మీద మనుసులు మిగుల్తరామరి? ఈడ నాతోనంటె అన్నవ్‌గని... ఆడీడనేవు కాల్రెక్కలిరుగుతయ్" అంటూ లేచాడు రాగన్న.

"మారె... ఉంకోడ నేనెందుకంటనే? ఊకెనే తెలుసుకుందమని అడిగిన మరెగనీ... రాగన్నా! బంధంటె అన్నీ బందేనానె?" తానూ లేచి గంపల్ని భుజానవేసుకుంటూ అడిగాడు రాయలింగు.

"అవ్... అన్నీ బందే. నువ్వు సప్పుడుసేక ఇంటికిపో ఇంకాసేపయితె పోవుడుగూడ కష్టమయిద్ది. ఆయిల్లటిదేమన్న మిగులుంటె తిను... లేకుంటె కడుపులో మోకాల్లు పెట్టుకోని పండు... గంతెకాని గీ బందేంది? గీ బందెందుకు? అని అనకు" అంటూ రాయలింగును మరోసారి హెచ్చరించి వెళ్ళిపోయాడు రాగన్న.

రాయలింగు తిరుగుముఖం పట్టాడు. మళ్ళీ రిక్షా మాట్లాడుకుని పోవాలంటే అతనికి దిగులేసింది.

"అక్కడినుండి కిరాయి' ఎక్కువౌతుంది. చౌరస్తా దాకనో, లక్ష్మీటాకీస్ దాకనో లేకుంటే ఎల్లమ్మబజార్ సందుల్లల్ల నడుస్తూ గాంధీ దవాఖానకు పోగలుగుతే... అక్కడినుండి కిరాయి తక్కువ" అనుకుని... ఓపికున్నంత దూరం నడువాలనుకున్నాడు రాయలింగు.

ఒకదానిలో ఒకటిగా దిగేసిన గంపల్ని భుజానవేసుకుని ఆలోచిస్తూనడుస్తున్నాడు.

ఎంతాలోచించినా అతనికి బందు మాత్రం సరైందనిపించడంలేదు.





పొద్దుపొడిచి మూరెడెక్కింది. రోడ్లమీద పల్చగా జనం అటూ ఇటూ నడుచుకుంటూ పోతున్నారు.

రిక్షాలు, ఆటోలు, సైకిళ్ళు తప్ప... బస్‌ల జాడలేదు.

రోడ్లమధ్యగా బలిసిన పశువులు పడుకుని, నెమరువేస్తూ సగం కళ్ళు మూసుకునివున్నాయి.

'సినిమా పోస్టర్లూ, ప్యాకింగుల్లో వచ్చే గడ్డీ, అరటితొక్కలూ, చెత్తాచెదారం తిని... బలిసిముచ్చపోసివున్న ఆ ఆబోతుల పుటుక మారాజుపుటుక, అనుకున్నాడు. అంతలోనే అవి నాగటికి పనికిరావని, ఎవరికీ అక్కర్రానిపుట్టుక అనుకున్నాడు.

"ఉన్న మారాజులు... గట్లనే పండుకొనున్నా వాల్లకెల్తది కాని. గరీబోడేం తిని బత్కాలె?" ఈ మాటలు లోపల అనుకున్నవి పైకే అనేశాడు రాయలింగు.

"ఈ బందు చేయించేవాళ్ళు ఈ సంగతి ఆలోచించరా? నెలకిలాంటి బందులు నాలుగైతే రోజుకూలీవాళ్ళెట్లా బతుకుతారు?" అన్న ఆలోచనతో అతని మెదడంతా చికాకైపోయింది.

రాయలింగిలా ఆలోచించుకుంటూ చౌరస్తా దగ్గరకు రాగానే రయ్యిన దూసుకుంటూ ఓ లోకల్ బస్ వచ్చింది.

రెండు డోర్ల దగ్గరా పోలీసులు తుపాకులు పట్టుకుని వున్నారు. బస్సులోపల కిక్కిరిసిన జనం అగ్గిపుల్లల్లా అతుక్కుపోయివున్నారు.

రాయలింగుకు కాస్త సంతోషం కలిగింది. 'అదెలాగైనా తిరిగి వస్తుంది. దాంట్లో వెడితే రూపాయి లోపల హనుమకొండ చేరవచ్చు. రెండు రూపాయలు మిగిలినా మిగిలినట్లే'- అనుకుని చౌరస్తా స్టాఫ్‌లో బస్‌కొరకు ఎదురు చూస్తూనుంచున్నాడు.

అక్కడ ఇరవై ముప్పైమందిదాకా బస్‌కొరకు ఎదురుచూస్తూనుంచున్నారు. వాళ్ళ చుట్టూ 'హనంకొండా... హనంకొండా' అని అరుస్తూ ఆటోవాళ్ళు, రిక్షావాళ్ళు తిరుగుతున్నారు.

'ఆ బస్సును నడిపించినట్టే మార్కెట్‌ను కొంతసేపు నడిపిస్తే బాగుండేది' అనుకున్నాడు రాయలింగు.

అటూ ఇటూ వున్న షాపులన్నీ మూసేవున్నాయి. అరుగుల మీద ఓనర్లు కావచ్చు నిలబడి మాట్లాడుకుంటున్నారు. అప్పుడోటీ ఇప్పుడోటీ జీపో, కారో- రయ్న శబ్దంచేస్తూ పరుగెడుతున్నాయి. రోడ్డు మీద వందగజాలకొకరు చొప్పున చిప్పటోపీల పోలీసులున్నారు. దూరంగా కనిపిస్తున్న ఎత్తైన రైలుకట్టమీద నెమ్మదిగా పోతున్నా పెద్దగా కూతవేస్తున్న రైలుబండి. రాయలింగు అటుకాసేపూ, ఇటు కాసేపూ చూస్తూనుంచున్నాడు- కూర్చున్నాడు- మళ్ళీలేచి నుంచున్నాడు.

అరగంట గడిచింది. పొద్దుబారెడెక్కింది. బస్సురాలేదు. రాయలింగు కాళ్ళు పీకుతున్నట్లనిపించింది. ఇక లాభంలేదని గంపల్ని పక్కనపెట్టుకుని, అక్కడే ఒక దుకాణం మెట్ల మీద కూర్చున్నాడు.

మరో అరగంట గడిచింది. ఎండ చిటపటలాడుతోంది. స్టాప్‌లో జనం ఇంకా ఎక్కువయ్యారు. రాయలింగుకు విసుగుకలుగుతోంది.

అంతలో ఆపసోపాలు పడుకుంటూ బస్సు వచ్చింది. లోపల జనం ఒకరిమీదొకరుగా నుంచుని వున్నారు.

స్టాప్‌లో ఉన్న జనం ఒకర్నొకరు నెట్టుకుంటూ, తొక్కుకుంటూ డోర్ దగ్గర గుంపులుగా మూగారు. దిగేజనం కష్టంగా కిందికి దిగారు. ఒక్కసారిగా తోపులాట- నెట్టుకుంటూ లోపలకు పోతున్నారు.

అటు నెట్టుకుని, ఇటు నెట్టుకుని గంపల్ని నెత్తిమీద పెట్టుకుని చివరకు డోర్ దగ్గరకు చేరాడు రాయలింగు.

మరి కాసేపటికి బస్‌కడ్డీ దొరికేది, కాలుకు మెట్టుదొరికేది. కాని అంతలో గంపల్ని పట్టుకుని, గంపలతోపాటు రాయలింగును కూడా దూరంగా ఈడ్చి, 'గంపలకు చోటులేదు' అన్నాడు పోలీసు.

కిందపడబోయి నిలదొక్కుకుని, రాయలింగు దీనంగా చూస్తుండగానే బస్ వెళ్ళిపోయింది.

రాయలింగు హతాశుడయ్యాడు. ఇంక నడిచే ఓపిక కూడా అతనికి లేకపోయింది. అతడు రిక్షాలో పోవడానికే నిర్ణయించుకున్నాడు.

ఇందాక మూడ్రూపాయలన్న రిక్షావాడు ఇప్పుడు ఐదురూపాయలడుగుతున్నాడు. తనకు మూడు రూపాయలు తీసుకుని మరో సవారీ చూసుకోమన్నాడు రాయలింగు. ''గంపలే ఏకసవారీ, మరో సవారీ ఎక్కడ కూర్చుంటుంది?'' అన్నాడు రిక్షావాడు.

చివరకు ఐదు రూపాయలకొప్పుకోక తప్పలేదతనికి. గంపల్ని ఓ పక్కన పెట్టి రిక్షాలో కాలబద్ధట్లుగా కూర్చున్నాడతను.

'అనవసరంగా ఎనిమిది రూపాయలు ఖర్చయ్యాయి. వీటితో ఓరోజుకు సరిపోయే నూకలూ, ఉప్పు, మిరపకాయ, చింతపండు వచ్చేవి. తలా ఇంత తినేవారు... ఈ బందు సంగతి ముందు తెలిస్తే ఈ రూపాయలు మిగిలేవి' అని మథనపడిపోయాడు రాయలింగు.

రిక్షా పోచమ్మ మైదానందాటి, గోపాల్‌స్వామి గుడిదాటి, గాంధీ హాస్పటల్‌వేపు పరుగెత్తుతోంది. రిక్షా కాంపౌండువద్దకు చేరిందో లేదో హాస్పటల్ ముందు పెద్దగుంపు. పరుగెత్తుతున్న జనం, పోలీసులు... అరుపులు కేకలు...

రిక్షావాడు కాంపౌండు నానుకున్న సందుకు తిప్పాడు. రిక్షానాపి గొడవ జరుగుతున్నవేపు చూస్తున్నాడు.

జనం పిచ్చిపట్టినట్లుగా పరుగెత్తుతున్నారు. పోలీసులు అందినవాడినల్లా లాఠీలతో బాదుతున్నారు. దూరంపోయిన జనం పోలీసులమీద రాళ్ళు రువ్వుతున్నారు.

కాసేపటికి తుపాకులు పైకిలేపి పేల్చారు పోలీసులు. ఆ ప్రదేశం ఢాంఢాం శబ్దాలతో మారుమోగింది.

రెండు నిమిషాల్లో జనం పారిపోయారు. దూరంగా పడిపోయిన కొందర్ని బాదుకుంటూ తీసుకొచ్చి, వ్యాన్‌లోకి విసిరేశారు పోలీసులు.

పది, పదిహేను నిమిషాలిలాగే జరిగిపోయాయి. దాదాపు 20 మందిదాకా వ్యాన్‌లోపడ్డారు. కొందరు పోలీసుల్నక్కడే వుంచి వ్యాన్ వెళ్ళిపోయింది.

మరో పదినిమిషాల తర్వాత అటూ ఇటూ ఆగిపోయిన వాహనాల్ని పంపించారు పోలీసులు.

రిక్షాను వేగంగా తోసుకుంటూ పరుగెత్తాడు రిక్షావాడు.

హాస్పిటల్‌కెదురుగా వున్న డబ్బా శిథిలమై పోయింది.

సబ్బులు, పౌడర్‌డబ్బాలు, బిస్కట్ల ప్యాకెట్లు, చాక్లెట్‌సీసాలు, సిగరెట్లు... సామానంతా రోడ్డుమీద పడివుంది.

కొట్టువాడో చోట కూర్చుని ఏడుస్తున్నాడు. కొందరతన్ని ఓదారుస్తున్నారు. అతని ముఖం దెబ్బలతో వాచిపోయివుంది. అతని గుడ్డలన్నీ చినిగిపోయాయి.

రోడ్డు దిగి, పక్కనుండి నెమ్మదిగా తోసుకుంటూ నడిచిపోలీసు నుంచుండేచోట, హనుమకొండవేపు రిక్షా తిప్పి, రిక్షానెక్కాడు రిక్షావాడు.

కనిపించినంతసేపూ వెనక్కి తిరిగి చూశాడు రాయలింగు.

"ఆడేమయింది బిడ్డా!" సూపర్‌బజార్ దాటుతుండగా అడిగాడు.

"ఇయ్యాల బందుగాదె! ఆడబ్బోడు బందుపెట్టుమంటె పెట్టకుంట తెరుసుకోనున్నడు. బడిపిలగాండ్లూకుంటరా? వచ్చి తన్నిన్రు. సామాన్లన్నిట్ని నాశిడం పదారుపాల్లు చేసిన్రు. చూసినవ్‌గదనే... దొరికినోల్లను పోలీసులు పట్టుకపోతలేరా?" అది అలా జరగడం మామూలే అన్నట్లుగా చెప్పుకుపోతున్నాడు రిక్షావాడు.

రాయలింగుకు రాగన్న చెప్పిన విషయం గుర్తొచ్చింది.

"అందరోలె బందుపెట్టక... నల్లురితోని నారాయణా అనక... మొనగానోలె ఎందుకు తెరువాలెచెప్పు? పోలీసుల దయిర్యంతోని తెరిసిండు... పోలీసులు యాడికని సరిపోతరు? ఇప్పుడేమైపాయె? లూటిచేసిన ఈ పొడైనయి, పోలీసోల్లిస్తరా? సర్కారోడిస్తడా? ఎంతమంది కని యాన్నించి తెచ్చిస్తరు? హవులముండకొడ్కు... పెగ్గెలకుపోయిండు.... అనుబగించిండు" మొనపోస్తూ అన్నాడు రిక్షావాడు.

"మరి మీ రక్షలోల్లు బందుపెట్టలేదేంది బిడ్డా?"

"మాలీడర్నడిగిండో లేదో! లీడరు చెప్పుతె బందుపెడ్తం. ఐనా అటు బస్సులు బందయి, ఇటు రక్షలూ ఆటోలు బందయితె, జనం ఆగమయిపోరానె? గందుకె మమ్ముల బందు పెట్టుమనరు"

"పోనీ... ఈరోజు భిక్షపతన్నా సంపాయిస్తున్నాడు" అనుకొని తృప్తిపడ్డాడు రాయలింగు.

"అదిగాక... మేమందరం గరీబోల్లంగాదె... గీబందులప్పుడే మాకు నాలుగు పైసలు ఎక్కువ దొర్కుతయ్", ముల్లురోడ్డుదాటి భారంగా బ్రిడ్జీనెక్కిస్తూ చెప్పాడతను.

'నాలుగు పైసలెక్కువ దొర్కుతయ్' అన్నమాట రాయలింగుకు మరింత సంతోషాన్ని కలిగించింది.

రిక్షా వేగంగా బ్రిడ్జీ దిగుతోంది. ఎదురుగా వందలకొద్ది జనం పరుగెత్తుకొస్తున్నారు. దూరంగా వెయ్యిస్తంభాల గుడిప్రాంతంలో దట్టమైన పొగపైకి లేస్తూ కనిపించింది. తుపాకులు పేలుతున్న చప్పుడు వినిపిస్తోంది.

అలంకార్ టాకీస్ వద్ద సడన్ బ్రేక్‌వేసి ఒడుపుగా రిక్షాను పక్కసందులోకి మలిపాడు రిక్షావాడు.

జనం వెంటపడి తరుముతూ, కిందపడ్డవాళ్ళని బాదుతూ, కాళ్ళూచేతులు పట్టి వ్యాన్‌లోకి విసిరివేస్తూ... పోలీసులు పరుగెత్తుతున్నారు.

హాహాకారాలూ, బూట్ల చప్పుడూ కలిసిపోయి ఒక భయానక వాతావరణం రోడ్డు మీద ఏర్పడింది.

రిక్షా అతను రిక్షాను మరో చిన్న సందులోకి లాక్కుపోయి రాయలింగును దిగమన్నాడు.

గుబురుగా పెరిగిన సర్కార్ తుమ్మల చాటుగా రిక్షాను నిలిపి, రాయలింగును తీసుకొని సగం నిర్మాణంలో ఆగిపోయిన ఒక ఇంట్లోకి తీసుకెళ్ళాడు.

అప్పటికే అక్కడ ఓ పదిమందిదాకా గోడకొదిగి నిశ్శబ్దంగా కూర్చున్నారు. పోలీసులు అటువేపు కూడా వచ్చి, బూట్ల శబ్దం చేసుకుంటూ, తిరిగి మెయిన్‌రోడ్డుకేసి వెళ్ళారు.

ఓపావుగంటకాలం అంతా కుక్కినపేనుల్లా నిశ్శబ్దంగా ఉన్నారు.

అంతలో అటువేపు గల్లీలోంచి మరో ఐదా

రుగురు వచ్చిచేరారక్కడ.

మొదట్లో ఏసగుసగా తర్వాత మెల్లగా మాటలు మొదలయ్యాయి.

''ఏమయిందయ్యా ఆడ?'' తర్వాత వచ్చిన వారిలో ఒకతన్నడిగాడు రాయలింగు.

''ఏమయిద్ది? బంద్ పిలుపిచ్చినా బందు పెట్టకుంటె ఏమవుతుందో అదయింది. వేయి స్తంభాల గుడిదగ్గర ఓ దుకాణమతను పోలీసు ల్ని పెట్టుకొని దుకాణం తెరిచాడు. అంతే... బడిపిల్లలొచ్చి ఘర్షణకు దిగడం... పోలీసులు ఆపడం... దుకాణం లూటీచేసి తగులపె ట్టడం... లాఠీచార్జీ...ఫైరింగు'' అతను గబ గబా చెప్పాడు.

''ఎవరన్నా చచ్చారా?'' మొదలొచ్చి కూర్చు న్నతడడిగాడు.

''గంత ఫైరింగయినంక చావకుండుంట రా? చచ్చేవుంటరు. అయినా అనలోడెవడు దొర్కుతాడా? చూడబోయినోడో, రోడ్డుమీద నడి చెటోడో, దూరంగ నిల్చున్నోడో చచ్చేవుంటరు'' ఇంకొకతనన్నాడు.

''గీరోడ్డమీదనే బందుగని.... సందుల్లల్ల అన్నీ నడుస్తయ్'' మరొకతను మాటకలిపాడు.

''రోడ్లమీద మాత్రం సాయంత్రం సగం తలుపులు తెరిచి నడువవాయేంది? ఈ ఒక్క నాలుగ్గంటలు బందుచేస్తె పాయె....ఎక్కడోల్ల క్కడ పోయిన తర్వాత తెరుచుకోవచ్చుగదా''

''దుకాణం వాడిది బంద్ చేయమన్న పార్టీకి వ్యతిరేకం పార్టీ... అదిగాక బంద్‌విఫలం చే యాలని పోలీసులు రక్షణనిస్తాం అనుంటా రు... అయినా... 'ఎందుకొచ్చినపీడ' అని చాలామంది బందుపెడతారు. స్ట్రాంగ్‌గా పార్టీ ల్లో పనిచేసేవాళ్ళే ఈ చిక్కుల్లో పడతారు...''

''ఏదో ఒకటీఅరా ఇట్లాంటివి జరుగుతాయి తప్ప... ఎవరు బందుకు పిలుపిచ్చినా సక్సెస వుతుంది...''

''ఎక్కడైనా అంతే... తెలిసి తెలిసి ఎవరు రిస్క్‌తీసుకుంటారు?''

ఇలా చాలాసేపు బంద్ గురించీ, ఇదివర కైన బంద్‌ల గురించీ అక్కడున్న వాళ్ళు మాట్లాడుకున్నారు.

బంద్ స్వరూపం చాలావరకు రాయలింగు కర్థమైపోయింది.

అరగంటదాక రోడ్డుమీద అటూయిటూ పరుగెత్తుతున్న వాహనాల చప్పుడులూ... కొ న్నింటి నుండి నినాదాలూ వినిపించాయి.

ఆ తర్వాత రోడ్డుమీద జనసంచారం... సైకి ళ్ళు, రిక్షాలు, ఆటోలు నడవడం మొదలైంది.

రిక్షావాడు వేయిస్తంభాల గుడివెనుకనుండి సందులు తిప్పుతూ... చివరకు రాయలింగును బస్‌స్టాండ్‌లో వదిలిపెట్టాడు.

గంపల్ని బండిమీదేసుకుని, భారంగా తోసుకుంటూ, తన గుడిసెవేపు నడిచాడు రాయలింగు.

గుడిసెముందు జనం గుమిగూడి వుండడా న్ని దూరం నుండే గమనించిన రాయలింగు గాబరావడిపోయాడు.

'ఏదో జరగందే ఎందుకంత మందుంటా రు?' అనుకొని వేగంగా బండిని తోసుకుంటూ వెళ్ళి, జనాన్ని తప్పించుకుంటూ లోపలికి నడిచాడు.

నిండా ముసుగేసుకుని పడుకున్నాడు భిక్ష పతి. అతని పక్కనేకూర్చుని భయంగా చూస్తు న్నారు గౌరమ్మ, మల్లికాంబలు. అప్పటిదాకా బాగా ఏడ్చినట్లు, వాచిపోయిన వాళ్ళకళ్లు తెలుపుతున్నాయి. రాయలింగును చూడగానే సన్నగా ఏడ్పుమొదలెట్టింది గౌరమ్మ.

''ఏంది? ఏమయింది? బుచ్చయ్యకేమ యిందే?'' ఆదుర్దాగా అడుగుతూ భిక్షపతిని చేరాడు రాయలింగు.

మల్లికాంబ బిత్తరపోయి చూసింది తప్ప యేమీ మాట్లాడలేదు.

''యాడకీసులాడుకున్నడోయేందో... రాంగనే ముసుగేసుకుని పన్నడట... ఏమ యిందో సూద్దామంటె, ముసుగుతీయడు... కన మేమయిందో చెప్పరాదు పిలగా! అంటె కస్సు మంటాండు. ఈ...యేంపిల్లగాడవ్వ?'' గౌరమ్మ పక్కనే కూర్చున్న ఓ ముసలావిడ దవడలు నొక్కుకుంటూ అంది.

'చిన్నప్పట్నుండీ కోపమెక్కువ వీనికి... ఈ కోపంలో ఎవరితో ఏం సంపాదించుకొచ్చాడో' అని అనుకుంటూ దగ్గర కూర్చున్నాడు రాయ లింగు.



బయటున్నవారు కూడా ఏమిటో తెలును కుందామన్న ఉబలాటంతో లోపలికొస్తున్నారు. చుట్టూ జనం వలయంగా నుంచున్నారు.

"ఏమయిందో నేను కనుక్కుంటగనీ... కాస్త గాలిరానీయిర్రి... మీరందరింట్లకు పొండి. మందిని చూస్తె ఇంక పిచ్చోడయితాడు" అని అందర్నీ బయటకు పంపించాడు రాయలింగు.

ఇష్టంలేకపోయినా ఒక్కొక్కరే వెళ్ళిపోయారు.

"బుచ్చయ్యా! ఏమయింది నాయినా! నాకు చెప్పు... పెయిలగిన బాగలేదా?" బలవంతంగా ఛాతీమీదకు, గుడ్డకిందుగా చెయి పోనిచ్చి ముట్టిచూశాడు రాయలింగు.

వేడిగావున్నా శరీరమంతా చెమటతో తడిసివుంది.

నెమ్మదిగా ముఖంమీది ముసుగుకూడా తొలగించి, చెంపలూ, తలా, నుదురూ నిమిరాడు.

"లే...కసలేసి కూసో... ఏమయిందో చెప్పకుంటే మేమంత ఆగమయిపోతానంగాదు నాయినా" లేపి కూర్చోబెట్టాడు.

"నీయవ్వ... నాకేంగాలేదు పోఁరి..." కంయ్ మంటూ మళ్ళీ ముసుగేసుకు పడుకున్నాడు భిక్షపతి.

"ఏంగాకుంటె మరెందుకు పన్నవ్‌రా? గింతపోరనప్పట్నుంచి నిన్ను చూస్తాన... మంచిగుంటె ఊరుండే పురుగువేనా నువ్వు?



నీబాంచెను. ఏమయిందో చెప్పు... మానాయ్నగా
దు'' బతిమాలుతూ మళ్ళీ ముసుగు తొల
గించి, దగ్గరకు తీసుకుని, వీపుమీద చేయేశా
డు రాయలింగు.

'అమ్మా' అని మూలిగి తండ్రి ఒడిలో తలపెట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు భిక్షపతి.

రాయలింగు కడుపులో ప్రేవులన్నీ ఒక్కసారిగా మెలిదిరిగిపోయినట్లయ్యాయి. ఆత్రంగా చొక్కా పైకిలేపి చూశాడు.

''ఏమయింది బిడ్డా! గీదెబ్బలెట్ల తలిగినయ్ కొడ్కా'' వణుకుతున్న స్వరంతో, వీపు నిండా నల్లగా కమిలిపోయిన వాతల్ని తడుముతూ అన్నాడు రాయలింగు.

గౌరమ్మ హంటర్ దెబ్బతిన్నట్లుగా అదిరిపోయింది. ఒక్క ఉదుటున కొడుకు వీపుదగ్గర చేరింది.

''ఓకొడుకో.... ఓ కొడుకో... గీదెబ్బలెక్కడియి కొడుకో... ఎవని చేతులు చెర్లజేరినయ్ కొడుకో... ఎవనింట్ల పీనుగెల్లింది కొడుకో...'' భిక్షపతిని అక్కున అదుముకుని వీపు నిమురుతూ శోకం మొదలెట్టింది గౌరమ్మ.

తల్లిపక్కనే చతికిలపడిపోయి అన్న భుజాలు పట్టుకొని ఏడుస్తోంది మల్లికాంబ.

''నీయవ్వ...ఊకో...ఏంజరిగిందో కసచెప్పు నీయి...'' గదిరించాడు రాయలింగు.

గౌరమ్మ స్వరం తగ్గిందేతప్ప ఏడ్పు ఆగలేదు. కొడుకుని కొట్టినవాళ్ళను శాపంపెడుతూ ఆమె సన్నగా యేడుస్తూనే వుంది.

''చెప్పుబిడ్డ...ఏమయిందో చెప్పు'' గౌరమ్మ వడినుండి లాగి సరిగా కూర్చోపెట్టి అడిగాడు రాయలింగు.

''పొద్దుగాల...రక్ష మార్చుకుందామని యాదగిరి సేటు దగ్గరికి పోయిన. నేను పోయెటాలకే అడకొంతమంది బడిపిలగాండ్లున్నరు. మాకు రక్షలీయొద్దని, ఆ ఒక్కరోజు బందుచేస్తానమని, యాదగిరి సేటుతోని వాదులాడుకున్నరు.''

''ఆ... ఆ తర్వాతేమయింది?'' తాను తొక్కుతున్న రిక్షా బాగాలేదని, దాన్ని మార్చుకుంటానని రాత్రి భిక్షపతన్న మాటలు గుర్తుకొచ్చాయి రాయలింగుకు.

''వాళ్లకిష్టం లేకుంటె...వాల్లనే తీసుకోవద్దనుర్రి...అని సేటు వాళ్లతోనన్నడు'' వెక్కుతున్నాడు భిక్షపతి.

''ఆ...అటెంక?''

''అటెంక వాల్లు మాదగ్గెరికొచ్చిన్రు...రక్ష తొక్కుడియ్యాల బందుబెట్టుమన్నరు...బందుపెడుతె ఊళ్లో రక్షలన్ని బందుపెట్టాలెగాని...మా పదిరక్షలు బందెట్ల పెడుతం? మా లీడరుకు చెప్పకపోయింర్రా? అని మా రక్షలోల్లన్నరు''

''అవ్...రక్షలన్ని నడుస్తనే వున్నయ్...నేను రక్షల్నే వస్తి... అటెంకేమయింది?''

"గప్పుడా గుంపులకేల్లి, ఓ పిలగాడు - ఆడనే ఉన్న గోడమీదికెక్కి... నామాటిన్నంక, తొక్కబుద్ధయితె తొక్కుర్రిగని...ముందుగాలినున్రి... అని మాట్లాడుడు మొదలుబెట్టిండు"

"గట్లనా... ఏం మాట్లాడిండో!" రాయలింగు కంఠంలో అదురు.

"ఉన్నోల్లంత లేనోల్లను దోసుక తింటాండ్రని... రక్షలోల్లుగూడ దోపుకంపాలైతాండ్రని... గాదోపుకం తప్పంటేనే మొన్న ఓ పిల్లగాన్ని చంపిండ్రని...గిప్పుడు బందు పెట్టకుంటె ఉన్నోల్లంత, లేనోల్లను గట్లనే చంపుతరని... మనూర్లె పిల్లగాండ్లు మాట్లాడలేదా? గవే మాటలు శాన శాన మాట్లాడిండు"

"మీరందరు ఇనుకుంటున్నరు...గంతేనా?"

"ఆ...మేమందరం నిల్సోని ఇంటానం. గంతే...యాన్నుంచొచ్చిన్రో పోలీసులు..మాచుట్టు గిరాయించుకున్నరు...కండ్లు మూసి తెరిసెటాలకే మమ్ముల కొట్టుడు మొదలుపెట్టిన్రు. మేం రక్షలోల్లం...మాకేమెరుకలే అని మొత్తుకున్నా దండంబెట్టినా ఇనకుంట కొట్టిండ్రు...ఎట్లనో తప్పిచ్చుకోని, రక్షతీసుకోని ఉరుకొత్తాంటె...ఎంబడిబడి, పడేసి బొర్రిచ్చి బొర్రిచ్చి కొట్టిండ్రు...ఆకరికి పేర్రాసుకొని యిడిసిపెట్టిండ్రు" చెప్పడం ముగించి బోరున యేడ్చాడు భిక్షపతి.

"గాడికెందుకు పోతివ్ కొడ్కా...గిసొంటియి తప్పించుకోవాల్ననే ఊరిడిసిపెట్టె ఈడికొచ్చినంగాదు కొడ్కా" భిక్షపతిని గుండెలకు హత్తుకుని, కళ్ళు తుడుస్తూ ఏడుస్తోంది గౌరమ్మ.

రాయలింగు కూడా సరిగ్గా ఇదే ఆలోచిస్తున్నాడు. ఏ ప్రమాదంనుండి పారిపోయొచ్చాడో, సరిగ్గా అదేప్రమాదం ఎదురయ్యేసరికి అతడు విలవిలలాడిపోతున్నాడు.

"పోలీసోల్లను సూడంగనే ఉరికిరాకపోయినవ్ కొడ్కా..." విలపిస్తూనే అంది గౌరమ్మ.

"సూడంగనే ఉరికినం...." భిక్షపతి ఏడుస్తూనే చెప్పాడు.

"వాల్లింట్ల పీనుగెల్ల..వాల్ల తలపండ్లు పలుగ...వాల్ల చేతుల్ల చెట్లు మొలువ...గింతగనం కొడ్తరా...వాల్లనోట్లె" గౌరమ్మ చేతులు భూమికి చరుస్తూ శపిస్తోంది.

"నీదండంబెట్టగని కనఊకూవే...మల్లమంది కూడ్తరు...గిది నల్గురినోట్లె పడ్తది..." రాయలింగు కంఠంలో కోపం, భయం, దుఃఖం నిండడంతో గౌరమ్మ నోరు మూతపడింది.

కొన్ని క్షణాలాగుడిసెలో నిశ్శబ్దం రాజ్యమేలింది.

కొడుకునే చూస్తూ వాని మనసును చదువడానికి ప్రయత్నం చేశాడు రాయలింగు.

తండ్రిచూపుల్లో ఇందాకా కనిపించిన సానుభూతి మాయమై, ఇప్పుడు అనుమానం రావడాన్ని...తానే ఏదో తప్పుచేసినట్లుగా ఉన్న భావాన్ని గమనించిన భిక్షపతికి కోపం వచ్చింది.

అతని కన్నులు వెడల్పైపోయాయి. కళ్లల్లో ఎర్రజీరలు కదలాడాయి.

అవి నెత్తురు వాగుల్లా కనిపించి దడుసుకున్నాడు రాయలింగు. వెంటనే కొడుకు రెండుచేతుల్నీ పట్టుకుని తన తలమీదుంచుకున్నాడు.

"బుచ్చయ్యా! అయిందేదో అయింది...గావాల్లనుంచి కాపాడుకోవాల్ననే ఈడికొచ్చినం...గాపాలగాండ్లు, నా ఉన్నొక్క కొడ్కును వాల్లల్ల కల్పుకుని నాకు యాడకాకుంట చేస్తరో అన్నబయంతోని...లేక లేక పుట్టిన పిందె యాడరాలిపోద్దో అని...గా బుగులుతోనే...పుట్టినూరొదులుకోని...కడుపు చేతులపట్టుకోని ఈడికొచ్చినం. నువ్వు కండ్లముందుంటెనే మేం బతుకుతం. గాబతుకుకోసం నువ్వీ సంగతి మర్సిపోవాలె... ఈకాన్నుంచి గసొంటికాడికి పోనని, గీసంగతి గురించి ఆలోసనే చేయనని... నామీదొట్టు పెట్టుకో" అంటూ భిక్షపతి చేతుల్ని గట్టిగా తలమీద అదుముకున్నాడు.

భిక్షపతికి దుఃఖం ముంచుకొచ్చింది. తండ్రి తలమీద అతనిచేతులు బిగుసుకుపోతున్నాయి.

"బుచ్చయ్యా! మా పానాలన్నీ నీమీన పెట్టుకొని బత్కుతానం. నీకాలుకు ముల్లు కుచ్చితె, మా గుండెల్లల్ల బానాలు దిగుతయ్... నీకేమయినా మాపానమాగది కొడ్కా! మా పానాలు పోయెదాక, నువ్వు నాయినచెప్పినట్లుంటనని




ఒట్టుపెట్టుకో...'' రాయలింగు మాటలతో విష యమంతా అర్థంచేసుకున్న గౌరమ్మ స్థిరంగా అంది.

కెరటాల్లా దూసుకువస్తున్న భిక్షపతి కోపా న్ని తలిదండ్రుల ఆర్తి అర్థగించింది. అతని హృదయం ద్రవించుకుపోయింది.

'తను వాళ్ళదగ్గరకు పోలేదు...తను తప్పుచే యలేదు... తనకు వాళ్ళమాటల్లో ఏదో నిజము న్నదనిపించింది. అంతే... వీపుమీద దెబ్బలు పడేదాకా, ఎందుకు పడుతున్నాయో తెలియ దు. వాళ్ల మాటలు వింటున్నందుకే ఆ దెబ్బ లని తెలుసుకునేలోపల, తనను గొడ్డును కొట్టిన ట్లు కొట్టారు. నిష్కారణంగా తననలా కొట్టిన వారిమీద తనకు నిజంగానే కోపం వచ్చింది. కాని... తన తల్లి, చెల్లి, తండ్రి... వాళ్ళ దుఃఖం... వాళ్ళ ప్రేమ...ఆర్తి... అవి తనను కుదిపివేస్తున్నాయి. తనకు నిజంగా ఎవరితో నూ సంబంధంలేదని వీళ్లకెలా తెలుపడం?' భిక్షపతి లోలోపలే కుమిలిపోతున్నాడు.

''నాయినా బుచ్చయ్యా! బతికినంతకాలం మేం బతుకంకొడ్కా! నిన్నూ చెల్లెనూ చూసు కుంట కాలం గడుపుతానం. అవ్వమొకంచూ డు... చెల్లె మొకంచూడు... వాల్లెంత బయంల పడిపోయిన్రో చూడు. ఈకాన్నుంచి గిసొంటివా టికి దూరంగుంటనని నువ్వు మా అందరి మీద ఒట్టుపెట్టుకుంటెనే మేం బతుకు తం...లేకుంటె ముగ్గురం ఇంత ఇసం పుచ్చు కోని సత్తం ... మేం సచ్చినంక నీకు తోసినట్టు తిరుగు'' భిక్షపతి చేతులు కిందికి దించుతూ అన్నాడు రాయలింగు.

అతని గొంతు గద్గదమైపోయింది. అతని కళ్లు నీటిబుడగల్లా ఉన్నాయి. అతని చూపు లు ఆవేదనతో దీనంగా వున్నాయి.

భిక్షపతికి కడుపులో చేయిపెట్టి కెలికినట్ల యింది. ఆర్ద్రతతో అతని హృదయం తడి సిపోయి ద్రవించిపోయింది. అతనికి దుఃఖం ఉప్పెనలా ముంచుకొచ్చింది. అతని కళ్ళు సెలయేర్లయ్యాయి.

తండ్రిగుండెలమీద అలాగే వాలిపోయి అతడు చాలాసేపు ఏడ్చాడు.

గౌరమ్మా, మల్లికాంబలు పైకి వినిపించ కుండా కుమిలికుమిలి ఏడుస్తున్నారు.

రాయలింగు కొడుకును గాలికూడా, తమ మధ్య ఉండకుండా గుండెలకు అదుముకుని ఉండిపోయాడు.

''నేను కావాల్నని యాడికీపోలేదే... మీ అందరిమీదొట్టు పెట్టుకొని చెప్తాన... నామాట నమ్మున్రి. రక్ష మార్చుకుందామని పోయిన. అందరితోని కలిసి యింటాన... గంతల్నె గింత జరిగింది... మీరేమొ ఇంకో తీర్గను కుంటాండ్రు...అవ్వతోడు... చెల్లెతోడు... నాయి నతోడు... నేను యాడికీపోలేదు. ఈకాన్నుంచి గసొంటికాడికి పోను'' వెక్కిళ్ళమధ్య మెల్లగా అన్నాడు భిక్షపతి.

కొడుకును కాసేపు పొదివిపట్టుకుని... అతని నుదుటిమీద అతుక్కుపోయిన వెంట్రు కల్ని చేతులతో పైకని... ముద్దు పెట్టుకుని వదిలాడు రాయలింగు.

కొడుకువీపు నిమురుతూ... ఆ దెబ్బల్ని తలచుకొని తలచుకొని లోలోపలే దుఃఖిస్తోంది గౌరమ్మ.

అన్న చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని...వే ళ్లను రాస్తూ ఏడుస్తోంది మల్లికాంబ.

''గంతే...గంతెసాలు కొడుకా...బతుక్కోనం రెక్కలు పట్టుకోని మనం ఈడికొచ్చినం. రెక్కల కష్టంచేసుకుంట... ఉన్ననాడు తిందాం...లేన్నా డు ఉపాసం ఉందాం...గట్లనే, గడుకో అంబలో తాక్కుంట జీవనాలు నిలుపుకుందాం. ఏదో...నువ్వింత నేనింత పనిజేస్తానం...బట్టా పొట్టా మంచిగనే ఎల్లుతాంది. అప్పుడో ఇప్పుడో వచ్చేగిసొంటివాటికి మనం దూరంగుంటెసా లు... పట్నంల మంచిగనే బతుకెల్లిపోద్ది...'' శాంతంగా అన్నాడు రాయలింగు.

ఆతర్వాత భిక్షపతిని పడుకోబెట్టింది గౌర మ్మ. ఇంత జావకాయమని మల్లికాంబకు చెప్పి కొడుకుదగ్గరే కూర్చుండిపోయింది.

రాయలింగు పందిట్లోకి వచ్చి బీడీవెలి గించుకుంటూ కూర్చున్నాడు. తుఫానులో చిక్కుకుని సుడివడి కొట్టుకుపోయి, చివరకు ఒడ్డునచేరిన నావలా ఉందతని మనసు.

ముసుగేసుకున్నా లోపల కళ్లు తెరచు కునే ఉన్నాడు భిక్షపతి.

'తప్పుచేయని తనకు శిక్షపడింది... నేరంలేని శిక్ష ఇదేనా? ఈ శిక్ష వేసింది 'అన్యాయం'. ఈ అన్యాయాన్ని ఎవరు గుర్తుపట్టాలి? న్యాయాన్నెవరు కాపాడాలి? అయినా... తను దాన్నాలోచించవద్దు... తనకవి అనవసరం...తను... తన తండ్రికోసం, తల్లికోసం, చెల్లెకోసం బతకాలి... అంతే'' అనుకున్న భిక్షపతి క్రమంగా శాంతించాడు.




భిక్షపతిని పోలీసులు కొట్టారన్న సంగతి ఎంత దాచినా దాగకుండా అన్ని గుడిసెలకూ తెలిసిపోయింది. అప్పుడొకరూ, ఇప్పుడొకరూ వచ్చి పలకరించిపోతున్నారు.

'పాపం, అన్యాయంగా కొట్టారని' కొందరు...

'ఏమీచేయంది ఎందుకు కొడ్తారని' కొందరు..

ఎవరికి తోచింది వాళ్లనుకుంటున్నారు.

సాయంత్రం ఈ వార్త తెలిసి పరిగెత్తుకొచ్చాడు దేవయ్య.

ఎటోచూస్తూ, పందిరిగుంజ కానుకుని నిర్జీవ శిలలా మూర్తీభవించిన విచారంలా కూర్చున్నాడు రాయలింగు.

"ఏమో జరిగిందట బావా?'' అంటూ రాయలింగు దగ్గరకొచ్చి పలకరించాడు దేవయ్య.

సమాధానంగా నుదుటిమీద కొట్టుకున్నాడు రాయలింగు.

"ఇయ్యాల బందని ఎరికేనాయె...ఇప్పుడు కూసున్నట్లు పొద్దుగాలకూడ ఇంట్ల కూసుంటె గింత దూరమొచ్చెదా?'' మందలించాడు దేవయ్య.

"ఇయ్యాలబందని.. బందంటె గిట్లుంటదని నాకెరుకలేదురా దేవయ్యా! ఎరుకుంటె నేను మార్కట్టుకెందుకుపోదు? వాన్ని రక్షదొక్కుమని ఎందుకు పోనిత్తు?'' అన్నాడు రాయలింగు.

"అవ్‌గని...బుజ్జిగానికి దెబ్బలు బాగా తగిల్నాయా?''

"దెబ్బలంటావు తమ్మీ...వశంగాని దెబ్బలు కొట్టింద్రు. వాల్లచేతులు చెర్లజేర...వాల్ల...'' గొరమ్మ అందుకుంది.

"ఈయింత ఈడుండనిత్తవాలేదే...''గదిరాడు రాయలింగం.

"ఏశ్ నీయవ్వ...ఎందుకేగంత భయం? నీ పిచ్చిగాని కన్నకడుపు ఊకుంటదనుకున్నవా? సరెగనీ...బుచ్చిగాడు ఏమంటాండు? ఎట్లున్నడు?'' గౌరమ్మనడిగాడు దేవయ్య.

"ఎట్లుంటదు తమ్మీ! మూసినకన్ను తెరుస్తలేడు...జావ తాగియ్యంగనే కక్కిండు..అగ్గోలె జరం...''

"అరె...గట్లనా?'' అంటూ లోపలకివెళ్లాడు దేవయ్య. దుప్పటి తొలగించి ఛాతీమీద చేయేసి చూశాడు.

"రాయలింగు బావా! వాని పెయ్యి కాలిపోతాందిగాదె...మందోమాకో పెట్టకుంటె...ఆయింతేమన్నయితెట్ల'' బయటకివస్తూ అన్నాడు.

"రేపు గాంది దావకాన్ల చూయించాలనుకుంటాన''

"నీయవ్వ...రేపటిదాకెట్లుంటడే వాడు? టాకీసుకాడ నాకెరుకున్న డాక్టరున్నడు. తీసుకుపోదాంపా..నేను రిక్ష పట్టుకొస్త'' పరిగెత్తినట్లుగా బయటకు నడిచాడు దేవయ్య.

తర్వాత రాయలింగూ, దేవయ్యా కలిసి రిక్షాలో భిక్షపతిని డాక్టరుదగ్గరకు తీసుకెళ్లారు.

డాక్టరు భిక్షపతిని పరీక్షించాడు. పోలీసులు కొట్టారని తెలియగానే, గవర్నమెంటు డాక్టరుకు చూపించుకోవాలన్నాడు.

దేవయ్య బంద్ విషయమంతా తెలిపి బతిమాలాడు.

డాక్టర్ భిక్షపతికి రెండింజెక్షన్లిచ్చాడు. గాయాలు కడిగి మలాంపూసి కట్టుకట్టాడు. మూ

డునాలుగురోజులు వరుసగావచ్చి మందులు వాడాలని చెప్పి..ఇంట్లో వాడాల్సిన మందులు రాసిచ్చి పంపించాడు.

మందులు కొనుక్కుని భిక్షపతిని ఇంటికి తీసుకొచ్చారు.

"ఆయన పొద్దుట్నుంచి మంచినీళ్ళుగూడ తాగలేదు...జప్పున వంటచేస్త...నువ్వుగూడ ఈన్నే తినిపో తమ్మీ.." అంది గౌరమ్మ.

"నేనెందుకే...నాకొద్దుగానీ...రాయలింగు బావా! గీయింతదానికే గిట్లయితెట్లనే? నువ్వే పానముంటివి...ఇంక వాళ్ళుగూడ ఉపాసమే ఉన్నరుకావచ్చు"

"నా కొడుకాడ పండుకొని మూలుగుతాంటె నాకు బుక్కెట్ల నోట్లెకు పోతదిరా దేవయ్యా!"

"గట్లనాగౌరక్కో... జప్పునవండి...తలా యింత తినుర్రి...మీరు పండుకునేటప్పుడు గోలీలేసి బుచ్చయ్యకింత జావతాగిచ్చుర్రి" అంటూ లేచాడు దేవయ్య.

"గీ రాత్రిపూటేడికిపోయి తింటావ్. ఉండు...ఇంత తినిపో తమ్మీ..." గౌరమ్మ బల వంతంచేయడంతో మళ్ళీ కూర్చున్నాడు దేవయ్య.

గౌరమ్మ లోపలికి నడిచింది. మల్లికాంబ అన్నదగ్గరే కూర్చుంది. రాయలింగూ, దేవయ్యా బీడీలు వెలిగించారు.

"బస్తీల రెక్కలకష్టం చేసుకొని మారాజుగ బతకొచ్చుననుకుని, తురితపడ్డ...గీపీకులాట నాకు మల్లభయం బుట్టిస్తాందిరా దేవయ్యా" అన్నాడు రాయలింగు.

"బస్తేంది..పల్లెటూరేంది...నీ పిచ్చిగాని ప్యాదేనికి యాడున్నా చిక్కులు తప్పయ్..ఆడో తీరు చిక్కులుంటె, ఈడోతీరో చిక్కులుంటయ్ గని... చిక్కులేలేకుంటాపోవు...అన్ని చిక్కులకి కార్నం మాత్రంగదే..పేదోడవు. మొదలే గీ మరుకంటకుంట చూసుకోవాలె. అంటిన మరుక పోగొట్టుకోవాలె..గట్లు చూసుకుంటెనే మన బతుకు బతుకోలుంటది... కష్టమున్నకా డనే సుకం, సుకమున్నకాడనే కష్టముంటదను కోని, దయిర్యంగుండాలె..నువ్వు బుగులుపెట్టు కోకు... నాలుగురోజుల్లల్ల బుచ్చిగాడు లేచి పనిలబడి అన్నీ మర్చిపోతాడు" అని ధైర్యం చెప్పాడు దేవయ్య.

తర్వాత తను కూరగాయలకుపోయిన సంగతీ, తోవలో తానుచూసిన సన్నివేశాలూ, తనకారోజు అయిన నష్టంగురించి వివరంగా చెప్పాడు రాయలింగు.

వంటయింతర్వాత భోజనంచేసి...మరికా సేపు అదీ ఇదీ మాటాడి వెళ్ళిపోయాడు దేవయ్య.

★ ★ ★ ★

జ్వరం తగ్గి, గాయాలూ నొప్పులూ మాని, భిక్షపతి మామూలు మనిషి కావడానికి వారంరోజులుపట్టింది.

ఈవారం రోజుల్లో... డాక్టర్ ఫీజుకూ, మందులకూ, తిండికీ బాగా ఖర్చయింది.

దాచుకున్న డబ్బంతా అయిపోయి, రాయలింగు స్థితి మళ్ళీ మొదలుకొచ్చింది.

భిక్షపతి రిక్షా తొక్కడానికింకా రెండురోజులు కావాలి. ఆ రెండురోజుల ఖర్చూ పక్కకుపెడితే, రాయలింగు దగ్గర అరవై రూపాయలే మిగిలాయి.

వాటితోనే వ్యాపారం చేసుకోవాలి... మళ్ళీ భిక్షపతి సంపాదన చేతికందితే తప్ప అతని పెట్టుబడి పెరగదు. ఈ డబ్బు నుండి సర్దార్ కిస్తుకడితే పెట్టుబడుండదు.

ఎలాగో బతిమాలుకుందాం అనుకుని, రాయలింగు వాయిదానాడు కిస్తు కట్టలేదు.

సాయంత్రానికల్లా సర్దార్ మనిషిరానే వచ్చాడు.

ఆ మనిషిని చూడగానే రాయలింగు ప్రాణాలు గుప్పెట్లోకి వచ్చాయి. కిస్తుకట్టకుండా వుంటే ఏమవుద్దో అతనికి బాగా తెలుసు. అతని కళ్ళలో మల్లిగాడు, అతని భార్యాపిల్లలూ మెదిలారు.

సర్దార్ మనుషులు తిడతారు... కొడతారు. డబ్బుకు సరిపడే వస్తువులు లాక్కుపోతారు. గుడిసె పీకేస్తారు. చివరకు మనిషిని లాక్కుపోయి పనిచేసుకోనీయకుండా బందీని చేస్తారు.

ఇవన్నీ గుర్తొచ్చి. వెంటనే డబ్బివ్వాలనుకున్నాడు.

కాని. ఆ తర్వాత పెట్టుబడుండదు... వ్యాపా




రముండదు... తిండుండదు. అందుకే ఓసారి ప్రయత్నంచేసి చూద్దామనుకున్నాడు.

ఆ మనిషికి నమస్కరించి, చేతులు కట్టుకుని నుంచున్నాడు.

తన పరిస్థితినంతా వివరించి, వచ్చేవారంలో రెండు కిస్తులూ ఒకేసారి కడతానని బతిమాలాడు.

"గీ మాటలు నాదగ్గెర సాగయ్. ఒక్క కిస్తే కట్టనోనివి, రొండు కిస్తులెట్ల కడుతవ్... అవద్దంమాట. బ్యారం చేసుకుంటనే వుంటివి... పైసలొస్తనేవుండె. తినుడు, తాగుడుకు కర్చుపెట్టుకుంటిగిట్లనే అయిద్ది. గట్లెందుకు కర్చుసేయాలె? తీసుకున్నపైసలు నీ అయ్యకడుతాడని కర్చుపెట్టినావా... తాత కడుతాడని కర్చు చేసినవా?" దురుసుగా అన్నాడు సర్దార్ మనిషి.

"గన్ని మాటలొద్దు. నీ దండం బెత్త... పిల్లగాడిపుడే బాగైతాండు. రేపో మాపో పనిమీదికెక్కుతడు... ఐదో పదో సంపాయిస్తడు. మల్ల వారంల రొండు కిస్తులు కత్త" రాయలింగు వేడుకున్నాడు.

"గంత నీయద్దారువైతే, పగటీల సర్దార్ సాబ్ దగ్గెరికొచ్చి ఎందుకు చెప్పలేదు... నేనొచ్చినంక గీమాలుతానవ్..."

"వద్దమనే అనుకుంటాన..." నీళ్లునమిలాడు రాయలింగం.

"గవన్నినీకి నాకు పుర్సత్‌లేదు... నాకు వసూళ్లు శానవున్నయ్. ఇగో యిను... అట్ల పోయి సరిగ్గ అరగంటకొస్త.... అరగంట టైమిస్తాన. ఏడ తెస్తవో నాకనోసరం. పైసలు తయారుచెయ్" అనుకుంటూ గుడిసెలకేసి వెళ్లిపోయాడు సర్దార్ మనిషి.

రాయలింగుకప్పటికే చెమటలు పట్టేశాయి.

"నాయనా! నీదగ్గెరిప్పుడెన్ని పైసలున్నయ్?" పందిట్లో ఓచోట కూర్చుని అడిగాడు భిక్షపతి.

అంతా విన్నట్లుగా అతని ముఖం చెబుతోంది.

"అరువై దెబ్బై వుంటయ్... ఎందుకురా?"

"అంద్లకెల్లి వానికిచ్చే పైసలిచ్చెయ్"

"ఇయ్యాల్నా? ఇస్తె మరి... నీమందులకెట్ల? రేపు యాపారానికెట్ల? అటెంక దుబ్బుక్కి నీల్లు తాక్కుంటుందామా?"

"అవన్నీ అటెంక చూసుకుందాం... ముందుగాల వాని పీడపోనీయి" కోపంగా అన్నాడు భిక్షపతి.

'రాయలింగు ఆలోచన మంచిదా? భిక్షపతి ఆలోచన మంచిదా?' ఎటూ తేల్చుకోలేక విచారంగా వుండిపోయింది గౌరమ్మ.

'ఏం జరుగుతుందో' అన్న భయంతో నుంచుంది మల్లికాంబ.

ఎవరూ మాట్లాడకుండా ఎవరి ఆలోచనల్లో వాళ్లున్నారు.

సరిగ్గా అరగంటకు మరో మనిషిని తీసుకొని వచ్చాడు సర్దార్ మనిషి.

ఒక్క మాటకూడా మాట్లాడకుండా డబ్బు తీసిచ్చాడు రాయలింగు.

ఎగాదిగా ఒకసారి రాయలింగుకేసి చూసి, డబ్బుల్ని జేబులో పెట్టుకున్నాడతను.

"ఊఁ.... పైసలుంచుకొని నకురాల్‌చేసినవ్‌లే... నీకంత యానంగ కన్పిస్తానన్నమాట" గుడ్లురిమాడతను.

"అయ్యా... గంతమాటనకు. బ్యారంకోసముంచుకున్న పైసల్నే ఇచ్చిన"

"నాకెరికేతీబే... నేన్నీ కండ్లకు ఈగనో దోమనో అయిన. గందుకే ఓ యెత్తేసినవ్.... గందుకే త్యాపకో తన్ను తంతాంటెనే మీరు మీ జాగలుంటరు. థూనీయవ్వ... కొంచెపు లంజొడ్కులు..." తుపుక్కున ఉమ్మేతూ అన్నాడతను.

"పైసలిచ్చినంకగూడ లావులావు మాట్లాడుతానవేంది?" లేచి నుంచున్నాడు భిక్షపతి.

"గాయిచ్చుడు, ముందుగాలెందుకీయలేదుబే... గిప్పుడు నువ్ లావు తీకునాలు తీత్తానవ్!" మహా కోపంతో అన్నాడతను.

"మాటలు మంచిగ రానీ..ు... సవాలె నాగ్గూడ తిట్టొస్తది" భిక్షపతి శరీరం పొంగుతోంది.

"అచ్ఛా... ఐతె తిడుతవన్నమాట. గంత పెద్దోని వైనవన్నమాట. గీ రేసం ముందుగాలే డబోయింది? గప్పుడు బాడుకావు గిరీ చేసు

డెందుకు? గిప్పుడు పెద్దరికం జూపు డెందుకు?" సర్దార్ మనిషి కళ్ళు ఎర్రబడిపోయాయి.

"పైసలు వున్నానికేం తీసుకోలే..... వారం వారం వడ్డీగలిపి కడుతానం... బాడుకావు గిరీ నీది... పొద్దుగాల లేసింది మొదలు పండుకునె దాక ఎవల్నో ఒకల్ను ఏడిపించుకుంట తిరిగే నీది... నీది బాడుకావుగిరీ... బాడుకావు గిరీ చేసుకుంట బతికెటోనివి నువ్వు" భిక్షపతి అడుగు ముందుకేస్తూ అన్నాడు.

"ఏమన్నవ్‌బే... తిప్పుకునుడు నీవంతే... తిట్టుడు నీవంతేనార సాలే!" అతడు రౌద్రంగా ముందుకొచ్చాడు.

"బుచ్చయ్యా! ఊకోరా... నివ్వింట్లకుపో" బతిమాలాడు రాయలింగు.

"భాంచత్... ఇయ్యాల తిట్టెటోల్లయింద్రన్న మాట" అతని పళ్ళు పటపటలాడుతున్నాయి.

"ఏదో పోరడు... తెల్వకన్నడు. గావాని మాటలకేందిగని... నీ బాంచెను... నామొకం జూడు" అతని చేతులు పట్టుకున్నాడు రాయలింగు.

"వా... వా... వా.... తెలివంటె నీదేరా రాయలింగూ... నీకొడుకు ఇంకా పోరడేనంటవ్.... కొడుకుతోని తిట్టిస్తవ్... నువ్వు బతిలాడుతవ్.... కిందట మంటబెడ్తవ్... మీద నీల్లుపోస్తవ్. వా.... గదితెలివి. అరేయ్... నీకొడుకు నాతోని టక్కర్ పెట్టుకున్నడంటె సర్దార్‌సాబ్ తోనే టక్కర్ పెట్టుకున్నడనుకో. చూపిస్త... సాలెగాని నంగతి చూస్త" క్రూరంగా ఒక్కొక్కమాటే వత్తి పలుకుతూ అన్నాడతను.

"నువేం చూపిస్తవ్‌రా..." అరిచాడు భిక్షపతి.

"బుచ్చిగా! ఊల్లె ఉండాల్నా... సావాల్నా? నీ కాల్మొక్తగని... కన ఊకోరాదురా! కన ఇంట్లకు పోరాదురా" ఏడ్పుగొంతుతోనే గద్దించాడు రాయలింగు.

భిక్షపతి రెక్కపట్టుకుని లోపలకు లాక్కెళ్లింది గౌరమ్మ.

"రాయలింగా! కొడుకును మీదికెగేసినవ్




గద. మంచిది... ఇంక మా నంగతి చూస్తవ్‌తీ బిడ్డ" అంటూ గిరుక్కున తిరిగి, వెంటవచ్చిన వానితో కలిసి వేగంగా వెళ్ళిపోయాడు సర్దార్ మనిషి.

రాయలింగుకు దుఃఖం ముంచుకొచ్చింది. భారంగా అడుగులో అడుగేసుకుంటూ వంటింట్లోకి వచ్చాడు.

నాగుపాములా బుసకొడుతూ గుమ్మందగ్గర నుంచున్న భిక్షపతిని చూడగానే అతనికాగ్రహం కలిగింది.

"అయిందా... ఇగ నీకండ్లు నల్లబడ్డాయా? అ ఇంత అప్పిచ్చే అనరగూడ లేకుంటబోయిందా? ఇప్పుడేం జెయ్యాలె? బిచ్చమడుక్కొని నంసారాన్నీదుమంటవా? చెట్టంతెదిగినవ్. ఇగ చేతికొస్తవ్... అగ చేతికొస్తవ్ అని

ఇనోజులు చూసుకుంటాన. చేతికొచ్చినట్లే వచ్చి... ఓటి చేసి కూసున్నావ్. ఉన్న పైసలన్ని నీమీదనే పెట్టుకోని వొడగొట్టినవ్... ఇప్పుడు పానం పోతాందన్నా చేతులపైన లేకుంట చేసినవ్. పైసల్లేని ముండకొడ్కులకు గింత కోపమా? గింత రేనమా?'' దోసిట్లో ముఖం పెట్టుకుని కూలబడిపోయాడు రాయలింగు.

భిక్షపతి ముఖకవళికలు మారిపోయాయి. ఆవేశం తగ్గిపోయి అతడు నేల చూపులు చూస్తూవుండిపోయాడు.

''వాడేమన్నడయ్యా.... పైసలు ముట్టినంక గూడ ఆ పాపం ముండకొడ్కుగంత గనం తిట్టంగలేదుగని... వీడొక్క మాటంటెనే తప్పయిందా?'' భిక్షపతిని వెనకేసుకొచ్చింది గౌరమ్మ.

''గౌరీ.... గౌరీ.... వాన్ని మొదట్నుంటి నువ్వే పాడుచేసినవే! అయిందానికి, కానిదానికి అడ్డపడుకుంట. వాన్ని నువ్వేగిట్ల తయారుచేసినవ్. అవునే... నీ కొడుకుదేం తప్పు లేదు. తప్పంత నాదే. ఊరిడిసిపెట్టుడు తప్పు.... ఈడ గీగుడిసేసి, రెక్కలు బొక్కలైపోంగ.... కడుపు గట్టుకొని, కంట్లు గట్టుకొని, ఇంటింటొోజులకింత తిండిపెట్టుడుతప్పు... గంతేకాదె గౌరూ!'' రాయలింగు గొంతు ఆవేశంతో, దుఃఖంతో వణికిపోయింది.

గౌరమ్మ ఆమాటలు విని ఏమీ మాట్లాడలేదు.

జరిగిన విషయాల్ని మననం చేసుకుంటూ,

భిక్షపతి తన తప్పును వెదుక్కుంటున్నాడు.

ఆ రాత్రి ఎంత బతిమాలినా రాయలింగు తిండితినలేదు. ఇంట్లో అందరూ ఆ రాత్రి పస్తుండిపోయారు.

* * *

ఎప్పటిలా తెల్లవారకముందే లేచాడు రాయలింగు.

ఇంట్లో ఖర్చుకుపది... తనకు రానుపోను కిరాయి ఆరు... చాయ్, టిఫిన్‌కూ బీడీలకుపోగా... పదో పన్నెండో మిగులుతాయి రాయలింగు వద్ద.

'పదిరూపాయలతో బేరమా?' దిగులుపడ్డాడు రాయలింగు.

కాసేపు అయోమయస్థితిలో పడిపోయాడు. అంతలో. అతని మెదడులో ఒక ఆలోచన... ఒక ఆశ తళుక్కున మెరిసింది.

గబగబా గౌరమ్మను లేపాడు. మార్కెట్‌కు పోతున్నానని చెబుతూ గంపలందుకున్నాడు.

"బ్యారానికి పైసలున్నాయా?" మెల్లగా అడిగింది గౌరమ్మ.

"ఆఁ.. నీ అయ్యా నా అయ్యా కలిసి పాతరపెట్టి పోయిండ్రుగదా... అండ్లకెల్లే తీసుకున్న పైసలు"

రాయలింగు మాటల్లోని వేదననీ, వెటకారాన్ని గౌరమ్మ గ్రహించింది. ఆమె హృదయం బాధతో గిలగిలలాడిపోయింది. ఒక్కసారిగా ఆమె రాయలింగు దగ్గరకు నడిచింది.

ఎడమ చేత్తో అతని కుడిభుజాన్నీ కుడి చేత్తో అతని ఎడమ భుజాన్నీ పట్టుకుని, అతని కళ్ళల్లో కళ్ళుపెట్టి కాసేపు చూసింది. తర్వాత తలను అతని గుండెలమీద ఆనించి వెక్కివెక్కి ఏడ్చింది.

రాయలింగు చలించిపోయాడు. చేతిలోని గంపల్ని కిందపడేశాడు. చుబుకంపట్టి ఆమె తలను పైకెత్తాడు.

వాడిపోయిన గౌరమ్మ ముఖం... అవిరళంగా ప్రవహిస్తూ కన్నీరు... నీళ్ళూరుతూ తళుక్కున మెరుస్తున్న కళ్ళు.

సూటిగా హృదయాన్ని స్పృశిస్తూన్న చూపుల్లోని ఆత్మీయత.... రాయలింగు కాసేపలాగే చూసి, రెండు చేతుల్తో ఆమెను పొదివిపట్టుకున్నాడు.

"నీకెరుకలేని పైసలు నాదగ్గరేడున్నయే? యాన్నో ఓ కాడ....ఏ అయ్య కాల్లో పట్టుకొని నాలుగురాల్లు సంపాయించకుంటె యేందిని బతుకుదాం?" అన్నాడు.

"నీదగ్గర పైసలున్నయన్ననా? యాడ తిప్పలు బడుతవ్? ఎట్ల చేత్తవ్ అని అన్న..." ఇంకా తలను అతని హృదయంలో దాచుకొనే అంది గౌరమ్మ.

"సర్దార్ దగ్గరికి పోకుండయిపాయె...మార్కెట్టుకుపోయి తిప్పలబడ్త.దొరికినయాసరే... లేకుంటేదన్న కూలినాలి చూసుకుంట...నువ్వు రంది పడకు.అయిల్లటిదేమన్నుంటే బుచ్చయ్య కింత తినిపిచ్చు. వాన్నియ్యాల యేడికీపోనియ్యకు....ఇయ్యాలా రేపూ కాపాడుకుంటే, అంటెక వాడే ఐదోపదో సంపాయిస్తడు. గట్లనే...జీవనాలు గడుపుకుందాం..." గౌరమ్మ వీపును కాసేపు ప్రేమగా నిమిరి చేతులు వెనక్కి తీసుకున్నాడు రాయలింగు.

గౌరమ్మకు తృప్తి కలిగింది. భర్త ముఖాన్ని మౌనంగా మళ్ళీ చూసి దూరం జరిగింది.

జేబులో నుండి ఓ ఐదు రూపాయలనోటు తీసిచ్చాడు రాయలింగు. వీటితో ఇయ్యాల తిండికి సర్దుతానని ఆమె చూపులతోనే అతనికి చెప్పింది.

గంపల్ని తీసుకుని భారంగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు రాయలింగు.

'ఎటువంటి మనిషి ఎట్లా అయిపోయాడు?' అనుకున్న గౌరమ్మ కళ్లల్లో మళ్లీ నీళ్ళు తిరిగాయి.

'అప్పుడు.అతని కళ్లల్లో నీడచూసుకుంటూ....చిక్కని వెంట్రుకల్లో వేళ్ళుపెట్టి ఆడుకుంటూ....నవ్వుల్లో పువ్వులేరుకుంటూ....వెడల్పైన గుండెల మీద పడుకుని, అతని పొడవాటి చేతుల్ని నడుముచుట్టూ తిప్పుకుని...భయంలేకుండా నిద్రపోయేదాన్ని'

'ఇప్పుడు? ఆ కళ్ల కాంతిపోయింది. వెంట్రుకలు రాలిపోయాయి. ముఖంలో నవ్వేలేదు....ఛాతీమీద ఎముకలుపైకి లేచాయి....చే

తులు సన్నబడి చీపురుపుల్లల్లా అయిపో యాయి. వయస్సువల్ల కాక...విచారంతో వృద్ధుడైపోతూ...ఆయన...పాడుబడి కూలిపోతూ వున్నగుడిలావున్నాడు'

ఈ భావాలు మనసులో కలిగి గౌరమ్మ ఆవేదనతో విలవిలలాడిపోయింది. రాయలింగు కనబడేదాకా అలాగే చూస్తూ వెనుతిరిగింది.

అలా వెనుతిరిగిన గౌరమ్మకు...అంతులేని విషాదంతో తలవంచుకునుంచున్న భిక్షపతి కనిపించాడు.

"ఎందుకు లేసినవ్‌రా! పండుకోకపోయినవ్!" అంది కొడుకును చూస్తూ.

"నాకియ్యాల మంచిగనే వున్నదే...పోయి రక్ష తీసుకుంట"

"పూర నయంకాలేదు...నాయన వద్దన్నడు"

"నాయినగట్లనే అంటడు...ఏంగాదు"

"నీ బాంచెను...వద్దురా. నువ్విప్పుడు రక్ష తీసుకుంటె నాయిన ఇంకా యేడ్చి బెంగటీల్తడు. అంతలావైతే...నాయిన వచ్చినంక మాట్లాడి, రేపు తీసుకుందువుతీ" బలవంతంగా భిక్షపతినాపింది గౌరమ్మ.

★ ★ ★

పదిహేను రూపాయలతో మార్కెట్ చేరిన రాయలింగు, రోజూ తను సరుకులుకొనే రాజేశం దుకాణం ముందు నుంచున్నాడు.

రాజేశం మొదట్లో సైకిల్ మీదా, బండి మీదా కూరగాయల వ్యాపారం చేసినవాడే. తర్వాత కొట్టు తెరుచుకుని...ఇప్పుడు మార్కెట్‌లో పెద్ద హోల్‌సేల్ వ్యాపారస్థుల్లో ఒకడైనాడు.

దేశం నలుమూలల నుండి రాజేశంకు సరుకులొస్తాయి. లారీలు, బండ్లు, ఆటోలు, రిక్షాలు, చివరకు గంపలు...అలా విరివిగా కాయగూరలు వస్తూనే వుంటాయి.

విశాలంగా ఎత్తుగా కట్టిన అరుగు....అరుగు వెనక భాగాన మెట్లవలె తయారుచేసిన షెల్ఫుల్లాంటి గద్దెలు...వాటి నిండా రకరకాల కూరగాయలు....అరుగు కింద రాసులుగా పోసిన సరుకు...బస్తాల్లో ఉల్లిగడ్డలు, ఆలుగడ్డలు, అల్లం, వెల్లుల్లి...అరుగుల మీద గంపల్లో ఆకుకూరలు...రాసులు పోసిన దోసకాయలు, సొరకాయలు....రాజేశం వద్ద దొరకని కూరగాయలంటూ వుండవు.

ఇద్దరు మనుషులు విరామంలేకుండా జోకి గంపలవాళ్లకు పోస్తున్నారు.ఒక మనిషి ఆకు కూరలు, పచ్చిమిరపకాయలు అందిస్తున్నాడు. ఒక మనిషి గబగబా లెక్కలు రాస్తున్నాడు. రాజేశమూ, అతని భార్యా డబ్బులు తీసుకుంటున్నారు. ఈ పని సరుకులయిపోయేదాకా ఎడతెరపి లేకుండా జరుగుతూనే వుంటుంది.

రద్దీగా వున్న దుకాణాన్ని చూసిమరో గంటదాకా రాజేశం మాటకూడా మాట్లాడడని తెలుసుకుని, ఓపిగ్గా ఓ పక్కన నుంచున్నాడు రాయలింగు.

పల్లెల్నుండి వచ్చిన సరుకు ధర, బయటి నుండొచ్చిన సరుకు ధరను బట్టి మారుతుంది. సరుకుల ఎక్కువ తక్కువలనుబట్టి హోల్‌సేల్ వ్యాపారులు ధరను నిర్ణయంచేస్తూ వుంటారు. బయటి సరుకెక్కువొస్తే, లోకల్ సరుకు ధర దిగుతుంది...తక్కువొస్తే పెరుగుతుంది.

అనుకున్న ధర పడకపోయినా...సరుకులు తెచ్చినవాళ్ళు హోల్‌సేల్ వాళ్లకిచ్చేపోతారు. స్వయంగా అమ్ముకునే అవకాశంలేకా, నిలువ వుంచే హంగులూ లేక...ఏడికో ఓ ధర నిర్ణయం చేసుకుని సరుకులిచ్చేపోతారు వాళ్ళు.

హోల్‌సేల్‌వాళ్ళకన్నా పదిపైసలెక్కువ ధరపెట్టినా, పల్లెలనుండొచ్చే గంపలవాళ్ళు, రాయలింగు వంటి మారుబేరగాళ్ళకు సరుకులివ్వరు. ఒకవేళ అలా ఇచ్చినట్లు తెలిస్తే, వాళ్ల దగ్గర ఇక హోల్‌సేల్ వాళ్ళు కొనరు.

హోల్‌సేల్‌వాళ్ళు ఎప్పుడైనా, ఎంతైనా సరుకు కొంటారు. వారానికొకసారి డబ్బులెక్క చేసిస్తారు...అవసరముంటే అడ్వాన్సు కూడా ఇస్తారు. అందుకే అందరూ హోల్‌సేల్‌వాళ్ళకే అమ్ముకుంటారు తప్ప, మరొకరికమ్మరు.

అందువల్ల మారుబేరగాళ్ళకు హోల్‌సేల్ వ్యాపారులే శరణ్యం.

ఓ గంట గడిచింతర్వాత కొంచెం రద్దీ తగ్గింది. రాజేశం మాట్లాడటానికి కొంత వీలుక లిగింది.

"అయ్యా!" వినయంగా పిల్చాడు రాయ లింగు.

"ఆఁ...యేందిలా రాయలింగూ! ఇయ్యాల ఇంకా తీసుకోలేదిమిరో...ఏంకావాల్నో ఎన్నెత్తు లు కావాల్నో రాయించు" అంటూ కాగితం, కలం తీసుకున్నాడు రాజేశం.

రాయలింగు నీళ్ళు నములుతూ, చేతులు నులుముకుంటూ నుంచున్నాడు.

"జప్పున చెప్పురా...అవుతల పనున్నది. మా మునూర్‌ల బడిపిలగాళ్ళ క్యాంపుకు ఆటోలల్ల కూరగాయలు తీసుకపోవలె...లారీల సరుకు లు దించుకోవలె.చెప్పు...ఏమేంకావాలె?" తొందరచేశాడు రాజేశం.

"అయ్యా! ఇయ్యాల నాదగ్గెర పైసల్లే వు.కొంచెం దయసూడు...నీబాంచెను...ఇయ్యా లమ్ముకొని రేపు పైసలుకడ్త..." దీనంగా దండం పెడుతూ అడిగాడు రాయలింగు.

"మారె...కుదిరది కుదిరది...అదెట్ల కుదుర తదనుకున్నవ్‌రా రాయలింగూ! మీరు పైసలి స్తేనే మల్ల సరుకులు కొనాలె...గీపైసల్నే రోటే షన్ చేసుకుంటె నడస్తదిగని...నాదగ్గెర మాత్రం పైసలేడున్నయిరా? కచ్చా బేరం లు చ్చాబేరమని నీకెరుక లేదా? నగదు పైసలిచ్చి కొనాలె...అవసరమైతే అడ్వాన్సు కూడా ఇయ్యాలె....ఇంతజేసి... అమ్ముడుగాకుంటె పై సలన్ని అండ్లకే పీక్కపోతయ్...నీకెరుకలేదా? కుదురది...కుదరదిరా రాయలింగూ!"

"గట్లనకు నీబాంచెను...నాకిచ్చేటియి నీకో లెక్కకాదు"

"ఎందుగ్గాదురా? పైస పైస కలిస్తేనే రూపా యయిద్ది...రూపాయి రూపాయి కలిస్తేనే పద యితయ్....అవికలిసి వంద్దైతయ్...ఏదో ఇంత....తెల్లబట్టల వేసంతోని కనుపడుతానగ ని....నా దగ్గర నిలువుంటయారా? పైసలు లేకుంటే రేపటి బ్యారమే నడువదాయె...కొ న్నంక ధర దిగి....అమ్ముడుపోక మిగిలిమురిగి పోయి...గుమస్తాలకు, మామూల్లకు, కొట్టుకిరా యిలకు, వచ్చేటోనికి, పోయేటోనికి...గివన్ని బోంగ, నాకు మాత్రం యేంమిగుల్తయిరా? నువ్వు చిన్న బేరగానివి, నేను పెద్ద బేరగా న్ని...గంతే.నాదగ్గెర ఉద్దెరమాటతేకురా."

"నువ్వుగామటనకు నీకాల్మొక్త.....నాకొడుకు బీమారై, పెట్టుబడంత వాని మందులకే పోయింది. రొండ్రోజులకు బాగైతడు....పనికె క్కుతడు.గీవారంరోజులు నాయాపారం కాపా డు నీబాంచెను . నువ్వుకాదంటె ఇంటిండ్రా జులం ఉపాసముంటం...."రాజేశం చేతులు పట్టుకున్నాడు రాయలింగు.

"ఎవల తిప్పలు వాల్లకుంటయ్‌రా రాయ లింగూ! నా తిప్పలెవలకు చెప్పుకోవాలె చె ప్పు...మొన్ననే బిడ్డ పెండ్లిచేసిన్నా...ఇల్లు కడు తున్నా...పిలగానికి పట్నం చదువులకు పైస లు పంపుతాన్నా...యాడికీ పైసలందుతలేవా యె...ఎనుకటి రోజులనుకుంటానవార్రా? పెట్టు బడెల్లుడే మాబాగ్యమైతాంది"

"అవ్ బాంచెను....ఎంత చెట్టుకంతగా లి.కని నువ్వే నన్నెట్లనోఅట్ల కాపాడు. మొద ట్నుంచి నీదగ్గెర్నే కొంటాన...ఎన్నడన్న అడిగి న్నా గిట్ల? ఇయ్యాల కష్టకాలమొచ్చింది. నామీద దయదలిస్తే వారంరోజులల్ల ఎట్లనో అట్ల దార్లె పడుత.

ఇయ్యాలటి పైసలు రేపిస్త బాంచెను... ఇయ్య కుంటే మల్ల సరుకియ్యకు" రాయలింగు రా జేశం కాళ్ళావేళ్ళాపడ్డాడు.

రాజేశం కాసేపాలోచించాడు. భార్యతో ఆలో చించాడు.

"సరె... ఇస్తగని మరి వట్టం కడుతావుర రాయలింగూ? యాభై రూపాయల సరుకు తీసుకొంటే రెండున్నర- నూర్రూపాయిల సరుకు తీసుకుంటె ఐదు ఇస్తవా? నూటికయి దు బజార్ల ఉన్నలెక్కే... బజారులెక్కతీర్గనే నాకియ్యి నాకెక్కువేంవద్దు... గదిస్టమయితే కా వలిసినంత సరుకు తీసుకపో" అన్నాడు.

వట్టం అంటే నష్టం... అసలుకన్నా ఎక్కువి వ్వాల్సిన డబ్బు.

ఒకరోజా, రెండురోజులూ అత్యవసరమున్న వారు వట్టం కింద డబ్బు తీసుకుంటారు. ఇవ్వాల వంద తీసుకున్నవాడు, తన పనితీర్చు కుని రేపు వందాఅయిదు రూపాయలివ్వాలి.




వెయ్యయితే ఒకరోజుకు యాభై కలిపివ్వాలి.

వడ్డీ పద్ధతుల్లో ఇది చాలా ఎక్కువ. వంద రూపాయలు ఒక నెలకు వంద యాభైరూపాయల్ని సంపాదించే వడ్డీ పద్ధతి ఇది.

వ్యాపారం చేరవలేని వారు... రిస్కుతీసుకోదలచినవారు, ఐదారువేల రూపాయల్ని పెట్టుబడిగా ఉంచుకుని, అత్యవసరమున్న నమ్మకమైనవాళ్లకు ఈ పద్ధతిలో డబ్బిస్తారు. వెంటవుండి వసూలు చేసుకుంటారు.

[illegible] త్రంలో డబ్బునిచ్చేవారు, వడ్డీ [illegible] చేసి కాగితం రాయించుకుంటారు. అంటే... పదివేల రూపాయలు పదిరోజులకు అవసరమున్నవారికి రు. 10,500 ఇచ్చినట్లుగా స్టాంపు కాగితం రాయించుకుంటారు. అలా రాయించుకుని చట్టపరమైన ఇబ్బందుల్ని తొలగించుకుంటారు.

రాయలింగు కొంచెంసేపు ఆలోచించాడు.

'వందరూపాయల నరుకమ్ముకుంటె తనకు రు. 15 నుండి రు. 20 దాకా మిగిలుతాయి. వట్టం ఐదుపోతే తనకు పదేపదిహేనో మిగులుతాయి. అందులో నుండి బస్ కిరాయి... ఇతర ఖర్చులు పోతే ఇంకేం మిగులుతాయి? మరి అది తప్ప ఇప్పుడు తనకింకేం మార్గముంది. మళ్ళీవారం తిరిగేనరికి సర్దార్ కిస్తెట్లా కట్టగలడు? అయినా ఈ వట్టం నాలుగైదు రోజులేకదా! భిక్షపతి రిక్షా తీసుకున్న తర్వాత అన్నీ సర్దుకుంటాయి. ముందు తన యాపారం తెంపులేకుండా నడవాలి మరో వ్యాపారి కాలనీలో తన స్థానంలో స్థిరపడకూడదు. అందుకే వట్టమైనా... నష్టమైనా తనుకూరగాయలుతీసుకోవాలి' అనుకున్నాడు.

"ఇష్టమైతేనే తీసుకోబిడ్డ... అపెంక రాజేశం సేటు నన్ను ముంచిండని ఖదునాం చేయొద్దు. అద్వాన్సులియ్యనీకి నేను కూడా వట్టానికే తీసుకుంటాన. నువ్విచ్చే వట్టం గంట్లకే పోద్ది... నాకు మిగుల్తదనుకుంటానవేమో!" అన్నాడు రాజేశం.

రాయలింగు ఆ పద్ధతిలోనే నరుకులు తీసుకోవడానికొప్పుకున్నాడు. రాజేశం ఒక కాగితంమీద రాయలింగు తన దగ్గర 105 రూపాయలు తీసుకొన్నట్లుగా రాసి, ఒక రెవెన్యూ స్టాంపంటించి, రాయలింగు వేలిముద్ర వేయించాడు.

తేదీ లేకుండా రాసిన ఆ కాగితం... వట్టం కింద నరుకులు తీసుకోవడం ఆగిపోయేదాకా వుంటుంది. వందఐదు రూపాయలు రోజు తెచ్చివ్వాలి. రోజువందరూపాయల నరుకులు తీసుకుపోవాలి.

ఐదారు రకాల కూరగాయలు... మిరపకాయలు, నిమ్మకాయలు, కొత్తిమీర తీసుకున్నాడు రాయలింగు.

మనసులో ఐదురూపాయలు ఊరికే పోతున్నాయన్న బాధ పురుగులా తొలుస్తున్నా దాన్ని కనవడనీయకుండా... అన్నీ గంపల్లో సర్దుకున్నాడు.

ఆ తర్వాత రిక్షా మాట్లాడుకుని, గంపలన్నీ రిక్షామీద వేసుకొని బయలుదేరాడు.

బస్స్టాండులోనే బండిమీద కూరగాయలు పేర్చుకుని, హొటల్‌వాడినడిగి, నీల్లు చల్లుకుని... బండిని కాలనీవేపు తోసుకుంటూ నడుస్తూ... 'కొంచెం పొద్దుపోయినా... నా వ్యాపారం నిలబడింది' అనుకున్నాడు రాయలింగు.




వారం రోజులే అనుకున్న రాయలింగు వట్టం బేరం పదిహేనురోజులైనా ఇంకా కొనసాగుతూనేవుంది.

భిక్షపతి రిక్షాతొక్కుతున్నాడు. సర్దార్‌కు కట్టాల్సిన చివరి కిస్తును కష్టంగా కట్టేశారు. గౌరమ్మ మల్లికాంబలు నెలాకరున తెచ్చిన జీతం డబ్బుతో రిక్షా కిరాయా, బండి కిరాయా చెల్లించగలిగారు. సుఖంగా కాకపోయినా కుటుంబం సాఫీగానే సాగిపోతోంది.

రాయలింగు దినదినం ఆదాయాన్ని

ఖర్చునీ జాగ్రత్తగా లెక్కేసుకున్నాడు. మరో పదిహేను రోజుల్లో వట్టం బేరం బందుచేయొచ్చుననీ, స్వంతపెట్టుబడితో వ్యాపారం సాగించవచ్చుననీ తేల్చేసుకున్నాడు.

మరో పదిరోజులు గడిచిపోయాయోలేదో... ఇంతలో మళ్ళీ బంద్‌కు పిలుపిచ్చారు.

ఇదివరకు చంపబడ్డవాని గుంపు, పట్టపగలే తమకు వ్యతిరేకమైన వాళ్లగుంపులోని ఒకన్ని చౌరస్తాలో కాల్చి చంపారట. ఆ చచ్చిన పిల్లవాని పార్టీ వాళ్ళు ఇప్పుడు బంద్‌కు పిలుపిచ్చారు.

ఎవరు పిలుపిచ్చినా బంద్ బ్రహ్మాండంగా సక్సెసవుతుందని రాయలింగుకిదివరకే అనుభవపూర్వకంగా తెలిసింది.

అప్పుడు బంద్ జరువడం న్యాయమా, అన్యాయమా అని ఆలోచించాడు.

ఇప్పుడా ఆలోచనలేలేవు... ఈ బంద్‌నుండి ఎలా రక్షించుకోవాలి? అన్నదే అతని ఆలోచన.

బంద్‌కొకరోజుముందే రాయలింగు తిండి జాగ్రత్త చేసుకున్నాడు. బంద్‌నాడు తను మార్కెట్‌కుపోవద్దనీ, కొడుకు రిక్షాతొక్కవద్దనీ నిర్ణయించుకున్నాడు.

రాయలింగు లెక్కలు మళ్ళీ మూడునాలుగు రోజులు వెనక్కి వెళ్ళాయి. మళ్ళీ లెక్కల మీద లెక్కలు వేసుకుంటూ బంద్ రేపనగా సాయంత్రమంతా ఆలోచించుకున్నాడు.

బంద్ రేపనగా, ఆ సాయంత్రంకూడా భిక్షపతిని రిక్షాతొక్కనీయలేదు రాయలింగు. సాయంత్రమంతా తనతోనే ఉంచుకున్నాడు. తనతోపాటు భోజనం చేయించి... ఎక్కువరాత్రి కాకుండానే పడుకొమ్మన్నాడు.

రాత్రి పదకొండు గంటలుదాటింతర్వాత... ఇద్దరు కానిస్టేబుల్స్‌తో వచ్చిన ఎస్.ఐ. వందిట్లో నిద్రపోతున్న రాయలింగును లేపాడు.

వాళ్ళను చూసి అదిరిపోయాడు రాయలింగు. చేతులు జోడించి ఏమిటన్నట్లుగా చూశాడు.

"రాయలింగువు నువ్వేనా?"

"అయ్యా... నేనే బాంచెను"

"భిక్షపతి నీకొడుకేనా?"

"అయ్యా... నాకొడుకే!"

"ఏడీ? ఏడున్నాడు వాడు?"

"ఇంట్ల పండుకున్నాడు..."

"ఇటుపిలువు... వాన్ని బైటికి రమ్మను"

"ఎందుకు బాంచెను...?" రాయలింగు కాళ్ళూచేతులూ చల్లబడిపోయాయి. ఎగిరిపడుతూ గుండె విపరీతంగా కొట్టుకుంటోంది.

"ముందుపిలువు బే..." గద్దించాడు ఎస్.ఐ.

అప్పటికే నిద్రలేచిన భిక్షపతి ఈ మాటలు విని మెల్లగా బయటకొచ్చాడు. అతని వెనకే గౌరమ్మ, మల్లికాంబలు వణుకుతూ నుంచున్నారు.

రాయలింగు భయంభయంగా కొడుక్కేసి, ఎస్.ఐ.కేసీ తిరిగి చూస్తున్నాడు.

"భిక్షపతివి నువ్వేనా? దగ్గరకురా!" కుడిచేతిలోని రూల్‌కర్రతో, ఎడమఅరచేతి మీదమెల్లగా తాటించుకుంటూ, భిక్షపతిని నిశితంగా చూస్తూ పిలిచాడు ఎస్.ఐ.

అయోమయంగా చూస్తూ దగ్గరకొచ్చాడు భిక్షపతి.

"ఆనాడు యాద్గిరిసేటు రిక్షాఎక్కినకాడ, ఆనాటి బంద్‌నాడు, మీ అంటికి ఉపన్యాసమిచ్చిండు చూడు... ఆ పిల్లవాని యాదికున్నదా?"

"ఆ... యాదికున్నది... మేం రక్షలు తీసుకుంటాంటె, వద్దని మాట్లాడిన పిలగాడు..."

"ఆ... వాడే... వాన్నీ వాని వచ్చినవాళ్ళనూ నువ్వు గుర్తుపడతావా?"

"వాళ్ళను శానసేపు చూడలె ఆ మాటలింటానమో లేదో... గంతలె మమ్ములకొట్టి ఎల్లగొట్టిను. అదిగాక శానరోజులైంది... పూర్తిగా యాదికొస్తలేదు" నసిగాడు భిక్షపతి.

"ఇప్పుడే యాదికున్నదంటివి గదరా?"

"పిల్లగాండ్లొచ్చుడు... సేటు రక్షలియొద్దనుడు... మమ్ముల బందుపెట్టుమని ఓ పిలగాడు మాట్లాడాడు గంతలె పోలీసొల్లొచ్చి మమ్ముల తరిమికొట్టుడు గిది యాదికున్నాయ్... వాల్లమొకాలు యాదికిలేవు"

''అట్లనా.... మాటలు బాగనే నేర్చినవ్ నేనిప్పుడే యాదికి తెప్పిస్త వుండు...'' అంటూ క్షణంలో భిక్షపతి జుట్టందుకుని, వంగబెట్టి భిక్షపతి వీపుమీద గుభీగుభీమని గుద్దుతున్నాడు ఎస్.ఐ.

ఈ హఠాత్ సంఘటనకు కొయ్యబారిపోయాడు రాయలింగు. బావురుమని ఏడుస్తూ భిక్షపతి దగ్గరకు రాబోయారు ఆడవాళ్లు. ఓ కానిస్టేబుల్ కర్రనడ్డం పెట్టి వాళ్లనాపాడు.

అంతలో తేరుకున్న రాయలింగు... ఒక్క ఉదుటున ఎస్.ఐ. దగ్గరకొచ్చి... ''కొట్టకు... కొట్టకు నీ బాంచెను... పోరన్ని కొట్టి సంపకు నీ కాల్మొక్త...'' అంటూ కాళ్లమీద పడిపోయాడు.

ఎస్.ఐ. భిక్షపతి జుట్టు వదిలేశాడు.

''నాకొడుక్కేమెరుకలే బాంచెను. ఆటగోల పోరడు, అనాది పోరడు.. వాన్నేమనకుర్రి నీ కాల్మొక్త'' అంటూ లేచి నుంచుండి భిక్షపతిని కౌగలించుకున్నాడు రాయలింగు.

''అరేయ్ ముసులోడా! ఇయ్యాల్రేపటి పోరల సంగతి నీకు తెల్వది. తల్లిదండ్రులకు తెల్వకుండ వాళ్లెన్నో పన్లు చేస్తాన్రు. ఆనాడు అర్ధగంట సేపు వానుపన్యాసమిన్నడు... దెబ్బలు పడ్డడు ఇప్పుడు వాడే యాదికి లేడంటాండు నీకొడ్కు. మేమెట్ల నమ్ముతమనుకుంటాండురా...'' రాయలింగునే చూస్తూ అన్నాడు ఎస్.ఐ.

''వీనిగ్గంత తెల్వి లేదు నన్ను నమ్ము నీ గులాపోన్ని... దెబ్బలు తిన్నంక వారం వదిరో

జులు మంచంలనే పడ్డడు. పనికెక్కి పద్దైద్దినాలుగాలే... గంతే నీ బాంచెను" రాయలింగు దుఃఖాన్నాపుకుంటూ బతిమాలాడు.

"ప్రతి తండ్రీ తన కొడుకును మంచోడే అనుకుంటర్రా ముసలోడా! అనాడు వీళ్లకు లెక్కరిచ్చినోడే మొన్న ఈ పోరన్ని కాల్చి చంపిండు. వాన్ని గూడా వాల్ల తండ్రి మంచోడే అనుకుంటడు ఆ హత్యకు వ్యతిరేకంగా రేపు బందు... మరి గావాన్ని పట్టుకోకుంటే మా పరువుంటుందా? నీ కొడుక్కు వాడు తెల్సు వాని పేరు తెల్సు, ఊరు తెల్సు వాడు చెప్త లేడు... వాల్లందరంతే ఊకెనే చెప్పరు... అడిగే తీర్గ అడిగితేనే చెప్తరు" అంటూ ఓ కానిస్టేబుల్ వేపు చూశాడు ఎస్.ఐ.

క్షణంలో ఆ కానిస్టేబుల్ భిక్షపతి రెక్కందుకున్నాడు.

అప్పటికే ఎస్.ఐ. రోడ్డువేపు నడిచి పోతున్నాడు. కానిస్టేబుల్ భిక్షపతిని రోడ్డుమీదున్న వ్యాన్‌కేసి లాక్కుపోతున్నాడు. భిక్షపతి గింజుకుంటున్నాడు. అలా గింజుకుంటున్నప్పుడు మరో పోలీసు అతన్ని లాఠీతో బాదుతున్నాడు.

"నా కొడుకును కొట్టకుర్రి... కొట్టి సంపకుర్రి. మీ దండంబెట్త... వానికి గావాల్లతోని సమందం లేదు మీ కాల్మొక్త" అంటూ పోలీసుల వెంట ప్రాధేయపడుతూ నడిచాడు రాయలింగు.

పందిట్లో కుప్పకూలిపోయి బోరున ఏడుస్తున్నారు గౌరమ్మా, మల్లికాంబలు.

వ్యాన్ దగ్గరకు లాక్కుపోయి, బలవంతంగా భిక్షపతిని వ్యానెక్కించారు పోలీసులు.

రాయలింగు ఒక్క పరుగునపోయి వ్యాన్ ముందు భాగంలో ఎక్కబోతున్న ఎస్.ఐ. కాళ్ల మీదపడిపోయి, కాళ్లు గట్టిగా పట్టుకున్నాడు.

"కడుపు పట్టుకోని ఈడ బతుకుతామని వచ్చినం... రక్క తొక్కుకునెటోనికి గా వాల్లకేం సమందముంటది నీ బాంచెను.. నా కొడుకు నిడిసి పెట్టుర్రి నీ గులాపోన్ని..." అని ఏడుస్తూ అన్నాడు.

"ఒరి ముసలోడా... లే... కాల్లిడ్సిపెట్టు నిజంగానే నీ కొడుక్కు ఏం సంబందం లేకపోతే వానికేంగాదు.. మేంగూడ మనుసులమేరా... న్యాయమన్యాయం తెలుసుకొనే మెదులు కుంటం మా డ్యూటీ మేం చేయకుంటె మా బతుకులెట్లుంటయో నీకే మెరుకరా? నీ కొడుకు నిజంగనే మంచోడయితే, వానికెవరితోను సంబందం లేకుంటె ఎల్లుండి మీఇంటికొస్తడు... లే.." రాయలింగు చేతుల్ని బలంగా విడిపించుకుని వ్యానెక్కాడు ఎస్.ఐ.

రాయలింగు లేచి నుంచునేలోపలే వ్యాన్ వెళ్లిపోయింది.

కాసేపు పోతున్న వ్యాన్‌నలాగే చూస్తూ నుంచుండి, అది కనుమరుగైపోగానే ఊగుతూ, నడుస్తూ వెనక్కి వచ్చాడు. రాగానే భార్యా

బిడ్డల్ని కౌగలించుకుని పసిపిల్లవానిలా బావురుమని ఏడ్చాడు.

ఆ మిగిలిన రాత్రంతా వాళ్ల కళ్లకు నిద్రలేదు. అంతా నిర్జీవ శిలల్లా కూర్చుండిపోయారు. గౌరమ్మ వుండుండి రాగం తీస్తూ ఏడ్వడం తప్ప... ఎవరూ ఎవరినీ పలకరించుకోలేదు. వారి హృదయాలు దుఃఖంతో నిండిపోయాయి.

పూర్తిగా తెల్లవారకముందే, గుడిసెలవాళ్లు ఒకరొకరుగా వచ్చి ఓదార్చి పోతున్నారు. పూర్తిగా తెల్లవారేసరికి గౌరమ్మ చుట్టూ వలయంగా కొందరు కూర్చుండి ధైర్యం చెబుతున్నారు.

"పోలీసోల్ల చేతులబడ్డంక మల్ల మన చేతికొచ్చుడు బవుకస్టం. సావసావగొట్టి, పనికక్కురాకుంట చేసి యిడ్సిపెడ్తరు" అక్కడకొచ్చిన ఒకామె సానుభూతితో అంది.

"నువ్వు చూసొచ్చినావె? అసలే వాళ్లు బెంగటిలిపోయి ఏడుస్తాంటె... పోలీస్‌టేషన్‌కు పోయి చూసొచ్చినట్టె మాట్లాడుతానవూ అదె... పోరడు లంజతనం జేసిండా, దొంగతనం జేసిండా? పోలీసోల్లకు పిల్లల్లేరా? నాయమన్నాయం జూడరా? తప్పు లేదని తెల్సుకొని ఇడ్సిపెట్టరా? ఎందుకే గామాటలు... ఊకుండు" ఒకామె తీవ్రంగా మందలించింది.

"గట్లగాదక్కా... ఇయ్యాల్రేపటి కతలింట లేమా" ఆమె సర్ది చెప్పబోయేంతలో అడ్డు వచ్చి మరొకామె అంది.

"ఇది వైఇపోరగాండ్లు చేసిన పనాయె... బుచ్చిగాడు వైపు పోరడేనాయె! గీవీన్నొక్కన్నే పట్టుక పోయింద్రనుకుంటాండ్రా? మన గుడిసెలల్ల ఇంకో ఇద్దర్ని గూడ పట్టుక పోయింద్రు గీ వీల్లను పట్టుకుంటె అసలు పోరగాండ్లు దొర్కుతరని పోలీసోల్లనుకుంటాను కావచ్చు... ఓ రోజుంచుకోని వాళ్లే ఇడ్సిపెడ్తరు... ఉంచుకోని ఏంజేసుకుంటరు? అయిన కాని మాటలు మాట్లాడకుండ్రి.. వాల్లను ఇంక ఆగంజేయకుండ్రి"

అంతే అని కొందరు వంత పాడారు. ఎంతైనా పోలీసుల చేతుల్లోపడటం నష్టమే అని కొందరు అనుమానించారు.





ఇలా తలా ఓరీతిగా మాట్లాడుతున్న సమయంలో దేవయ్య అక్కడకొచ్చాడు. అతని వెంట ఓ ఇద్దరు గుడిసెవాసులున్నారు. వాళ్ల కొడుకుల్నీ పోలీసులు తీసుకెళ్లారు.

దేవయ్యను చూడగానే ముగ్గురూ గొల్లుమన్నారు. గౌరమ్మ ఏడ్పు తీవ్రమైపోయింది.

"నాకంత తెలిసింది.... మన పోరగాండ్ల కేంగాదుగానీ... కన మీరూకోర్రి... ఏడ్వకుర్రి" అంటూ రాయలింగు వద్ద కూర్చున్నాడతను.

దేవయ్య ఏం మాట్లాడతాడో విందామన్న ఆసక్తితో అంతా తోసుకొచ్చి గుండ్రంగా, గుంపుగా నుంచున్నారు.

"ఏందే? ఈడ పలారం వంచిపెడుతాన్రా.. బాగోతమాడుతాండ్రా? ఏమో... గాలి రాకుంట సుట్టు మునురుకున్నరేందే? పోన్రి పోన్రి... అందరెల్లిపోన్రి" దేవయ్యతో వచ్చిన ఒకతను గదిరించి అందర్నీ బయటికి పంపించాడు.

"సరెగని రాయలింగు బావా! నాకో సంగతి నిజం చెప్పాలె..." రాయలింగు దగ్గరగా జరిగాడు దేవయ్య.

'ఏమిటో ఆ సంగతి!' అన్నట్లుగా చూశాడు రాయలింగు.

"బుచ్చయ్యగా పోరగాండ్లతోసిగిన తిరిగిండా? వాల్లు వీనికోసమెప్పుడన్న వచ్చిండ్రా?"

"అవ్వ తోడురా.... వానికెవలతోనీ సమందం లేదు"

"గట్లయితె మంచిదే... మరి వాల్లను గుర్తు పడ్తడని గిన అన్నడా?"

"వాల్లు నాకు గ్యాపకం లేదంటెనే కొట్టుకుంట తీసుకపోయింద్రుగాదుర"

"గట్లనా... ఐనా ఇయ్యాల్రేపటి పోరగాండ్ల సంగతి చెప్పెటట్టు లేదు మంచసరాదు... చెడ్డనరాదు. వాల్ల ఆలోశన్లు తెల్వనియ్యరు... పనులు తెల్వనియ్యరు. వానికేం సమందం లేదంటానవ్‌గద... మరి బయపడకు. బందు ఐపోంగనే ఇడ్సిపెడ్తరు. ఇడ్వకుంటె నేను పోయి ఇడిపిస్త ఊకోరి. మరెగాని గౌరక్కా? గింతదానిగ్గంతదానికి గింత ఆగమయితె ట్లనే?" గౌరమ్మకేసి తిరిగాడు దేవయ్య.

"ఈ దుక్కమెట్ల బరించాలె తమ్మీ.... ఇంక నేనెందుకు బత్కాలె తమ్మీ... నా కొడ్కును

ఎంత కొట్టి నంపుతాంద్రో.. వాడు పానాలతోనొత్తడా తమ్మీ..."

"నంపుడాగమేనానె.. ఎందుకు నంపుత రు? గట్లనే వస్తయి ఓటోటి. వాని నసీబ మంచిగ లేక అనాడాడున్నడు. వాల్లు మాట్లా డిందిన్నడు. గాదానితోని గిదొచ్చింది. మీరనోస రంగ ఆగంగాకుంర్రి. రాత్రికో, రేపు పొద్దుగాల్నొ వాన్ని తీసుకొస్తగని... మీరేద్వకుంద్రి" అంటూ ఓదార్చాడు దేవయ్య.

అలా ఓదారుస్తూ, ధైర్యం చెప్తూ ఓ గంట వుండి వెళ్ళిపోయాడు.

దేవయ్య భిక్షపతిని తీసుకొస్తాడనో, కనీసం భిక్షపతి వార్త తెస్తాడనో సాయంత్రంనుండి రాయలింగు దృష్టంతా దారిమీదేవుంచి కూర్చు న్నాడు.

అర్ధరాత్రవుతుండగా అలసిన ముఖంతో వచ్చాడు దేవయ్య.

"ఏమైందిరా దేవయ్యా? బుచ్చయ్యను చూ సినవా? ఎట్లున్నడు? ఏమన్నడు? దెబ్బలుగిన కొట్టింర్రా? ఏడుస్తాండా?" దేవయ్య ఇంకా కూర్చోకుండానే ప్రశ్నలవర్షం కురిపించాడు రా యలింగు.

"నీపిచ్చిగానీ...నన్ను లోపటికి పోనిస్తరను కున్నవా? వాన్తోని మాట్లాడనిస్తరనుకున్నవా? నర్దారయ్యతోని పోనుపెట్టించి...జమేదార్సాబ్ సాయంచేస్తె దూరంనుంచి బుచ్చిగాన్ని చూ సిన. వాడు మంచిగానే వున్నడు...అందర్నే సినట్టే వాన్నిగూడ నాలుగేసిన్రట...నర్దారయ్య పోన్గొట్టింఋగద... ఇగకొట్టరట" కూర్చుంటూ చెప్పాడు దేవయ్య.

"ఎప్పుడిడిసిపెడ్తరో యేమన్న తెలిసిందా రా దేవన్నా!"

"ఇడ్సిపెట్టక వాన్నుంచుకోని యేంజేసు కుంటరే! కని రాయలింగు బావా! మూతిమీది మీసాలు నెరిసినయ్గాదే నీకు...నువ్గూడ గిసొంటి పనులెట్లచేసినవే?"

తానేం చేశాడో తెలియక వెర్రిచూపులు చూ శాడు రాయలింగు.

"బుచ్చిగాడు నర్దారయ్యనూ, నర్దారయ్య మనిషినీ తిట్టి...కొట్టబోయిండటకాదే! నువ్వా డనే కూనుంది తమాన జూసినావటకదా. మీకు గింత ఉరుకులాటెందుకొచ్చిందే? గిసొంటిపనులు చేస్తరు... యవారాన్ని నాశిడం చేస్తరు...మల్ల ఏడుస్తరు" నిష్ఠూరంగా అన్నా డు దేవయ్య.

"నువ్వు వాల్లమాటలు నమ్మినవారా దేవ న్నా! నర్దారయ్య మనిసే ఎటుబడుతటు తిట్టిండు...కానిపోని మాటలన్నడు. పైనలిచ్చి నంక గాతిప్పిందుకని బుచ్చిగాడు మర్లబడ్డ డు...గంతే! అడికి ఊకోరా అని నేనంటనేవు న్న"

"మన నమ్ముడు, నమ్మకపోవుడు ఎవలగ్గా వాలంటానవ్? మనమేమన్న పట్టిచ్చెటో ల్లమా... ఇడిపిచ్చెటోల్లమా? ఉన్నొక్క అసర, వాని కోపగొండితనంతోని పాడైపోయె"

"ఐతె నర్దారయ్య ఇడిపించుడుకు సాయంచేయలేదా?" రాయలింగు గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"ఇర్గమర్గతిట్టి... కొట్టకొట్టొచ్చినోనికెవలు సాయంచేస్తరే?"

"మరెట్ల తమ్మి! నా కొడుకింక ఇంటికి రాడా?" గౌరమ్మ ఆందోళన పడిపోతూ అడి గింది.

"మాగొస్తడు...నర్దారయ్య కాల్లు పట్టుకోని, గదువపట్టుకోని ఎట్లనో అట ఒప్పిచ్చిన. ఈ ఒక్కసారి చెమించుమని బాపూలి, బాపూలి తె...అకరికి నామొకంచూసి ఒప్పుకున్ననన్న డు... పోన్పెట్టి చెప్పిండు. కొట్టకుంట చే సిండు...కని..." ఆగాడు దేవయ్య.

"ఆ...కని...ఇంకా అడ్డమేమున్నదిరా దేవ య్యా!" రాయలింగు గొంతు జీరపోయింది.

"ఏంలేదు...ఇన్నిపైనలు కర్నైతయన్నడు"

"పైసలా? ఎన్ని పైనలు?"

"ఐదో పదో అనుకుంటాంద్రా? వందలు కావాలె వందలు"

కొంతసేపక్కడ నిశ్శబ్దం ఆవరించింది. రా యలింగుకు తమ ఊర్లో ఆనాడు భిక్షపతిని విడిపించిన సంగతి గుర్తొచ్చింది.

"దేవయ్యా! చిన్నోనివైనా నాకీడ ఉన్నోనివి నువ్వే. నాదగ్గర నూర్రూపాలున్నయ్. ఇంకెన్ని కావాల్నో యేందో... మిగిల్నయ్ యాన్నన్నజేసి



నాకొడుకునిడిపించు...ఎట్లనో , అట్ల తీర్చు కుంట" అంటూ అతడు దేవయ్యా చేతులు పట్టుకున్నాడు.

"ఈడ నువ్వుతప్ప మాకింకెవలున్నరు తమ్మీ!" అంది గౌరమ్మ.

"ఉన్నపైసలిటుపెట్టి... మరెట్లబతుకుత రే?"

"వాడులేని బతుకెందుకు మాకు? వాడు లేని సంసారం ఎవలకోసంజేయాలె? ఎట్లయి తట్లయిద్ది... ఉంటె తింటం...లేకుంటె ఉపా సంబంటం. ఆకరికి వశంగాకపోతె అందరం ఒక్కపాలే... ఇంత యిసంబుచ్చుకోని సత్తం" అంటూ నడుముకు కట్టుకున్న నూరురూపా యలుతీసి దేవయ్యా చేతిలో పెట్టాడు రాయ లింగు.

విపరీతంగా చలించిపోయిన దేవయ్యా, ఆ రూపాయల్ని పట్టుకుని, కాసేపలాగే చూశాడు.

"మనమేం కర్సుపెట్టకపోయినా... ఓరోజటో యిటో బుచ్చయ్యనిడిసిపెత్తరే!" ఆవేదనతో అన్నాడు దేవయ్యా.

"వద్దు వద్దు...వాన్ని సూడకుంట మా జీవ నాలు నిలువయ్" రాయలింగు దండంపెడు తూ అన్నాడు.

"పైసల్దేంది తమ్మీ! కొడుకొస్తే వాడే సంపా యిస్తడు" అంది గౌరమ్మ.

"గీపైసలు ఒక్క ఇడిపిచ్చుడుకే కాదు... బుచ్చయ్యాపేరు పోలీసులల్ల లేకుండ చేసు డుకు. లేకుంటె... యాడ గీలొల్లి జర్గినా వాన్ని పట్కపోతనే వుంటరట... జమెదార్‌సాబ్ చె ప్పిండు"

"గట్ల చేయించు తమ్మీ! మేం అటెంక రెక్కలకస్టం చేసుకోని బతుకుతం"

తర్వాత మరికాసేపు బంద్‌గురించి మాట్లా డి, రాయలింగిచ్చిన డబ్బులు తీసుకుని వెళ్ళి పోయాడు దేవయ్యా.

తెలతెలవారుతుండగా వచ్చి రాయలింగు ను కలిశాడు భోజ్యా. అతన్ని దేవయ్యే పంపించాడు.

"దుకానాలు దోసుకున్నరట... బస్సులు కాల బెట్టిన్రట... పిలగాండ్లను పట్టుకొస్తాంటె వాళ్లకూ, పోలీసులకూ లొల్లయిందట... సందు ల్లల్ల రొండు గురుపులోల్లు తన్నుకున్నరట... సంపుకున్నరట. అండ్ల ఓ దుకానపాయినగూడ సచ్చిపోయిండట. ఇయ్యాల దుకానపోల్ల బందట. ఇంకా పిలగాండ్లను తెస్తనేవున్నరట. గందుకే గిప్పుడు మన పిలగాండ్లనిడిసిపెట్ట రట... మీరు బెంగటిల్లకుండ్రని... రేపోమాపో పిలగాండ్లను తీసుకొనే వస్తననీ మీకు చెప్పు మని పంపిండు దేవయ్యా" వివరంగా చెప్పా డు భోజ్యా.

"దేవయ్యేడున్నడు?" అడిగాడు రాయ లింగు.

"ఆడనే...సర్దారయ్య దగ్గర్నేవున్నడు. ముగ్గు రికి మూడురొండ్లు... ఆరొందలు ఆయన చేతు లపోసి... ఎప్పటికప్పుడు ఫోనుపెట్టుకుంట... ఆడనేవున్నడు"

"తలారొండొందలా?"

"అవునే... పైసలు తక్కువైనయని నడుం గొల్సును నూర్రూపాయిలకమ్మిండు"

రాయలింగా మాటలువిని బిగుసుకుపో యాడు. దేవయ్యా చూపించిన దయకు విలువ కట్టడంలో మునిగిపోయాడు.

"మా బుచ్చయ్యెట్లున్నడన్న?" అడిగింది గౌరమ్మ.

"వానికేందే! మీ బుచ్చయ్యా, మిగిల్న పోర లు... అందరు నవ్వుకుంట తుల్లుకుంటున్న రు. గాడ్దికొడ్కుల... కొట్టకుంటచేసిండుగద దే వయ్యా!" అంటూ వెళ్ళిపోయాడు భోజ్యా.

"దేవయ్యా! ఎక్కడి సమందంరా ఇది...? పైసలైతె, ఎట్లనో అట్లకట్టొచ్చు కాని...నీదయ...? గీ రునాన్ని ఎట్ల తీర్చుకోవాలెరా?" ఎదురుగా దేవయ్యా ఉన్నట్లుగానే భ్రమించి అన్నాడు రాయలింగు.

"ఇదంత బాకి సమందం... ఏజల్మల మనకు బాకిపడ్డడో తమ్ముడు? లేకుంటె ఈ జల్మల్నె మనకు బాకిపెడ్తాండో" అంది గౌర మ్మ.

రాయలింగుకు భిక్షపతిపట్ల భయం తొలగి పోయింది. ఇప్పుడాస్థానంలో బతుకుభయం వచ్చిచేరింది. భవిష్యత్తు అతని కళ్లముందు ప్రత్యక్షమైంది. 'రేపెలా? పట్టం వ్యాపారం




డబ్బుకూడా అయిపోయింది. వ్యాపారమెట్లా? తిండెట్లా?' అన్న ప్రశ్నలు అతని మెదడును కుమ్మరిపురుగుల్లా తొలచివేస్తున్నాయి.

"ఇంక రొంప్రో జులెట్లుండాలె కొడుకా...ను వ్వెట్లుంటవ్ కొడుకా... మా కడుపులెందుకు పుట్టినవ్ కొడుకా..." సన్నగా రాగం మొదలెట్టింది గౌరమ్మ.

"నీయవ్వ... నీయేడుపు పెండ్లాం ముండ మొయ్యి! ఆగాడ్డికొడ్కు పుట్టకున్న బాగుండు. లేకుంటె పుట్టంగనే సచ్చినా పీడబోవు. ఊర్లుంటె గట్లాయె, ఈడికొస్తె గిట్లాయె... అయ్యయ్యయ్యయ్యొ... చిన్నప్పట్నుంచి వాని కొలుపేనాయె... ఎంతకాలమేగాల్నే వాన్తోని?" కసురుకున్నాడు రాయలింగు.

గౌరమ్మ ఏడ్పు ఒక్కసారిగా ఆగిపోయింది. రాయలింగు నోటినుండి ఎన్నడూ అట్లాంటి మాటలువినని ఆమె బిత్తరపోయి చూసింది.

"ఏమొ గట్లంటివీ...? గంత మాటంటివీ? వాడు సచ్చి మనం బతుకాల్నా...? వాడు సత్తె... అందరికండ్లు సల్లబడ్తయ్‌తీ"

"నేననంగనే వాడు సత్తడనుకున్నవా? సావడు తియ్యే! వాడు బతికేవుంటడు... మనల్ని గిల్లసంపుకుంట బతికేవుంటడు. అయిపాయె నోరు వాయికట్టుకోని, రొట్టెకడుక్క తాగుతుంట, కూడబెట్టిందంతపాయె... బతుక్కోనం తీనుకున్న బాకిపైసలుగూడపాయె... అంత వానికే అయిపాయె...ఏమో? వాన్తోని ఇంకెంతకున్నదో!" అంటూ గుడ్లనీరు గుక్కుకున్నాడతను.

ఈ మాటలంటుండగా అతనికి గుండె బరువైపోయినట్లనిపించింది. శ్వాస తీయడం కష్టమైపోయింది. శరీరమంతా చెమటలు పట్టి, విపరీతమైన దాహం వేసింది. మాట రావడమే కష్టమైపోయింది.

కళ్ళకు చీకటి వస్తుండగా మంచినీళ్ళకు సైగచేసి, అతడు గుండెల్ని గట్టిగా అదుముకున్నాడు.

ఒక్క ఉదుటున అతని దగ్గరకొచ్చి, అతని గుండెలమీద రాస్తూ కంగారుపడిపోయింది గౌరమ్మ.

లోపలకు పరుగెత్తి మంచినీళ్ళు తెచ్చి, నెమ్మదిగా తాగించింది మల్లికాంబ.

కాసేపటికి తేరుకున్నాడు రాయలింగు.

"ఏమయింది... ఏమయిందయ్యా?" కన్నీటితో అడిగింది గౌరమ్మ.

"ఏంలేదే... ఛాతిల నొప్పొలివచ్చింది... కండ్లకు చీకటొచ్చి, పానంపోతాందా అనిపించింది. కాని...నాది కానపావవు బతుకు. ఇప్పుడే పోదుపానం... ఇంక కానమూడాలె" వేదాంతిలా నవ్వుతూ అన్నాడు రాయలింగు.

"సరెతీ... గవేంమాటలూ?" ఏడ్పు గొంతుతోనే గదిరించింది గౌరమ్మ.

అలా అన్నదేకాని... ఆమెకు విపరీతంగా భయమేసింది.

ఆ తర్వాత ఏమీ మాట్లాడకుండా, అతని గుండెల మీద నెమ్మదిగా రాస్తూ ఆమె అలాగే కూర్చుండిపోయింది.

అలానే ఒరిగి...కొంత సేపటికి నిద్రపోయాడు రాయలింగు.

అతనిమీద బట్టకప్పి, పక్కనే చాపమీద పడుకొందామె.

తండ్రి పరిస్థితి మల్లికాంబను అమితంగా కలవరపరచింది. కుటుంబ పరిస్థితులు ఎంత కుదిపివేసినా, ఆమె ఇంతగా భయపడలేదు. తండ్రి ఈ పరిస్థితి, తమను సర్వనాశనం చేస్తుందేమో అని తలచి ఆమె నిశ్శబ్దంగా రోదించింది.

"తండ్రినిప్పుడు హాస్పిటల్‌కు తీసుకెళాలి. కాని ఉన్నదంతా అన్న కోసం ఊడ్చుకుపోయింది. తమకు సాయం చేయగలిగే దేవయ్య మామకూడా తనది ఊడ్చి ఇచ్చేశాడు. ఇప్పుడు వైద్యానికి డబ్బెలా?" ఈ ఆలోచన ఆమెను సూదిలా పొడుస్తోంది.

"తానేమన్నా సాయం చేయగలరా? ఏదిదారి?" అని ఆమెదారి వెదుకుతూండగా... నిన్న పొద్దున ఆమె పనిచేసే ఇంట్లో జరిగిన సంఘటన ఆమెకు తెరమీది బొమ్మలా కనిపించింది.

★ ★ ★

ఓ బ్యాంకు ఉద్యోగి, రామారావింట్లో పని చేస్తూ కుటుంబానికి అంతో యింతో సాయం చేస్తోంది తను.




వాకిలి చల్లడం... అంట్లు తోమడం... నీళ్ళు పట్టడం తనపని. నెలకు ముప్పై రూపాయలే కాక... వాళ్ళింట్లో మిగిలే పదార్థాలు తనకు దొరికేవి. వీటన్నిటికన్నా ఆ ఇంటి ఇల్లాలు ఆదరణ తనకు పెద్ద అండగా తోచేది.

పని చేయడం ఓ గంటలో అయిపోయినా... గంటలగ్గంటలు ఆ యిల్లాలుతో తన కుటుంబ కష్టాల గురించి చెప్తూ, సాను భూతి పొందుతూ వుండేది తను. ఆమెలో ఆత్మీయుల్ని చూసుకుని సేదదేరేది.

తన తండ్రికి బాగులేదని... ముగ్గురు పిల్లల్ని కూడా తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది రామారావు భార్య.

మరునాడుదయం తను పనికి పోయేసరికి, రామారావు ఒక్కడే వున్నాడు... తననదో తీరుగా చూశాడు.

తన తండ్రంత వయసున్న అతను తననలా చూడటం తనకు బాగనిపించలేదు... భయం కూడా వేసింది.

తాను అంట్లు తోముతుంటే రెండుమూడు సార్లు వచ్చి చూశాడు. భయపడుతూనే తాను గిన్నెల్ని తోమేసింది.

బకెట్లో నీళ్ళు తీసుకుని... లంగాను పైకి లేపి బొడ్లో దోపుకుని, ఓణీని నడుంచుట్టూ తిప్పి కట్టి, వంగి తాను గిన్నెలు కడుగుతూంటే... పక్కనే నాగుపాము బుసకొట్టినట్లనిపించి తిరిగి చూసింది. కిటికీ గుండా ఆబగా చూస్తూ బుసకొడుతున్నాడతను.

తన చూపు పడగానే పక్కకు తప్పుకున్నాడు.

గుండెలు వణికిపోతుండగానే కడిగి, వంటింట్లోకి తెచ్చి, దిమ్మెలమీద సర్దుతోంది తాను.

ఎప్పుడొచ్చాడోయేమో... ఒక్కసారిగా గబుక్కున వెనుకనుండి కౌగలించుకుని, గుండెల మీద చేతులేసి తనను గట్టిగా అదుముకున్నాడతను.

భయంతో తనకు కాళ్ళూచేతులాడలేదు. అరుద్దామన్నా నోట మాట రాలేదు.

అతడు తనను అతని వేపు తిప్పుకున్నాడు. బుగ్గలు నిమురుతూ దగ్గరకు... ఇంకా దగ్గరకు లాక్కుంటున్నాడు.

తనకేదో అవుతున్నట్లనిపించింది. రక్తం ఎక్కడకో పరుగెత్తుతున్నట్లయింది.

అలాగే గట్టిగా అదుముకుని అతడు తనను మధ్యగదికేసి నడిపించాడు... అక్కడ మంచం వేపులాగాడు. తను పెనుగులాడుతూ గోడవేపు లాగింది.

ఈ పెనుగులాటలో తన చేయి అక్కడున్న డ్రెస్సింగ్ టేబుల్‌కు తాకింది. భళ్ళున శబ్దం చేస్తూ అద్దంతో సహా కిందపడి... అద్దం ముక్కచెక్కలైపోయింది.

ఒక్కసారిగా అదిరిపడ్డాడు రామారావు. అతని చేతుల్లో బిగికొంచెం సడలిపోయింది. తనకు కొంచెం వూపిరాడింది. గట్టిగా విదిలించి విడిపించుకుని తను ముందుగదిలోకి దూసుకువచ్చింది. గబుక్కున ముందుగది గొళ్ళెం తీసి తలుపు తెరచింది.

"మళ్లీ...మళ్లీ... ఇదుగో" మధ్యగదిలో నుంచుండి డబ్బు చూపిస్తున్నాడు రామారావు.

తను బయటకు పరుగెత్తి... వేగంగా... అతివేగంగా నడుస్తూ ఇల్లు చేరింది.

చికాకులతో సతమతమైపోతున్న తల్లికి సంగతి ఎలా చెప్పాలా అని ఆలోచిస్తుండగానే... అన్నను పట్టుకుపోవటం... ఏడ్పులు... అర్పులు... ఇప్పుడు తండ్రి పరిస్థితి...

అంతా వరుసగా ఆమెకు గుర్తొచ్చి భయపడిపోయింది. భయం వెంటనే ఆమెను వర్తమానంలోకి తెచ్చింది.



# 7

"అప్పుడీ సంగతి చెప్పకపోవడమే మంచిదయింది... ఇప్పుడింక చెప్పనే వద్దు" అని

గట్టిగా నిర్ణయించుకుంది మల్లి.

అంతేకాదు... ఇంకా ఎన్నో నిర్ణయాలు చేసుకుంటూ, చెరపి వేసుకుంటూ... పూర్తిగా తెల్లవారబోతుండగా నిద్రలోకి జారుకుంది.

'రామారావు వెంటపడ్డాడు... మల్లి పారిపోతోంది... అతడు తరిమి తరిమి అలసిపోయిన మల్లిని పట్టుకున్నాడు. బలంగా తనవేపు లాక్కుని గుండెలకు హత్తుకున్నాడు. శక్తినంతా కూడదీసుకుని మల్లి అతన్ని దూరంగా నెడుతోంది. అతని ఛాతీమీద రెండు చేతులేసి బలంగా నెడుతోంది చిత్రం... అతడు రామారావు కాదు... దేవయ్య మామ' ఆ విషయం తెలుస్తూనే మల్లి అతన్ని గట్టిగా కౌగిలించుకుని బావురమని ఏడ్చేసింది.

"మల్లవ్వా! ఏందిబిడ్డ? బయపడ్డవా?" మల్లి భుజాల్ని పట్టుకుని కుదుపుతూ అడిగింది గౌరమ్మ.

మల్లికి తెలివివచ్చింది... కలగంటున్నానని అర్థమైంది.

ఏమీలేదంటూ అలాగే ముడుచుకుపోయింది.

తెల్లవారింది... ఆరోజు కూడా బందే... రాయలింగు జ్వరంతో కాలిపోతూ, నిస్సత్తువగా పడుకున్నాడు. గౌరమ్మ పనికిపోనన్నది.

మల్లిగబగబా ముఖం కడుక్కుని... తొందరగా పనిచేసుకుని వస్తానని తల్లికి చెప్పి బయలుదేరింది.

దూరం నుండే ఆశ్చర్యంతో తననే చూస్తున్న రామారావు ఆమెకు కనిపించాడు. అది గమనించనట్లుగా భయంతో వణుకుతున్న గుండెల్ని గట్టిగా అదిమి పట్టుకుని మల్లి లోపలికి నడిచింది.

"అమ్మగారింకారాలేదు... మంచిదే అయింది" అనుకుంది.

"వచ్చినవా...? ఇంకరావనుకుని భయపడ్డ" ఇకిలించాడు రామారావు.

మల్లి మాట్లాడకుండా, వాకిలీ ఇల్లూ ఊడ్చింది. అలుకు చల్లింది. వంటింట్లో టీ చేసుకునే గిన్నె కప్పులు తప్ప కడగాల్సినవేమీ



లేవు.

"అవి కడుక్కొని తెచ్చియ్యేపిల్లా!" అన్నాడతను.

కడిగి తెచ్చి వంటింట్లో పెట్టింది మల్లి.

"ముఖం కడుక్కున్నవా?"

"ఎందుకు?"

"ఎందుకేందే? చాయ్ చేస్త తాగుదువుగాని... ఈలోపలపోయి నీల్లుపట్టు" టీ గిన్నెలో పాలుపోస్తూ అన్నాడు.

మల్లి వెనక్కిపోయి నీల్లుపట్టింది. వంటింట్లో కొచ్చింది. రెండు కప్పుల్లో టీపోసి ఒక కప్పు మల్లి కందించాడతడు. "అక్కడ కూచుని తాగు" అంటూ ముందు గదికెళ్ళాడు. మల్లి టీ తాగేసరికి, కాళీకప్పుతో వచ్చాడు. వస్తూ ముందు గదికి గొళ్ళెంవేసిన సంగతిని






మల్లి గుర్తించింది.

"కప్పులు కడుక్కురాపో" కప్పందించాడు.

కప్పులు కడిగి తెచ్చి సర్దుతోంది మల్లి. అతడు నవ్వుతూ ఆమె పక్కకొచ్చాడు.

అతని కళ్లు అదో తీరుగా వున్నాయి. ముందేదీన్నూహించినా ఆమెకు నోటమాటరా లేదు.

జరుగబోయే విషయాన్నూహించిన ఆమె గుండెలు ఎగిరిపడుతున్నాయి.

"మల్లీ... నువ్వు పెద్దోల్లిండ్లల్ల పుట్టవల్సిందానివే! గాయింట్ల పుట్టినవ్... పుడితెమాయె... పెద్దోల్లతో కలిసి వుండు" దగ్గరగా వచ్చి, ఎడమచేతినామె భుజం మీదుగా తిప్పిపట్టుకుని, కుడిచేత్తో ఆమె బుగ్గలు నిమురుతున్నాడు రామారావు.

మల్లి శరీరంలో రక్త ంగిపోయి గడ్డకట్టినట్లనిపించింది. భయంతో ఆమెకళ్లు చీకట్లు కమ్మాయి.

"అబ్బ... నీకండ్లెంత మెరుస్తున్నాయి... ఈ చెంపలు, చేతులు ఎంత నున్నగా వున్నయ్...? నీ శరీరంలో ఎంతవేడున్నదే? నీ ముఖంలో ఎంతవెలుగున్నదే...! తిండీ, బట్టా సరిగ్గా ఉంకే ఇంట్లపుడితే... లోకమంత నీకాళ్లమీద పడిపోయేదే పిల్లా" పలవరిస్తున్నట్లుగా అంటూ అతడు ఆమెను అదుముకుని మంచం వద్దకు తీసుకొచ్చాడు.

మల్లికళ్లు మూసుకుపోయినాయి. అస్తవ్యస్తమైన మాటలు అసహ్యంగా ఆమెకు వినిపిస్తు

న్నాయి.

అతను గట్టిగా...ఇంకా గట్టిగా అదుము కుంటున్నాడు

అతని కుడిచేయామె గుండెలమీదకు చేరింది. తర్వాత నడుం... ఆ తర్వాత కిందకుపాకి ఆమె పొత్తికడుపు చేరింది.

అతని పెదాలు చల్లగా ఆమె చెంపలమీద కదులుతున్నాయి.

మల్లికి భయమూ, ఏడ్పూ ముంచుకొస్తున్నాయి.

అతని చేయి ఇంకా కిందకు జారి ఆమె లంగా సర్దుతోంది. ఎడమచేయి ఆమెకూపిరాడకుండా బిగుసుకుంటోంది.

బలాన్నంతా కూడదీసుకుని ఒక్కతోపు తోసింది మల్లి.

పడబోయి నిలదొక్కుకునుంచున్నాడతను.

"ఇదుగో మల్లీ! ఏంకాదే... ఒక్కసారి... ఒక్కసారంటె ఒక్కసారే... మంచిగుంటది... నీకు మంచిగనిపించకుంటె ఊర్కుంట" వగరుస్తూ దగ్గరగా వస్తూ అన్నాడతను.

"నన్ను ముట్టుకోకు... ముట్టుకుంటె మొత్తుకుంట... అందరికి చెప్త" బెదిరించబోయింది మల్లి.

"మొత్తుకుంటవా? అందరికి చెప్తవా? పిచ్చిపోరి... చెప్పు... చెప్పితె నీకే నష్టం... చెడిపోయిందానివని అందరు నిన్నే తిత్తరు... ఆ తర్వాత నీకు పెండ్లేకాదు... మీ అవ్వబావిలో పడిచస్తది" అంటూ అతడు మళ్ళీ ఆమెను పట్టుకున్నాడు.

తల్లిబావిలోపడి చస్తుందన్నమాట ఆమెను విపరీతంగా భయపెట్టింది. ఆమె ఆ ఆలోచనలో ఉండగానే అతడామెను అబగా అదుముకుంటున్నాడు.

మల్లి గింజుకుంది... పెనుగులాడుతోంది.

"మల్లీ! మల్లీ! ఒక్కసారి నామాటిను... తర్వాత ఎప్పుడూ నీ జోలికిరాను... ఇదిగో...కావాలంటె ఈ డబ్బు తీసుకో" జేబునుంచి ఏభైరూపాయల నోటుతీసి బలవంతంగా ఆమెచేతిలో పెట్టాడతను.

మల్లి ఆ నోటును గట్టిగా పట్టుకుంది. ఆమె కళ్లకు ఆయాసంతో మూలుగుతున్న తండ్రి కనిపించాడు. ఆందోళనతో దిగులుపడిపోయిన తల్లి కనిపించింది. పోలీసుల్తో దెబ్బలు తింటున్న అన్న కనిపించాడు. తమ కోసం అవస్థలు పడుతున్న దేవయ్య మామ కనిపించాడు. అంతే... జాగ్రత్తగా ఆమె ఆ నోటును నడుం వద్ద లంగాకు బెక్కుకుంది.

విజయం సాధించాననుకున్న రామారావు ఆమె అంగాంగాల్ని అబగా చూస్తున్నాడు... వెకిలిగా నవ్వుతున్నాడు.

అతనిచూపులు చండాలంగా వున్నాయి. అతని నవ్వు పరమ అసహ్యంగా వుంది.

గుడ్లు చితికిపోయేలా అతని కళ్ళల్లో వేళ్ళు దించాలని, పళ్లు రాలిపోయేట్లుగా ఒక తన్ను తన్నాలని, ముక్కలయ్యేటట్లుగా తలమీద కొట్టాలని, మీదపడి రక్కి... మిగిలిన వెంట్రుకలన్నీ పీకేయాలని, ముఖంమీద కాండ్రించి ఉమ్మేయాలని... ఆమెకనిపించింది.

ఆమె అలా అనుకుంటుండగానే అతనామెను ఆవేశంగా వాటేసుకున్నాడు.

ఆమెకంతులేని రోతపుట్టింది. ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది. బలంగా అతని ఛాతీమీదో చేయీ, ముఖంమీదో చేయేసి ఒక్కతోపుతోసింది.

అంతదూరం విసిరేసినట్లుగా పడిపోయాడు రామారావు.

అంతే... ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయలేదు మల్లి. రివ్వున దూసుకువచ్చి, తలుపుతీసుకుని వేగంగా ఇంటివేపు పరుగెత్తింది.

ఆమె ఇల్లుచేరేసరికి ముసుగు కప్పుకుని మూలుగుతున్నాడు తండ్రి. గౌరమ్మా, దేవయ్యా చెరోవేపు కూర్చున్నారు.

"రాత్రి అయెపోయె పానాలు చేసిందు తమ్మీ... చాతిల వశంగాని నొప్పి. చాపొలె తల్లడిచ్చిందు" అంది గౌరమ్మ.

"మీ గాచారం బాగలేదక్కా! మరి దావకానకు తీస్కపోయి, ఇంత మందో మాకో ఇప్పియ్యకుంటెట్లనే?"

"గాంది దావాకానకు తీస్కపోతననుకున్న




తమ్మి... కాని గి బందు పొడాయె... బస్సు లుండయ్... రచ్చల పోతమంటె ఊకనే అయి ద్దా... ఎన్నిపైసలుకావలె"

"గాంది దవకానకా... అదలైన్ల నిల్సోవాలె... వశంగాని మందుంటరు. లైన్ల నిలునుంటె అల్లజూసిట్ల యెల్లగొడ్తరు. నాలుగ్గోలీలు, రంగు నీల్లిస్తరు. గావాటితోని రోగంపోద్దా? డాక్ట రు సెర్లచేసి చూడాల్నంటె, ఇంటికాడకలువా ల్నట... కర్సుపెట్టాల్నట. గవురుమెంటు దావకా నైనా కర్సుతప్పదే అక్కా! గాపైసలే బైటకర్సు పెడితే... అయింత తిప్పలు తప్పుతది. పానం బాగైతె... సినిమాలాటోడు కాడి డాక్టరు మనకెరి కేనాడు... అడికి తీస్కపోదాం." నిదానంగా అన్నాడు దేవయ్య.

దేవయ్య మాట్లాడుతున్నంతసేపూ మూల్గు నాపాడు రాయలింగు. అతడు మాటముగించ గానే తలమీది మునుగుతీశాడు.

"నేను యాడికీ పోదల్సుకోలేదురా దేవ య్యా!" దీనంగా ఎక్కడో మాట్లాడుతున్న ట్టుంది రాయలింగు గొంతు.

"అదెమో... ఎందుకుపోవు బావా! పోకుంటె ఊకెనే తగ్గుతదనుకున్నవా? రోగం తచ్చుడు దానివంతుగాని... పోవుడు దానివంతను కుంటానవా?"

"పోకుంటేమయిద్ది? సంపుతదా? సంపనీ... సంపితె పీడబోద్ది"

"సచ్చెటాలకు సత్తువుగాని... సచ్చేదాకనన్న మంచిగుండొద్దా? పిచ్చోనోలె మాట్లాడకుగని.. దావకానకు పోదాంపా"

"నీ బాంచెను వద్దురా దేవయ్యా! నా దగ్గరెక్కపైనకూడలేదు" కన్నీళ్లాపుకుంటూ అన్నాడు రాయలింగు.

"మరిగట్లజెప్పు... పైసల్లేవని పోనంటా నావు? పైసలు చూసుకుంటె పానాలుపోతయ్ గాదె! పైసల సంగతి నేను చూసుకుంటగని... నువ్వు పికరు పెట్టుకోకు"

"వద్దు వద్దు... వద్దురా దేవయ్యా! వద్దు... ఇప్పటికే నా బాకితీరరానిదైపోయింది. ఇంకె న్ని పైసలు పెడ్తవ్? ఎంతకాలం నిన్ను ముంచాలె?" చేతులు జోడించాడు రాయ లింగు.

"నీయవ్వ... బాకితల్లిపెండ్లం ముండమొ య్య! బాకి... దండిబాకి... మంచిగయినంక తీర్సుకుందువు తీరాదు. నేను రక్షతెస్త... పోదాంపా" లేచి నుంచున్నాడు దేవయ్య.

ఇంతసేపూ నుంచుండి విన్న మల్లి, చేతిలో యాభైరూపాయల నోటుతో తల్లి దగ్గరకు నడి చింది.

"నాయినకు బాగలేదని చెప్తె... అయ్యగా రు పైసలిచ్చిండే. నెలజీతంకింద చూసు కుంటనన్నడు" తల్లి చేతిలో నోటుపెడుతూ అంది మల్లి.

"నాయినకోసం అడిగినవాబిడ్డా! నాతల్లే... ఆ అయ్యకడుపు సల్లగుండ. ఇచ్చిండా?" సంతోషంతో అక్కున చేర్చుకుంది గౌరమ్మ.

రాయలింగు ముఖం వెలిగిపోయిగది. అత డు బిడ్డవేపు తృప్తిగాచూస్తూ వుండిపోయాడు.

"ఇగనన్న వత్తవానె బావా? నీ బిడ్డే పైసలు తెచ్చిందిగద?" మల్లిని మెచ్చుకోలుగా చూస్తూ అన్నాడు దేవయ్య.

రాయలింగు ఒప్పుకున్నాడు. దేవయ్య అత న్ని రిక్షాలో డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళి, మధ్యా హ్నానికల్లా మందులు రాయించుకొని తిరిగొ చ్చాడు.

డాక్టరు ఫీజూ, మందులూ, రిక్షాకుపోగా... ఇంకా పదిహేనురూపాయల చిల్లరా మిగి లాయి.

"చూసినవా? లేనిపోని రందులు పెట్టు కొని, రోగం తెచ్చుకుంటివి... డాక్టరేమన్నడో యిన్నవ్‌గద" రాయలింగును పడుకోబెడుతూ అన్నాడు దేవయ్య.

"గిన్ని జరుగుతాంటె రందిపడకుంటె ట్లుంటం తమ్మీ" అంది గౌరమ్మ రాయ లింగుకు దుప్పటి కప్పుతూ.

"నీయవ్వ... నీ కొడుకునొక్కన్నే పట్టుకపో యిండ్రానె...? వందలు... వేలమందిని పట్టుకు పోయిండ్రు. గట్లనే పైసల్లేకుంట మీరొక్కలే ఉన్నరా? దేసంల కూడులేక కుమ్మలేక ఊర కుక్కలోలె ఎంతోమంది సత్తాండ్రు... ఎట్లయిత ట్లయిద్దని దయిర్యంగుండాలె"

"దెబ్బమీద దెబ్బతలుగుతాంటె దయిర్య



మెట్లుంటదిరా దేవయ్యా?''

"ఎన్ని దెబ్బలు తలుగుతె అంతదయిర్యం పెరుగాలె... దయిర్యం పోగొట్టుకొని, నత్తెమంచి గుండు... నత్తెమంచిగుంటునంటానవు? బతుకుడుకే శాన దయిర్యం కావాల్నని ఇప్పుడన్న తెలుసుకో... అయింత అపోరి పెండ్లి చేయకుండనే పోదామనుకుంటానవా?''

తన పెళ్ళిమాట వచ్చేసరికి అక్కడినుండి తప్పుకుని లోపలికెళ్ళింది మల్లికాంబ.

"మా మల్లవ్వ పెండ్లా...? ఎట్లచేస్తరా దేవయ్యా? తలుసుకుంటెనే బయమైతాంది. అటు రాజేశం బాకి... ఇటు నీబాకి. ఇంక బుచ్చయ్య నంగతి గట్లుండె... గివన్నిటికితోడు ఈ నంసారాన్నీదాల్నాయె... గిన్ని రందుల్లోని అశగతమైపోవుకుంట బతుకుడాయె. బతుకే బయమనిపించబట్టె... ఇంక దానిపెండ్లి నంగతి చూసెట్టున్నాదిర నాకు....?'' అన్నాడు రాయలింగు.

"రాజేశం బాకి నంగతి చూద్దాం... నాబాకిదేం లెక్కే...? నీశాతనైనప్పుడు తేర్చుకుంటె తేర్చుకుంటివి... లేకుంటెలేదు. ముందుగాల నువ్వు మంచిగ్గావాలె. మంచిగయితె అన్ని నదురుకోవచ్చు...'' ధైర్యం చెప్పాడు దేవయ్య.

"మరి నువ్వు. నీపైనలన్నిగిట్ల కర్సుపెట్టుకుంటానవ్... ఇంక బాకిచేస్తానవ్. అయింత రేపు నువ్వు మంచంలపడితెట్లరా దేవయ్యా?''

"అదె... మీరందరులేరా? ఇంటికి బుక్కెడు బువ్వ పెట్టరా?''

దేవయ్య తనగురించి ఎంత పట్టించుకోకపోయినా... అతని గొంతులోని ఆవేదనను రాయలింగు గుర్తుపట్టాడు. ఇదివరకోసారి కదిలించినప్పుడు అతనిలో ఇంత ఆవేదన లేదు.

"ఎప్పట్నుంచో నాకో ఆలోశన వస్తాందిరా దేవయ్యా! మొండిమొదలారిన మనిసోలె ఎన్నిరోజులుంటవ్...? ఆడీడ తిరుక్కుంట... ఓపూట తినుకుంట, ఓపూట వుపాసం బండుకుంట, ఏకమ్మ కాకోలె జీవనాల్ని ఎన్రోజులు గడుపుతవ్? నాకు బుచ్చిగానిమీద ఆసెపోయింది. నువ్వీకాన్నుంచి ఈడనే... మాతోనె ఉండురా దేవయ్యా! యాల్లకింత ఉడుకబెట్టి కడుపిసారించే మనుసులున్నరు... నువ్వే నా పెద్దకొడుకువనుకుంట'' ఆప్యాయంగా అన్నాడు రాయలింగు.

రాయలింగు మాటలు దేవయ్య గుండెలోతుల్లోకి చొచ్చుకుపోయాయి. చెలిమల్లోవలె కన్నుల్లోంచి ఉబికివచ్చే కన్నీటిని ఎంతో నిగ్రహంతో అపుకున్నాడు.

"మాతోనే వుండుకుంట, మాతోనే బతుకు... అన్నో ఈన్నో తిరిగి. ఓ పిల్లనుజూసి నీకు ముడిబెడుత... గిప్పుడన్న నంసారంల పడిపో.'' దేవయ్య దగ్గరగా జరిగి, అతని రెండు భుజాల్ని పట్టుకుని, కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు రాయలింగు.

"నాకు పూర శాతగానప్పుడు గట్లనే ఉంటతియ్యే.'' అన్నాడు దేవయ్య.

"శాతగానప్పుడా...? శాతగానప్పుడు పెండ్లి చేసుకుంటావుర...?''

"మరింకేంది బావా! నీ పిచ్చిగాని... గీయాడుల నాకు పెండ్లేందే?'' అంటూ లేచాడు దేవయ్య.

"అవ్వ అన్నమొండింది... ఈన్నే తినిపో మామా... అవ్వ తినిపొమ్మంటాంది'' బయటికొచ్చి అంది మల్లికాంబ.

"నాయిన అన్నడోలేదో... అప్పుడే తిండిపెడుతానంటాంది కోడలుపిల్ల. చూసినావె బావా! సరె... తిన్నంకనే పోతతీ... మరి నాయినకింత జావచేసినవానె మల్లవ్వా...?'' అన్నాడు దేవయ్య.

"చేసిన తమ్మీ...'' అంటూ జావగిన్నెతోవచ్చి రాయలింగుకు జావ తాగించింది గౌరమ్మ.

ఆ తర్వాత "మామకన్నంబెట్టు బిడ్డా!'' అని రాయలింగుకు కాళ్ళొత్తుతూ కుర్చుంది గౌరమ్మ.

దేవయ్య కాళ్ళుచేతులు కడుక్కొనివచ్చేసరికి చాపపరిచింది మల్లి. కంచంలో అన్నంపెట్టి, పచ్చడివేసి, మంచినీళ్ల గ్లాసుపెట్టింది.

దేవయ్యవచ్చి కూర్చుండి అన్నం తింటూంటే... అక్కడే నుంచుండి తృప్తిగా చూస్తూండిపోయింది.

ఎప్పుడో చచ్చిపోయిన తల్లీ... పెళ్ళయిన రోజుల్నాటిభార్యా గుర్తుకొచ్చి దేవయ్య కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.





దేవయ్యలో ఎప్పుడూ కనిపించే మని షికాక... ఒక కొత్తమనిషి కనిపించాడు మల్లి కాంబకు.

వెంటనే రామారావు స్పృగుర్తొచ్చి, శరీరంమీద తేల్జూజెర్లా పాకినట్లనిపించింది.

'అతడిచ్చిన రూపాయలు తీసుకోవడం తప్పా!' అని కాసేపు ఆలోచించింది.

'అయినా తనకు నెలజీతం రావాల్సిందే.... వానికాశాస్తి జరగాల్సిందే..!' అని తనను తాను సమర్థించుకుంది.

చేతులు కడుక్కుంటున్న దేవయ్యను చూస్తూ... అతనిలో వచ్చినమార్పును గుర్తుపట్టడానికి ప్రయత్నించింది. 'అతడు మారాడా? లేక అతడు మారాడని తనే అనుకుంటున్నదా? తన మనసే దేవయ్య మామను మార్చుకొని చూస్తోందా?' ఎటూ తేల్చుకోలేకపోయింది మల్లి.

"చిన్నప్పుడు మా అవ్వపెట్టినప్పుడెంత తిన్ననో ఇయ్యాల మల్లవ్వ పెడితే గంత తిన్ననే బావా! మా అవ్వొచ్చి కోడలు మల్లి కాంబలో చేరినట్లనిపించిందే" బయటకు వస్తూ అన్నాడు దేవయ్య.

"ఏందిన్నవ్‌తమ్మీ... నూకలన్నం, చింత పండు తొక్కేనాయె ఒక్కసారన్న ఇష్టమున్న దొండి, కడుపునిండ పెడుదామంటె... ఎప్పటికి గివె రందులాయె" అంది గౌరమ్మ.

"నూకల బియ్యమైతేంది... తొక్కైతేంది? పావురం గలిపితె పరుమాన్నం అయిపోద్ద క్కా! మల్లవ్వ నాకు పరుమాన్నం పెట్టిందను కో" అన్నాడు దేవయ్య.

మల్లికాంబ సిగ్గుపడి పక్కకు తప్పుకుంది.

"రాయలింగు బావా! ఊకరంది పెట్టు కోకు... కన మంచిగయ్యేదాక మందులు యాల్ల వకారం వాడాలె [illegible] [illegible] [illegible] నంపాయించుకోవచ్చు [illegible] [illegible] బుచ్చయ్యను [illegible] [illegible] [illegible] ర్యాంగుండు" అని [illegible] [illegible] [illegible] య్య.

కనిపించే దాకా దేవయ్యను చూస్తూ [illegible]





డింది మల్లి.

★ ★ ★ ★

"ఐదొద్దులు తొక్కుతవ్. పదొద్దులు పోలీసుల ల్లవడ్తావ్... ఏందిరో యిది...? ఆ యింత గా దేవయ్య కిరాయిచ్చేవటికె సరిపాయె, లేకుంటె ముంచెటోనివెగద! ఇగో ఆకరు సారి చెప్తాన... ఉంకోసారిగిన గిట్లయితె దేవయ్యకాదు... దేవుడు చెప్పినా నీకు రక్షనియ్య" అని గొణుక్కుంటూ భిక్షపతికి రిక్షానిచ్చాడు యాదగిరి.

భిక్షపతి మనస్సు చివుక్కుమంది. "వారంరోజుల కష్టం గంగలో కల్సిపోయిందని ఓవేపు తను బాధపడుతుంటే... తన కిరాయి తనకు ముట్టిన తర్వాత కూడా ఇతనిట్లంటున్నాడు... తొక్కనిరోజులకు కూడా కిరాయనివ్వాలికావచ్చు" అనుకుంటూనే రిక్షా తీసుకుని అడ్డావేపు నడిచాడు భిక్షపతి.

పంపుదగ్గర రిక్షావాళ్ళు పలకరించారు కొందరు మెచ్చుకోలుగా, కొందరు పాపమన్నట్లుగా చూశారు. కొందరు పరిస్థితుల్ని కొందరు పోలీసుల్ని తిట్టారు. కొందరేమో ఇక ముందెట్లుండాలో బోధించారు.

ఓ అరగంటసేపు అదో విధంగా అనిపించినా తర్వాత మామూలుగా అయిపోయాడు భిక్షపతి.

టీ తాగి బీడి వెలిగించుకుని, బస్సుకోసం చూస్తూ, రిక్షాతొట్టిలో కూర్చున్న భిక్షపతి మనస్సు భూతభవిష్యత్కాలాల్ని మధిస్తోంది.

"తండ్రికి నయమైపోయింది. దేవయ్య మామ సాయంతో మరో గిరిగిరి బ్యాంకులో అప్పుతీసుకుని అతడు వ్యాపారం కొనసాగిస్తున్నాడు. ఇక ఎవరి జోలికీపోకుండా, ఎందులోనూ చిక్కుకోకుండా తను పనిచేసుకుంటూ [illegible]".

'అయినా [illegible] ఇదివరకు మాత్రం ఎవరి [illegible] [illegible] అన్యాయంగా తనను [illegible] [illegible] తప్ప దేవయ్య మామే [illegible] [illegible]చిక్కుల్లో ఎంతకాల [illegible]!

[illegible] [illegible] [illegible] రాగానే భిక్షపతికి అతడు [illegible] [illegible] [illegible] రాత్రి చెప్పిన మాటలు చెవుల్లో వినిపించాయి.

"[illegible] బుచ్చయ్యా! [illegible] [illegible] అయి

తవో.. లేకుంటె నీ దురాదుస్టమే అయిద్దో కాని.. నీతోని మీకుటుంబం శాన దెబ్బతిన్నదిరా! బవు కస్టపడుకుంట... రవుతం నీల్లు చేసుకోని, మీ నాయిన సంపాయించిందంత నీకే కర్స యిపోయింది. మీ నాయన గూడ పెద్దమనిసై పోయాడు...గా ఒక్కని చేతుల మీద గిన్ని కడుపులు నిండుడు సామాండెంగాదు... ఇన్ని రోజులు జీవనాలన్ని నీమీద పెట్టుకోని బతి కిండు. ఆసెలు పెంచుకున్నడు... ఇంట్ల ఎది గిన పొల్లున్నది... దాని పెండ్లెట్ల చేయాల్నని బెంగటీలిపోయిండు... ఆయింత మీ నాయిన కేమన్నయితె... గాబారమంత మీమీన పడ్తది. అగొ గివన్ని యాదికుంచుకోని మెదులుకో.'' అన్నాడు దేవయ్యమామ.

ఆ మాటల్లోని నిజాన్ని మననం చేసుకున్నాడు భిక్షపతి.

''ఈ కాన్నుంచి ఒకనంటుకుపోకు... ఒకని సొంటుకుపోకు... యాన్నన్న ఏదన్న జర్గుతదని అనుమానమొస్తె... చనం కూడ ఆడుండకు''

అవును... అలాగే ఉండాలనుకున్నాడు భిక్ష పతి.

''నువ్వుకొంచెం కోపాన్నిడిసి పెట్టాల్రా బుచ్చయ్యా! పైసలున్నోల్లు, పెద్దపెద్ద బంగ్లలు న్నోల్లు, లీడరోల్లు గూడ కోపంతోని పాడైపో యింద్రు. మరి... రెక్కాడితెగాని డొక్కాడని ప్యాదముండకొడ్కులం... పతారలేని పైసలేని అంబేదుగాండ్లం... మన కోపం ఎందుకక్కెరికొస్తదిరా?''

అవును... తాను కోపాన్ని విడిచిపెట్టాలి అనుకున్నాడు భిక్షపతి.

''ఉడుకు నెత్తురురుకులాడే వైనుపోరనివి నువ్వు.... కోపమే లేక ముసులోనోలె ఉండుడు నీకు శానకస్టమని నాకెరుకే. కాని... ఇప్పటికే నీకోపేరొచ్చింది... నువ్వు ముట్టుకోకపోయినా నీకింత బురుద అంటింది... అట్లనో యిట్లనో... ఇంత కర్సు పెట్టి, గాపేరు తీసేసిన...గా బురుద కడిగేసిన... అగొ గసొంటి బురద మల్ల అంటకుంట చూసుకో...'' సాగనంపుతూ అన్నాడు మామ.

'తనకు ఎంతకోపమున్నా... చిన్ననాడెప్పుడో తప్ప ఎవరిమీదా చూపించలేదు. ఒక్క సర్దార్ మనిషి మీద కొంచెం కోపమొచ్చింది. అదీ ఓ కోపమేనా? అనవసరంగా తనకు బురుద అంటింది. తన కుటుంబంకుంగిపోయింది. దానికి తనే కారణమంటున్నారు. నిజానికి తాను కారణంకాదు... అయితే ఎవరు? ఎవరు కారకులు? వాళ్ళనెవరు పట్టుకోవాలి? ఎవరు శిక్షించాలి' అతని నెత్తురు సలసలమరిగింది.

'అదుగో... తనకు మళ్లీకోపమొస్తోంది... రావద్దు... తను అన్నీ మరచిపోవాలి... ఏదీ ఆలోచించవద్దు... తనకు కోపం లేదు... రోషంలేదు.. సిగ్గూ, శరం, ఇజ్జత్ మానం అసలేలేవు... తనో రిక్షావాడు... పైసాలేని బాడుకావుగాడు... పగలూ రాత్రీ పశువులా కష్టపడాలి... తినాలి. తినాలి... కష్టపడాలి... అంతే' గట్టిగా నిర్ణయించుకున్నాడు భిక్షపతి.

ఇంతలో చౌరస్తాకో సవారీ దొరికింది భిక్షపతికి.

ఒక్కన్నే తీసుకెళితే రూపాయిస్తానన్నాడతను. సంతోషంగా అతన్ని చౌరస్తాలో దించాడు భిక్షపతి.

ఆ తర్వాత రిక్షాను చౌరస్తాలో తిప్పుతూ సవారీ కోసం చూశాడు.

కాసేపటికే మరో సవారీ దొరికింది. బస్తీకి కాస్తదూరంగా, కొత్తవాడకవతల నిర్మాణమవుతున్న ఓ కాలనీకి అతన్ని తీసుకెళ్ళాలి. అతని దగ్గర ఒక మూటకూడా వున్నది.

ఆ కాలనీకి నేరుగా బస్సులులేవు. లోకల్‌లో వెళ్ళినా, కొత్తవాడదగ్గరదిగి, దాదాపు కిలోమీటర్ దూరం నడవాలి. లేకుంటే అక్కడినుండి రిక్షాలో వెళ్ళాలి. రిక్షాలకూ, ఆటోలకూ తిరిగి వచ్చేప్పుడు సవారీలు దొరకవు. అందుకే ఆ కాలనీకి పోయే రిక్షావాళ్ళు రానుపోను కిరాయ లెక్కకట్టుకుంటారు.

భిక్షపతి ఆ కాలనీ గురించి విన్నాడు తప్ప ఎన్నడూ వెళ్లలేదు... అయినా ఆరురూపాయ లడిగాడు. అతడు వెంటనే ఒప్పేసుకున్నాడు.

భిక్షపతి సంతోషంగా రిక్షాలో మూటనువేసి, అతన్ని కూర్చోపెట్టుకుని, హుషారుగా తొక్కుతున్నాడు.

'అదృష్టం బాగుంటే తిరిగి వచ్చేటప్పుడు కూడా ఓ సవారీ దొరుకవచ్చు. కాలనీ నుండి కాకపోయినా కొత్తవాడనుంచైనా దొరుకవచ్చు.



ఎంతొచ్చినా లాభమే'

ఆలోచనల్లోనే ఏనుగులగడ్డ, వేయిస్తంభాల గుడి అలంకార్... చకచకా వెనక్కి వెళ్లాయి. డైరీ దగ్గర ఎత్తుగావున్న బ్రిడ్జీ వద్ద రిక్షావేగం తగ్గింది. ఎడమవైపు స్మశానం... గోరీలు... కుడి వైపు పొలాలు... పొలాల మీద భద్రకాళి చెరువు... కొండలు ...

భిక్షపతి హుషారుగా అటూ యిటూ చూస్తూ, అక్కడక్కడ పలకరించే రిక్షా మిత్రులకు చేయూపుతూ, బ్రిడ్జి దిగి రివ్వున దూసుకుపోతున్నాడు.

ములుగురోడ్డు... ఏకశిల హోటల్... మెడికల్ కాలేజి... సెంట్రల్‌జైల్ వరకు రిక్షా వేగంగా పరుగెత్తుకుపోయింది.

దేవయ్యమామ విడిపించకుంటే తానాజైల్లో వుండేవాడేమో' అనుకున్నాడు భిక్షపతి.

సూపర్ బజార్, పాలిటెక్నిక్ దాటి... గాంధీ హాస్పిటల్ దగ్గర మలుపుతిరిగింది రిక్షా.

'ఇంతపెద్ద దవాఖాన... తమలాంటివాళ్ళ కెందుకు పనికిరాకుండాపోతోంది?' అర్థంకాలేదు భిక్షపతికి.

హాస్పిటల్ దాటి.... కొత్తవాడ దగ్గర మలుపు తిరిగి... గతుకుల రోడ్డు గుండా ప్రయాణించి... కాలనీలో సవారీని దింపి, డబ్బులు తీసుకున్నాడు భిక్షపతి.

అతడాశించినట్లుగా అతనికి తిరుగు సవారీ దొరుకలేదు.

'కొత్తవాడలో చూద్దాం' అనుకుని, రిక్షాను



కొత్తవాడదాకా లాక్కొచ్చి, లోకల్ బస్‌స్టాండ్ వద్ద ఆపుకున్నాడు.

అంతకుముందే లోకల్ వెళ్ళినట్టుంది. అక్కడా జనంలేరు.

ఊరికే పోవటానికతనికి ఇష్టంలేకపోయింది. 'ఓ అరగంట చూద్దాం' అని నిర్ణయించుకున్నాడు.

కడుపులో ఆకలనిపించింది. పక్కనేవున్న డబ్బాహొటల్‌కు పోయి... ఒక బన్. టీ తీసుకున్నాడు.

బన్ తుంచుకుని, టీలో ముంచుకు తింటూ చుట్టూ చూశాడు.

దూరంగా సారాయిదుకాణం... కల్లుదుకాణాలు కనిపించాయి. వాని ముందు జనం కూడా కనిపించారు.

'ఇంత పొద్దున్నే తాగుతారా?' అనుకున్నాడు భిక్షపతి.

ఆరోడ్డు గుండా రావడం పోవడం ఎన్నోసార్లు జరిగినా... ఆవాడ సంగతి భిక్షపతికి తెలియదు.

వరంగల్‌లో కొన్నివాడలు సాయంత్రాలు మత్తువాడలై పోతాయి. రౌడీలు, కిరాయిరౌడీలు, దాదాలు అక్కడ తాగితందనాలాడుతారు... తిట్టుకుంటారు... కొట్టుకుంటారు... అప్పుడప్పుడు చంపుకుంటారు.

కొత్తవాడలో కూడా సారాయి, కల్లుదుకాణాలున్నాయి కాబట్టి, అక్కడా ఇలాంటి గొడవలు జరుగుతాయి... అయితే ఆ వాడ ఒక దాదాపేరుతో వరంగల్‌లో ప్రసిద్ధమైపోయింది.

భిక్షపతి బన్ అయిపోయింది. ఇందాకటి టీ బన్‌ను తడపటానికే అయిపోయింది. టీ తాగినట్లే లేదు. మరో సింగిల్‌టీ తీసుకుని తాగుతున్నాడు భిక్షపతి.

అంతలో ఒకతను భిక్షపతి రిక్షా దగ్గరికొచ్చాడు. అటూ ఇటూ చూసి, రిక్షా బెల్‌ను ఆపకుండా మోగిస్తున్నాడు.

గబగబా టీ తాగి, డబ్బులిచ్చి పరుగెత్తుతున్నట్లుగా వచ్చాడు భిక్షపతి.

అతను... ఎత్తుగా, లావుగా ఉన్నాడు. చెంపలూ, మెడా ఏకమైపోయాయి. జుట్టు పైకి దువ్వుకున్నాడు. పైజమా లాల్చీ వేసుకున్నాడు. లాల్చీలోంచి హాఫ్ బనియనూ, కండలు తిరిగిన దండలూ, భుజాలూ కనిపిస్తున్నాయి.

"వస్తావురా?" ఎర్రని కళ్ళు చికిలించి చూస్తూ అడిగాడు.

రూపమే వణుకునేట్టుగా వుందంటే... గొంతుకూడా కసిరినట్లుగావుంది. బుగ్గన కిళ్ళీవున్నా సారావాసన గుప్పున వస్తోంది. కిళ్ళీ నములుతూంటే మీసాలు విచిత్రంగా కదులుతున్నాయి. కిళ్ళీ రసం మింగుతూంటే, మెడలో సన్నని దారంవలె వున్న బంగారుగొలుసు తళుక్కున మెరుస్తోంది.

"వినిపించలేదారా? వస్తవా.. అంటాన"

కర్కశంగా అన్నాడు.

"వీనికి బలముందని... రారా పోరా... అంటున్నాడు" నల్లగా ఎత్తుగా వున్న బలుపు నూ, హేండిల్‌మీదేసిన చేతి కడియాన్నీ చూ స్తూ అనుకున్నాడు భిక్షపతి.

"ఏందిరో... చెవుటోనివాబే" గట్టిగా అన్నాడ తను.

"యాడికి పోవాలె?" ఓరగా చూస్తూ అడిగా డు భిక్షపతి.

"చెవుటోనివి కావన్నమాట... ఏమొ మిర్రిమి ర్రి చూస్తానవా... దావకానయెన్క సందుకు పోవాలె... వస్తవా?"

"ఆ... వస్త... రొండ్రూపాయిలైతై"

"గీడిగ్గీడికి రొండ్రూపాయిలా? బొంబాయి నుంచో, ఢిల్లీనుంచో వచ్చిన్ననుకుంటానవా? లేకుంటే, నీ రిక్షా కారో, విమానమో అను కుంటానవా? నీకు రెండ్రూపాయిలెవరిస్తరు బే" దురుసుగా, గదిరించినట్లుగా అన్నాడత ను.

తాను రొండు రూపాయలడుగుతే, అతనొక రూపాయి ఇస్తానంటాడనీ.. రూపాయయినా వెళ్ళాలనీ అనుకున్నాడు భిక్షపతి.

ఇప్పుడతను రొండ్రూపాలిచ్చినా పోగూడద నుకున్నాడు.

"రొండ్రూపాలిస్తెరా... లేకుంటెలేదు..." హేండిల్ మీద చేతులేశాడు భిక్షపతి.

"అబే సాలే... గీడిగ్గీడికి రొండ్రూపాయ లంటానవ్... గట్లయితె రోజుకు ఎన్ని సంపా దించుతానవురా... నూరు సంపాయించుతా నవా? మాకేలొడే... ఒక్కపాలే బంగ్లాలు కడ్తన నుకుంటావ్‌ర సాలెగా" రిక్షా ఎట్లాపోతుందో చూస్తా నన్నట్లుగా గట్టిగా పట్టుకున్నాడతను.

"మాటలు మంచిగరానీ... ఇష్టముంటెరా... లేకుంటె పొమ్మని చెప్పిన గద" హేండిల్ మీది అతని చేతుల్ని విసురుగా తోసాడు.

క్షణంలో అతడు భిక్షపతి జబ్బ పట్టుకున్నా డు. అతని కళ్లు రెండింతలయ్యాయి.... మూ డింతలెర్రబడ్డాయి. అతని పెదాలు వికారంగా వణికాయి... పండ్లు పటపటలాడాయి. అతని చేయి భిక్షపతి జబ్బమీద గట్టిగా బిగుసుకుపో యింది. రౌద్రంగా.... భయంకరమైన మని షిగా అతడు మారిపోయాడు. ఇంతవరకెప్పు డూ అలాంటి మనిషిని చూడలేదన్నట్లుగా భిక్షపతిని కాసేపు చూశాడు.

"ఓహో... కొత్తోనివన్నమాట... నా సంగతి తెల్వనోనివన్నమాట... ఇపుడే తెలుపుత... నా సంగతిప్పుడే తెలుపుత" అంటూ ఒక్క గుంజు గుంజాడతను.

హేండిల్ వదిలి, తూలుతూ అతని దగ్గరకొ చ్చాడు భిక్షపతి.

వచ్చీరాగానే... అతడు ఎడమచేత్తో భిక్షపతి జుట్టందుకొన్నాడు. బలంగా కిందికివంచాడు. కుడిచేయి పిడికిలి బిగించి, వీపుమీద దభీద భీమని నాలుగు గుద్దులు గుద్దాడు.

భిక్షపతి బిత్తరపోయాడు. టీ కొట్టు దగ్గర ఐదారుగురు మనుషులు కొయ్యబారిపోయి నుంచుని చూస్తున్నారు.

రోడ్డుమీద వాహనాలు వస్తూపోతూనే వున్నాయి.

"ఏందిబే సాలెగా... ఇష్టముంటె రావాలె, లేకుంటె లేదా? నీకిష్టం లేకుంటె రావా? భాంచాత్... రిక్షా పట్టుకున్నంక యాడికిర మ్మంటె ఆడికి సంకంత నాక్కుంటురావాలె.... ఎరికేనా?" లాల్చీ చేతులు పైకి ముడుచు కుంటూ అన్నాడతను.

భిక్షపతిలో కోపం నువ్వున లేచింది. తోక మీద నుంచున్న తాచుపాములా... కాళ్ళనుండి తలదాకా... నరనరాల్లో కోపం రక్తమై ప్రవ హించింది.

దేవయ్య మాటలు గుర్తొచ్చి, కోపాన్నాపుకోవ డంవల్ల, అతని నరాలు తెగిపోతాయా అన్న ట్లుగా నలుపుతున్నాయి.

"తొక్కేటోన్ని నేను... నాకుగిడితె వస్త, లేకుంటే లేదు... ఏమో గంత జులుం చేస్తాన వేంది" భిక్షపతి మాటలు పూర్తికానేలేదు.

"మల్లట్లనే అంటవ్... మాదర్‌చోద్... రావా? రావుబే! ఎట్ల రావో చూస్త" అంటూ అతడు మళ్ళీ భిక్షపతి జుట్టందుకున్నాడు. చెంపమీద ఎడాపెడా కొట్టాడు. డొక్కలో బలంగా గుద్దాడు. ఛాతీమీద, ముఖంమీద, చెవుల మీద, గదువ కింద, వీపుమీద... అలా ఎక్కడపడితేఅక్కడ




గుద్దుతూ తంతూ వున్నారు.

దూరంగా నుంచున్నవారూ, రోడ్డు మీదాగిన వారూ సినిమా చూస్తున్నట్లుగా చూస్తున్నారు తప్ప.... ఒక్కరూ కూడా ఈ అన్యాయమేమని అడగడానికి రాలేదు. కనీసం ఆపడానికి కూడా రాలేదు.

భిక్షపతిలో సహనం నశించింది. కోపం లావాలా చిమ్ముకొచ్చింది. ప్రతీకారవాంఛ అతని కన్నుల్లో ఎర్రజీరలై పొంగింది.

ఒక్కదెబ్బతో జుట్టు పట్టుకున్న చేతిని దూరంచేశాడు. గబాలున ఎగిరి... అంతెత్తున లేచి, రెండుకాళ్ళతో అతని ఛాతీమీద బలంగా తన్నాడు. ఆ తన్నుకు అంత దూరంగా వెళ్లకి లాపడిపోయాడతను.

ఎలక్ట్రిసిటీ అంతవేగంగా జరిగిన ఈ సంఘటనకు అతడు షాకైపోయాడు.

మరుక్షణంలో భిక్షపతి ఎగిరి అతని ఛాతీ మీద కూర్చున్నాడు.

రెండు పిడికిళ్ళూ బిగించి, బుగ్గలమీద, గడ్డంకింద, ఛాతిమీద, కడుపులో... ధనాధనా అలా ఎన్నో గుద్దులు గుద్దాడు.

చేతులు నొప్పి పెట్టేదాకా... అతడు బుక్కలుబుక్కలుగా రక్తం కక్కుకునే దాకా భిక్షపతి అలా గుద్దుతూనే వున్నాడు.

చివరికతనిలో ప్రతిఘటనాశక్తి నశించిందని గ్రహించి లేచాడు. అతని ఛాతీ మీద కాలేసి నుంచున్నాడు.

కోపంతో పొంగి, చెమటతో తడిసి, ఎండకు నిగనిగా మెరిసిపోతోంది భిక్షపతి శరీరం.

"అరేయ్ సాలెగా... నీకే బలమున్నదనుకున్నావేరా... తిట్లు నీకే తిట్టొస్తదనుకున్నావ్. మాదర్‌చోద్... తొక్కేటోన్ని నేను... ఇష్టం వీడా...! ఇష్టముంటె అడిగినంతిచ్చి రిక్షా ఎక్కాలె... లేకుంటే సంకంత నాక్కుంట నడిసిపోవాలె... భాంచెత్... నీ అయ్య జీతగాన్నా, అవ్వ జీతగాన్నా మాకెలాడే... ఊకూకునే కొడుతుంటావ్? నాకు కొట్టరాదా? లంజొడక పీరివాగులేస్తవ్... యేమనుకున్నవో" అని కాలు తీశాడు భిక్షపతి.

ఇంకా పొకునుంచి తేరుకోకుండా... అయోమయంగా చూస్తూ... నవడుతూ కళ్లు మిటకరించి చూస్తూవున్నాడతను.

"తెల్లబట్టలేసుకొంగనే... కండలు మిసాలు పెంచంగనే, అందరికన్నా బలవంతున్నను కోకు... లోకంల నీకన్న బలవంతులు శాన మందున్నరు" ఎడమచేతితో నుదిటిమీది చెమటను తుడుచుకుంటూ అన్నాడు భిక్షపతి.

అలా చూస్తూ ఉండిపోయాడే తప్ప... లేవడానికిగానీ, మాట్లాడడానికి గానీ అతడు ప్రయత్నించలేదు.

తెల్లని అతని లాల్చీ రక్తంతో తడిసిపోయింది. ఇందాకా నున్నగా దువ్విన అతని తలంతా దుమ్ము నిండిపోయింది.

అతన్ని మరోసారి తన్ని... అటూఇటూ చూసి, కుడిచేత్తో వెంట్రుకలు మీదికి తోసుకుంటూ... రిక్షావైపు నడిచాడు భిక్షపతి.

రిక్షా ఎక్కుతూ మళ్ళీ అతన్నోసారి చూశాడు.

మోచేతులమీద నడుం వరకు శరీరాన్ని లేపి, భిక్షపతినే చూస్తూ వున్నాడతను.

వందగజాల దూరం నెమ్మదిగా వెళ్ళి, మరోసారి తిరిగి చూశాడు భిక్షపతి.

అతను కూర్చుండి రిక్షానే చూస్తూ ఉన్నాడు. ఇద్దరు ముగ్గురు అతన్ని లేపే ప్రయత్నం చేస్తున్నారు.

భిక్షపతి అలా తొక్కుకుంటూ... క్రమంగా రిక్షావేగాన్ని పెంచాడు.

ఇప్పుడతని మనస్సు హాయిగా వుంది. ఎన్నాళ్లనుంచో వున్నకసి తీరినట్లుగా అనిపించింది. ఎన్నాళ్ల బరువో దిగిపోయినట్లనిపించింది.

అంతలోనే దేవయ్య ఎదురుగా నిలిచినట్లనిపించి, అతనొక్కసారిగా [illegible].

'మళ్ళీ ఈ జిరదలో [illegible]?' అని అతను ప్రశ్నించినట్లనిపించింది.

"[illegible] మామా! [illegible] ... గట్టి నాలోని [illegible]" అన్నాడు భిక్షపతి.

[illegible] అర్తితో అతడు మౌనంగా [illegible] రిక్షా తొక్కుకుపోతున్నాడు.

[illegible] చేయకుండానే, తను తన [illegible] ఇప్పుడింక తనకు

టుంబం ఏంకావాలి?' అని విపరీతంగా భయపడిపోయాడతను.

'ఇప్పుడు మాత్రం తను ఏం తప్పుచేశాడు...? చీము నెత్తురు, ఇజ్జత్‌మానంవున్న ప్రతివాడూ తను చేసినపనే చేస్తాడు. అలాచేయకుండా... హీనంగా బతికేకన్నా... చావడంమేలు. ఇప్పుడేమయితే అదవుద్ది' అని తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు.

రిక్షా హాస్పిటల్‌దాటి... హనుమకొండ మలుపుతిరిగినది. అంతలో కుడివేపు సందునుండి, ఓ యువకుడు సైకిల్‌మీద వేగంగా వచ్చిరిక్షా నాపమన్నాడు.

అనుమానంవేసిన భిక్షపతి రిక్షావేగం పెంచాడు.

"తమ్మీ... తమ్మీ! రిక్షా ఆపు. నేను వగోన్నికాను... పరాయోన్నికాదు... నీవోన్నే" రిక్షా పక్కనే సైకిల్ నడుపుతూ అన్నాడు.

సూపర్‌బజార్‌వద్ద రిక్షానాపి... ఎందుకన్నట్లు చూశాడు.

"నీపేరేందో చెప్పుతమ్మీ" సైకిలాపిదిగాడతను.

"ఎందుకు?" అంటూనే పరిశీలించాడతన్ని.

సన్నగా, నల్లగా రోగిష్టివాడిలావున్నాడతను. ఎప్పుడూ కిల్లీ నములుతాడేమో... అతని పళ్లు నల్లగా గారపట్టి వున్నాయి. కళ్లు ఏనుగుకళ్లలా, లోతున ఎక్కడో కన్పిస్తున్నాయి. కీచుగొంతు. ఓపెన్‌షర్టు... పైజామాల్లో దిగబడిపోయాడు.

"ఎక్కడుంటవ్ తమ్మీ... నీపేరేంది?"

"ఎందుకు...?"

"నువ్వు కమాల్ చేసినవ్ తమ్మీ... గా సత్తిగాన్ని తన్నెటోడు లోకంలో పుట్టనేలేదనుకున్నం... నువ్వు... యమతన్నినవ్ తమ్మీ..."

"సత్తిగాడా..?"

"అవ్ తమ్మీ... కొత్తవాడదాదా... గాసత్తిదాదానే నువ్వు తన్నింది. ఎవల్నుబడితే వాల్లను ఏడిపిచ్చుకుంట... ఈఊళ్లో ఎగిడేసిన బూతమోలె తిరిగే సత్తిగాని మదం దించిన వియ్యాల... తమ్మీ! నువ్వెవలు? నీపేరేంది? నీ ఊరేంది?"

'తన ఆచూకీ తెల్సుకోవడానికి సత్తిదాదా పంపించిన మనిషికాదుకదా!' అని ఆలోచిస్తున్నాడు భిక్షపతి.

"నేను సత్తిగాని మనిషినికాను... నన్ను నమ్మతలేవా తమ్మీ? అవ్వతోడు తమ్మీ... నేను ఈర్సామన్న మనిసిని" కుడిచేతిని నెత్తిమీద అదుముకుంటూ అన్నాడతను.

" ఈర్సామన్నా? ఆయనెవలు?"

"అయ్యో... ఈరసామన్నకూడా తెల్వదా? గుట్టకింది ఈర్సాందాదా పేరే యిన్లేదా నువ్వు... సత్తిగాన్నెవలదువుల పెత్తరనుకున్నవ్? మాఈర్సామన్నే! ఈర్సామన్నే లేకపోతే, సత్తిగాడు ఇంకా బరిదెగెటోడు... నువ్వియ్యాల చేసినపని ఈర్సామన్నకు ఎరుకయితే ఎంత సంబ్రపడ్తడనుకున్నవ్‌నీ? ఇయ్యాల్నే నిన్ను మాగుంపుల కల్పుకుంటడు... చెప్పు తమ్మీ... నీపేరేంది? నువ్వు యాడుంటవ్?"

"నాపేరు బుచ్చపతి.. అనుమకొండలో వుంట"

"బుచ్చపతా? అనుమకొండా? అయితె పర్వలేత్తమ్మీ కుమార్‌పెల్లి కట్టమల్లు దాదా ఎరికేకదా!"

"నాకేదాదా ఎరుకలేదు... రక్ష తొక్కుకోని బతికెటోనికి దాదాలతోని పనేంది?"

"ఏదాదా ఎరుకలేదా? నువ్వేదాదా గుంపుల లేవా?" ఏదో ఒగుంపులో లేకుండా ఇంతసాహసం ఎలా చేశాడితడు? అనే ఆశ్చర్యంతో అడిగాడతను.

"నాకెవ్వలెరుకలే" మళ్లీ అన్నాడు భిక్షపతి.

"అయితె ఇప్పుడెరుకచేసుకోవాలె... లేకుంటె నీకు సావుమర్నమంత కష్టమైద్ది తమ్మీ"

"ఎందుకు?"

"బుచ్చపత్తమ్మీ... నువ్వు అసొంటి సొంటోన్నిగాదు తన్నింది... సత్తి దాదాను... సత్తిదాదా సంగతి నీకు తెల్వదు. వాడు కతర్‌నాక్ బాడుకావుగాడు... పగపట్టిండంటె అంతే... పానందీసెదాక ఊకోడు... ఎవ్వలూ ఎరుకలేదంటానవ్... కొంచెం జాగర్తగుండు తమ్మీ" కళ్లింత చేసుకుని అన్నాడతను.




''ఇంక నా తెరవుకొస్తడా? వస్తె... కాల్రెక్కలేకీలు కాకీలు ఇరిసి పారేస్త'' చులకనగా అన్నాడు భిక్షపతి.

''గట్ల అల్కగ తీసెయ్యకు తమ్మీ...! వాడు ఈ ఊరంతటికీ పెద్దదాదాగాడు. ఎందర్నో నంపిపారేసిండు. పెద్దపెద్దోల్లు వాన్ని కాపాడుకుంటరు... ఇయ్యాల వాన్తోని వాని మనుసులు లేరు... నీ అదురుస్టం మంచిదైంది... గట్ల బతికిపోయినవ్...ఇప్పుడు వానిబయంలే కుంటుండాల్నంటె నువ్వు ఈర్సామన్న గుంపులకలుఖాలె. నువీర్సామున్న మనిసివని తెలిస్తె, అనుమకొండల కట్టమలన్న నీతోటుంటడు. కాసిపేటల కరీమున్న కాపాడుతడు. గట్లనే ఈర్సామన్న మనుసులు యాడికి పోయినా నీయెంటుంటరు.... గప్పుడు నత్తిగాడు నీతెరువుకు రాడు''

అతడు చెప్పే పేర్లేవీ భిక్షపతికి తెలియదు. ఈ దాదాలకు వాడవాడలో మనుసులున్నారా? అని అతడాలోచిస్తున్నాడు.

''తమ్మీ.... ఆలోశన సేయి... ఇయ్యాల నువ్వు చేసినపనికి... నీకడుగడుక్కు పానబయముంటది. అడుగడుక్కు వాని మనుసులున్నరు... గట్లనే ఈర్సామన్నమనుసులున్నరు... గావాల్లే నిన్ను కాపాడ్తరు... ఆలోశనచేయి.. గోయిందరాజుల గుట్టకింది కొచ్చి, మల్లేసన్న ఇల్లేదని కుక్కనడిగినా చెప్తది. నేనే మల్లేసును. నువ్వు నాదగ్గరికిరా... నిన్ను తీస్కపోయి ఈర్సామన్నకు కల్పుత... నువుమాత్రం జాగర్తగుండు తమ్మీ... పోయొస్త'' అని భుజం చరిచీ సైకిలెక్కి వెళ్లిపోయాడతను.

భిక్షపతి రిక్షాను నెమ్మదిగా నడుపూ ఆలోచనలో పడ్డాడు. అతనిలో మళ్ళీ కల్లోలం చెలరేగింది.

'తను కొట్టింది ఒక పెద్దదాదానా? వాడు పగపట్టి మళ్ళీకొడతాడు... తననూ ఒక దాదా అనుకుంటున్నాడు... ఈ పోట్లాట ఫలితాలెలా వుంటాయి? తనకుటుంబం ఏంకావాలి?' భిన్నుడై రిక్షా నడుపుకుంటూ పోతున్నాడు భిక్షపతి.

'వాడే మదం పట్టి తనతో పోట్లాటకు దిగాడు... తానలాగే ఏమీ అనకుండావుంటే చంపేవాడు... తను బతుకాలంటే వాన్ని కొట్టకతప్పలేదు. తనుచేసింది తప్పుకాదు. ఇప్పుడీర్సామన్నను కలవాలా.! ఈ వీరస్వామెవరు? వచ్చినవాడు నత్తిదాదా మనిషేమో! సి.ఐ.డి.యేమో' ప్రశ్నలతో చికాకైపోయాడు భిక్షపతి.

అంతలో... మెడికల్ కాలేజివద్ద అతనికో సవారీ దొరికింది. ఆ సవారీని హనుమకొండ చౌరస్తాలో దింపి... రిక్షాను సినిమాహాలువేపు నడిపాడు.

'ఇంకా మ్యాట్నీ వదలలేదు... వదిలింతర్వాత సవారీలు దొరుకుతాయి!' అనుకుని అటూ యిటూ చూశాడు.

ఎదురుగా ఎత్తు గద్దెలమీదున్న హొటల్లో టీతాగుతూ కనిపించాడు నంద్యా.

భిక్షపతి ప్రాణం లేచివచ్చింది. రిక్షాను రోడ్డు దిగువకు తీసుకుపోయి... రావిచెట్టుకింద ఆపి... నంద్యాదగ్గరకొచ్చాడు.

చాయ్ తాగుతూ కొత్తవాడలో జరిగిన నంగతిని క్లుప్తంగా నంద్యాకు తెలిపాడు.

అది వింటూనే కొయ్యబారిపోయాడు నంద్యా.

''అరె... గావానితో నెందుకుపెట్టుకున్నావ్ భయ్... వాడు శాన కతర్నాక్గాడు'' భయపడిపోతూ అన్నాడు నంద్యా.

''నేనేడ పెట్టుకున్న? అంతయిన్నంక గూడ నీకు గట్లనే అనిపిస్తాందా? వాడే నాతోని పెట్టుకున్నాడు.'' అన్నాడు భిక్షపతి.

''ఎవలు ఎవలతోగాని పెట్టుకున్నా.. భయంనీకే కద''

భిక్షపతి ముఖంలో నెత్తురుచుక్కలేదు.

''నత్తిదాదా ఎవలనుకున్నావ్? మునిసిపల్ చెయిర్మేనుకు కుడిభుజం... అసలు నత్తిదాదా లేకుంటే, రెడ్డిసాబు మెంబరేకాకపోవు... అటెంక చెయిర్మెనూ కాకపోవు. గాఓట్లప్పుడు నువ్వులెవ్వుగానీ... ఎంత లొల్లయిందనుకున్నవ్...! ఎంతమంది పుర్రెలు పగిలినయో... ఎంతమంది కాల్రెక్కలిరిగినయో... ఎంతమంది నచ్చిర్రో... లెక్కలేదు'' చెప్పుకుపోతున్నాడు నంద్యా.

''రెడ్డిసాబుకు నత్తిదాదా... రావుసాబుకు ఈర్సామిదాదా... ఈ ఊళ్లోని దాదాలందరు రొండు గురుపులైపోయిన్రు... ప్రశారంచే

సిన్రు... తినిపిచ్చుడు... తాగిచ్చుడు... తన్నించుడు... సంపిచ్చుడు... ఓట్లు లొల్లిలొల్లిగ జరిగినయ్. ఆకరికి రెడ్డిసాబు చెయిర్మెనయిండు. అటెంక మల్లొచ్చినయ్ ఓట్లు... మల్ల గంతే... రావుసాబు ఎమ్మెల్లే అయిండు... గీరెండు గురువుల కొట్లాటలు పదిరోజులకోపాలి యాన్నో ఓకాడ జర్గుతనే వుంటయ్... గాకొట్లాటలల్ల తల్కాయెపెడితె... మనం బత్కుతమాబై" ముగించి ప్రశ్నించాడు నంద్యా.

మల్లేశు తనను కల్సిన సంగతీ... పీరస్వామి దాదాతో కలువుమన్న సంగతీ చెప్పాడు భిక్షపతి.

"ఈపాటికి ఈర్స్వాందాదాకు తెలిసిపోద్ది... మనిసినే తోల్తడో... లేకుంటె ఆయినే నీకాడికొచ్చి కలుస్తడో"

"ఈర్స్వామి దాదాతోని కలుద్దామంటవా?"

"ఇగొబై... ఎవలూ లేనోల్లకు, ఎక్ సిరంజన్ గాండ్లకు గివన్ని సాగుతయ్. రక్షతొర్కుకొని కుటుమాలను సాదుకునే మనరు గీ ధంధాలెందుకు చెప్పు.?" నిరాశపరిచాడు నంద్యా.

భిక్షపతి ముఖం వాడిపోయింది. అతని చెవుల్లో దేవయ్య మాటలు గింగురుమంటున్నాయి.

అంతలో మదునయ్య, నారాయణా అక్కడికి వచ్చారు.

లోలోపల కుమిలిపోతూ... మొదటీనుండీ తనపట్ల జరిగిన అన్యాయాన్ని గురించి ఆలోచిస్తూ... వాడిపోయివున్న భిక్షపతిని చూస్తూనే మదునయ్య ఏదో జరిగిందనుకున్నాడు.

నంద్యా భిక్షపతి సంగతిని క్లుప్తంగా చెప్పాడు.

టీ తాగడం ఆపి... నోరు తెరచుకుని, కాసేపలాగే వుండిపోయాడు మదునయ్య.

జరుగకూడనిది జరిగిందన్నట్టుగా వున్నాయతని చూపులు.

"ఇగోబై... తప్పో ఒప్పో జరిగింది. నన్నిప్పుడేం చేయుమంటరో చెప్పున్రి... మీరు చెప్పినట్లు చేస్త." తానే అన్నాడు భిక్షపతి.

అందరూ కాసేపాలోచించారు.

"నాకు జూడ... సక్కగ సత్తిదాదా దగ్గెరికే పోయి తెల్వక తప్పుచేసిన్నని కాల్లమీద బడుడు మంచిదనిపిస్తాంది. వాడు బరిదెగిన బద్మాశ్‌గాడు. మల్ల చెయిర్మేను మనిసి. ఇంకా ఎదురుదెబ్బ కొట్టకముందేపోయి బతిలాడుడు మంచిది" అన్నాడు నంద్యా.

"నీ యవ్వ గంతకంటె ఉరిబెట్టుకుని సచ్చుడు మంచిదిగాదుర.? గంతకంటె యీ సంబతుకే ముంటదిరా?" అసహనంగా అన్నాడు మదునయ్య.

భిక్షపతికి కూడా నంద్యా సలహాయేమాత్రం నచ్చలేదు.

"లేకుంటె ఈర్స్వాందాదా దగ్గెరికిపోయి... దినాం జగుడాలల్ల వుండుడు మంచిదంటరా?" అడిగాడు నంద్యా.

"వాని దగ్గరికెందుకూ... వీని దగ్గరికెందుకూ... తప్పు లేనప్పుడు బయపడి సచ్చుడెందుకు?" అన్నాడు మదునయ్య.

మదునయ్య మాటలు భిక్షపతికి నచ్చాయి. తన మనసులోని మాటనే అతడన్నాడు. 'నిజంగా... ఇందులో తన తప్పేంలేదు. తనను తానుకాపాడుకున్నాడంతే' భిక్షపతి కొంచెం తృప్తి పడ్డాడు.

"ఏమోబై... నాకు మాత్రం గదేమంచిదనిపిస్తాంది. మనమ్ ఒక్కనాడు రక్షతొక్కకుంటె ఎండిసచ్చే బత్కులు... గుట్టతోని గుద్దుకునుడెందుకూ... తల్కాయ పలుగ్గొట్టుకునుడెందుకు...?" నంద్యా కచ్చితంగా అన్నాడు.

"నీ అసొంటోల్లేగా గాడ్దికొడ్కులను గుట్టలు చేసిన్రు. కాల్లమీద బడి యీసం బతుకు బతుకుడుకన్న గుద్దుకోనే సచ్చుడు మంచిది... పానం మల్లమల్లపోదు... ఒక్కపాలె పోయేది." మదునయ్య అన్నాడు.

"గట్లనా... మరిగా సావు సంగతి నువ్వేచెప్పు...." అన్నాడు నంద్యా.

"మన రక్షయూనియన్‌కు చెపుకొని అందరమొక్కటైదాం...."

మదునయ్య మాటలు పూర్తి కాకుండానే పగలబడి నవ్వాడు నంద్యా. అందరూ అతడెందుకు నవ్వుతున్నాడో అర్థంకాక బిత్తరపోయి చూశారు.

"నీతెలివి తెల్లారినట్లేవున్నది... మన రక్ష యూనియన్ ప్రెసిడెంటెవలు... చెయిర్మేన్ మనిషి. సత్తిదాదా ఎవలు... గావాడు కూడా చెయిర్మేను మనిషే. గదటుపక్కకు బెట్టు... సత్తిదాదా సాయంలేందే మన రక్షయూనియన్కు ప్రెసిడెంటు అయ్యిండా మనోడు...? నీయవ్వ... మన యూనియన్ ప్రెసిడెంటుకు చెప్పుకుంటె... గొల్లోన్నిడిసిపెట్టి కటికోన్ని నమ్ముకున్నట్టుగుంటది'' అన్నాడు నంద్యా.

నంద్యా మాటల్లోని నిజం మదునయ్యకర్థమై మౌనంగా వుండిపోయాడు. భిక్షపతి ముఖం వెలవెలబోయింది.

''నాకుంకో ఉపాయం తోస్తాందిరా బుచ్చన్నా...! మనం యాడికీ పోవద్దు... ఏదాదా తోటీ కలువొద్దు. దినాం కొట్లాటలు కూడా వద్దు. సర్దార్ సాబ్గూడ చెయిర్మేను మనిసే. మీ దేవయ్యా మామేమో సర్దార్ సాబ్మనిసి. మీ దేవయ్యా మామను ఎంటబెట్కపోయి సర్దార్ సాబ్ను కలువు... గప్పుడు నువ్వు కూడ చెయిర్మేన్ మనిసివే అయితవ్. సర్దార్ సాబ్ ఎట్లనో అట్ల కలుపుతడు... ఒక్క గురువుల కొట్లాటలుండయ్... కిస్సాకతమైద్ది.'' అన్నాడు నారాయణ కల్పించుకుని.

నంద్యాకు కూడా ఈ ఆలోచన నచ్చి 'అవ్... అది బాగుంటది' అన్నాడు.

కాని... భిక్షపతి మాత్రం తనవీపుమీద ఎవరో చరిచినట్లుగా అదిరిపడ్డాడు.

'ఆనాడు సర్దార్ మనిషిని ఏమీ అనలేదు, తిట్టలేదు. తిడుతూంటే ప్రతిఘటించాడు. అంతమాత్రానికే పెద్ద గొడవైంది. అప్పుడు తన తప్పేమీ లేదు. అయినా తాము సర్దార్కు శత్రువులయ్యారు. ఇప్పుడు తాను సర్దార్ స్నేహితున్నే తన్నాడు. ఒక విధంగా సర్దార్నే తన్నాడు. చెయిర్మెన్ను తన్నాడు. మరి వాళ్ళ దగ్గరికే ఎట్లా పోవడం...? చచ్చినా సరే తాను సర్దార్ దగ్గరకు పోడు. అట్లని. వీరస్వామిని చేరి పగను ఎల్లకాలం బతికించడు. ఎక్కడకు పోయినా తను తలవంచాలి... గులాంగిరీ చేయాలి. అది తనకిష్టం లేదు. తప్పుచేయని తను తలవంచేది లేదు. చెయిర్మెనూ, సత్తిదాదా, వీరస్వామిదాదా, సర్దారూ, రిక్షా యూనియన్ ప్రెసిడెంటూ... అందరూ ఒక్కటే... ఎవడైనా తన తలవంచేవాడే. తానెక్కడకూ పోడు.... తలవంచకుండా ఒంటరిగా ఎదుర్కుంటాడు. తలవంచి హీనంగా చచ్చేబదులు...తలవంచకుండా వీరునిలా చస్తాడు... అంతే'



ఈ నిర్ణయం చేసుకున్న తర్వాత భిక్షపతికి కొండంత బలం వచ్చింది. ఇదివరకు మ్లానమై, వడలిపోయిన అతని ముఖంలోకి కొత్త కాంతి వచ్చింది.

''నే నెవ్వల్నూ కలువ.... ఎవ్వలుకూ చెప్ప. దోస్తులు కాబట్టి మీకు చెప్పిన. దారేదో అడిగిన. నాతో నుంటె నష్టమయిద్దనుకుంటె మీరుగూడ



నా అంటుకు రావద్దు. నా కార్నంగ మీరు కస్టపడొద్దు. కాని....నిజంగ నాది తప్పులేదని మీరు నమ్మితె.... మీకు నస్టంరాకుంట, నాకు సాయం చేయిర్రి. నేను చచ్చినంకనన్న నాది తప్పు లేదని.... మా మామకూ.... నాయినకూ తెల్వజెప్పుర్రి...'' అంటూ లేచి నుంచున్నాడు భిక్షపతి.

వాళ్ళతని మాటలు విని దిమ్మెరపోయి చూస్తుండగానే ఇంకా మ్యాట్నీ వదలకపోయినా, గబగబా హెూటల్ మెట్లుదిగి, రిక్షాకేసి నడిచి, రిక్షా తొక్కుకుంటూ చౌరస్తాకేసి వెళ్ళిపోయాడు భిక్షపతి.

★ ★ ★

మధ్యాహ్నం నుండీ కొడుక్కోసం ఎదురుచూస్తూ కూర్చుంది గౌరమ్మ.

పొద్దుననగా వెళ్ళిన భిక్షపతి ఇంకా అన్నానికి రాలేదు.

రాయలింగు కూరలమ్ముకొని వచ్చి, భోంచేసి బజారుకెళ్ళాడు.

ఆలస్యమౌతున్న కొద్దీ ఆమెకు ఆదుర్దా ఎక్కువైపోతోంది.

'కొడుకు మళ్ళీ ఏదన్నా నెత్తిమీదేసుకున్నాడేమో. అందుకే ఆలస్యమైపోయిందేమో' అన్న అనుమానంతో ఆమె క్షణక్షణం వేగిపోతోంది.

కొడుకు విషయంలోనే కాదు ఇప్పుడామెకు ప్రతి విషయంలోనూ అనుమానం, ఆదుర్దా ఎక్కువైపోయింది.

రాయలింగు బాగాలేనప్పుడు మల్లికాంబ తెచ్చిన రూపాయలు ఎంతో ఆదుకున్నాయని అప్పుడు సంతోషించింది. కాని ఆ సంతోషం మరునాడే మాయమై, దాని స్థానంలో అనుమానం, ఆదుర్దాలు చేరాయి.

ఆ మర్నాడే పనికిపోనని మల్లికాంబ మొండికేస్తే... గుచ్చి గుచ్చి అడిగితే...ఆ పిల్ల రామారావింట్లో జరిగిన విషయాన్ని చెప్పేసింది.

"అంతేనా... ఇంకేమన్నా జరిగిందా?" అని భయపడుతూ తరచితరచి అడిగింది గౌరమ్మ. తన మీదా, తండ్రిమీదా, అన్న మీదా ఒట్టేయించుకుని మరీ అడిగింది.

మల్లికాంబ నిజం చెప్పినా ఆమె అనుమానం మాత్రం పూర్తిగా పోలేదు. ఆనాటి నుండి ఆమెకన్ని విషయాల్లోనూ అనుమానం కలుగుతోంది.

'ఊరు విడిచి రావడం తప్పయిందా?' అన్న ఆలోచన మొదటిసారిగా కలిగి ఆమె మదనపడిపోతోంది.

'మల్లికి పెండ్లి చేయాలి... ఓ అయ్య చేతుల పెట్టాలి... బంగారు తీగెవలె పెరిగిన మల్లికాంబ మీద ఏ పాపపుకంట్లో, ఏ రాక్షసి చూపులోపడి ఆమె బతుకును సర్వనాశనం చేయకముందే... పెండ్లి చేయాలి' అని ఆమె ప్రతి నిమిషమూ అనుకుంటోంది.

అప్పటినుండి ఆమె కూతురును విడిచి వుండటం లేదు. తాను పనికి పోయేటప్పుడు కూడా ఎన్నో జాగ్రత్తలు చెప్పి పోతోంది.

ఇప్పుడీ అనుమానం.... 'కొడుకు ఇంకో వారం ఇంట్లోనే వుంటే బాగుండేది. పూర్తిగా కోలుకున్నాడో లేదో.... రిక్షా తొక్కుతుంటే పోలీసులు కొట్టిన దెబ్బలు లేచాయోయేమో.... ఎక్కడన్నా మూర్ఛొచ్చి పడిపోయాడో యేమో... మళ్ళీ పోలీసులు పట్టుకున్నారేమో' అన్న అనుమానాలతో అన్నం తినకుండా గుమ్మంలో ఎదురుచూస్తూ కూర్చుంది గౌరమ్మ.



# 8

భిక్షపతికి ఇంటికి పోబుద్ధికాలేదు...పోవాలంటే భయంవేస్తోంది కూడా.

'ఒక్కదినానికి ఒక్కదినమే ఆసరా' అనుకుని వచ్చాడు... కాని ఈ ఒక్కదినమే సమస్యను తెచ్చిపెట్టింది. ఈ ఒక్కదినం రాకపోతే ఈ కొట్లాట జరిగేదికాదు. తానీ బురదలో కూరుకుపోయేవాడుకాదు' అనుకుంటూ, ఆకలేసినప్పుడల్లా టీ తాగుకుంటూ, రిక్షా తొక్కుతూనేవున్నాడు భిక్షపతి.

అతని చెవుల్లో నంద్యామాటలు ప్రతిధ్వనిస్తున్నాయి. పగపట్టిన కతర్‌నాక్ సత్తిదాదా వెంటాడుతున్నట్లే అనిపిస్తోంది.

ఒక నిమిషం భయం...మరో నిమిషం తెగింపు... ఒక క్షణం అనుమానం... మరోక్షణం విశ్వాసం... కాసేపు తను తన కుటుంబంతో.... మరికాసేపు తనొక్కడే ఒంటరి కాకిలా...

రిక్షా తొక్కుతూనే రకరకాల ఆలోచనలతో, అంతులేని ఆవేదన ననుభవించాడు భిక్షపతి.

ఆ ఆవేదనలో కాలికాలి... మరిగిమరిగి... కరిగికరిగి...అతని నిర్ణయం మరింత గట్టిపడింది.

'బతికితే కుటుంబాన్నాదుకుంటాడు. లేకుంటే కుటుంబం బరువును తొలగిస్తాడు. కుటుంబం దుఃఖాన్ని శాశ్వతంగా ఒకేసారి పోగొడతాడు. చావో, బతుకో...ఒక్కటే తనకు మిగులుతుంది. చచ్చినా, బతికినా వీరునిలా, ఎవరికీ తలవంచకుండా వుంటాడు తాను'

ఈ నిర్ణయం కలిగింది భిక్షపతికి. ఆ తర్వాత అతనికెంతో శాంతినిచ్చింది.

ఈ నిర్ణయం కలుగగానే, అతడు షాపులో ఓ మంచికత్తిని కొనుక్కొని బొడ్లో దోపుకున్నాడు.

ఒక విధమైన తెగింపుతో అతని ముఖం




దేదీప్యమానంగా వెలిగిపోయింది.

సాయంత్రం దాకా తొక్కిలెక్కచూసుకున్నా డు భిక్షపతి. అతని వద్ద ముప్పైయైదు రూపా యలదాకావున్నాయి.

కొంత సంతోషంతో, మరికొంత విచారంతో అతడు ఇంటికి బయల్దేరాడు.

ఇల్లు అంతదూరముండగానే భిక్షపతికి కనిపించింది... ఓ చోట తండ్రీ దేవ య్యమామా... మరో చోట తల్లీ చెల్లీ విచారంగా కూర్చుని వున్నారు.

తనకు సత్తిదాదాతో జరిగిన కొట్లాట వీళ్ళకు తెలిసిందనుకున్నాడు.

అనుమానంతో, తడబాటుతో మెల్లగా వాళ్ళ వద్దకు వచ్చిన భిక్షపతిని అందరూ ఒకసారి చూసి, వెంటనే చూపులు మల్లించుకున్నారు. ఎవ్వరూ ఒక్కమాటన్నా మాట్లాడలేదు. కనీసం పల్కరించను కూడా లేదు.

భిక్షపతి డబ్బుతీసిమౌనంగా తల్లి చేతుల్లో పెట్టి లోపలికి నడువబోయాడు.

"ఇట్రారా... ఇటొచ్చి కసకూసో" అన్నాడు దేవయ్య.

మౌనంగానే వచ్చి కూర్చున్నాడు భిక్షపతి.

"అవ్‌గాని బుచ్చిగా...! మనమెంత, మన బతుకెంత...? ఊత్తె ఊరవుతలికి కొట్టుకపోయే బతుకుమనది. గసొంటప్పుడు... చిన్నలేదు, పెద్దలేదు... ఎవలతోని బడితె వాల్లతోని కొట్లా టకు దిగుడేనా.?" కోపంగానే మందలించాడు దేవయ్య.

ఏమీ మాట్లాడకుండా, నేలను చూస్తూవు న్నాడు భిక్షపతి.

"వాడుగాడు వీడుగాడు... గానత్తిదాదాతోనే పెట్టుకుంటావురా...? వాడెసుసంటోడే, ఎవ లకు దగ్గరోడే ఎంతమందిని కూనిజేసిండే, ఎంతమంది కాల్రెక్కలిరిసిండో... గివన్ని నీకెరి కేనా...?"

"అండ్ల నా తప్పేంలేదు మామా..." చెప్ప బోయాడు భిక్షపతి.

"నీ తప్పెందుకయితదే... నిన్ను గన్నందుకు తప్పు మాదిగాని" వెటకారంగా మధ్యలో అందుకుని పీక్షంతకాడు రాయు లింగు.

"నీది తిక్కనుకోవాల్నా... దిమాకనుకోవా ల్నా...? ఊరంతటినీ ఉచ్చబోయించెటోన్ని కొ డుతవ్... మల్ల తప్పులేదంటవ్" దేవయ్య గొంతు పెద్దదైంది.

"అవ్వతోడే... నామాటినుర్రి... ఊకూకెనే అవ్వెనక్కను తిట్టుకుంట మీదబడి వాడే ముందుగాల కొట్టిండు..."

"ఊకూకెనే ఎందుగ్గొడుతడు...? వాన్ని సిచ్చికుక్కగినకర్సిందా? వాడుగాడు వీడుగా డు.... పెద్దపులిని... నత్తిదాదాను పానాలమీద ఆసెపెట్టుకొనే కొట్టినవా.?" మధ్యలోనే అందు కుని అన్నాడు దేవయ్య.

"మీరు నమ్ముర్రి... నమ్మకపోర్రి... సత్తిగాడే గిత్తిగోడే నారు ముందుగాల తెల్వది... ఇది నిజం. అంతయిపోయినంక తెల్సింది... వాడు పెద్ద దాదాగాడని. అవ్వెనక్కను తిట్టినా... మీద బడి కొట్టి పానందీసినా ఊకోవాల్నంటాండ్రుగ దా...! ఊకుంటెవాడు పానందీసెటోడు. దెబ్బ లకాగలేక మీదబడి కొట్టిన... పానాల మీద ఆసె ఇడువుమంటాండ్రుగదా... ఇడుస్తతీయి ర్రి... అప్పుడు పోయేపానం ఇప్పుడు పోద్ది...గంతేకదనే" తీవ్రంగా అన్నాడు భిక్ష పతి.

భిక్షపతి ఇలా అనగానే అందరూ అవాక్క యిపోయారు. చూపులు తిప్పుకోకుండా అంద రూ అతన్నే చూస్తూవుండిపోయారు.

"అదికాదురా... నీ పానంబోతె మేం సంబ్ర పడెటోల్లమా...? నువ్వేడ పానాలుపోగొట్టు కుంటవో అనే మేం బయపత్తాంటిమి. పెద్దపె ద్దోల్లే వానికి బయపడుతాండ్రి... గావానితోని నువ్వుకయ్యంబెట్టుకుంటివి... నెత్తురు కక్కేట ట్లు కొడ్తివి. ఊర్లే గింతపోరనిగ్గూడ వాడెరుకే నాయె... నువ్వేమో తెల్వకుంట కొట్టిన్నంటా నవ్... మేమంటె నమ్ముతం... కాని లోకమెట్ల నమ్మాల్రా...?" దేవయ్యే ముందు కొలుకుని ఆవేదనతో అన్నాడు.

"అవ్వతోడు... నాయినతోడు...సెల్లె మీదొ ట్టు...నేను నిజం చెప్తున్నాను... గిదింట్లనాదిపై సంత గూడ తప్పులేదు. జరిగిందిట..." అంటూ జరిగిన సంగతంతా పూసగుచ్చినట్లు చెప్పాడు భిక్షపతి.

భిక్షపతి చెప్తున్నంతసేపూ అంతాకొయ్యబారిపోయివిన్నారు. అప్పుడుగాని వాళ్ళు భిక్షపతి దవడవాచి వుందన్న సంగతి గమనించలేదు. అందరి హృదయాలూ ఆర్తితో తల్లడిల్లిపోయాయి.

"నీశని నాశిడంగాను కొడుకా... గన్ని దెబ్బ లెట్లోర్సుకున్నవ్ కొడ్కా"...అంటూ భిక్షపతి దవడను తాకుతూ ఏడ్చింది. మల్లికాంబ అన్న భుజానికి తలానించి ఏడుస్తోంది.

"బుచ్చయ్యా! ఇంట్ల నీ తప్పులేకపోయినా... సత్తిగాని సంగతొచ్చెటాలకు అందరూ నోరుమూసుకుంటరు. వాని బయం గంతున్నది. అసలు గీ తప్పొప్పులెవలిసారిస్తర్రా... ఇసారించెటాలకే అంతయిపోద్ది. వాడు పగవడితె పానందీసెదాకూకోడు. అప్పుడే చెయిర్మేన్ సాబ్ చెప్పిపంపిండు... నన్ను పిల్సుకొని సర్దార్ సాబ్ అగ్గైమండివడ్డడు. రేపు మీగుడిసె పీకించి, ఊర్లెకెల్లి ఎల్లగొడ్తెట్లనోయేందో! ఎట్ల...ఏంచేయాలె...?" తలపట్టుక్కూచున్నాడు దేవయ్య.

"గుడిసె పీకితే వానికేందీ...అటెంక మేం బుచ్చమడుక్కుంటె వానికేంది...? వానికి రెక్కలొచ్చినయ్‌గదా... పెద్దోడయిపాయె" అన్నాడు రాయలింగు.

ఈ మాటతో విపరీతంగా గాయపడ్డాడు భిక్షపతి. కోపంతో కుతకుతలాడుతూ...తనింకేం మాట్లాడినా లాభంలేదని, మౌనంగా తలవంచుకు కూర్చున్నాడు.

కాసేపెవరూ ఏమీ మాట్లాడలేదు.

"అయిందేదో అయిందిగాని బుచ్చయ్యా... ఇక నువ్వావలికిపోకు. ఇంట్లనేవుండు. అట్లపోయి సర్దారయ్య కాల్లో గదువేపట్టుకొని, ఏదన్నచేసొస్త... వాల్లగ్గనుపడితె నల్లిని నలిపినట్టు నలిపినంపుతరు...గందుకే.... కన నేనొచ్చెదాక ఇంట్లనేవుండు" అంటూ లేచాడు దేవయ్య.

సర్దార్ దగ్గరకొద్దని చెప్పాలని నాలుక చివరిదాకా వచ్చింది భిక్షపతికి. కాని చెప్పలేకపోయాడు. అతని హృదయం భగభగమండిపోతోంది. 'తను తప్పుచేయకున్నా...తన వాళ్ళు తనను దోషిగా భావిస్తున్నారు' అన్న ఆలోచనతో అతడు కాలిన ఇనుములా కరిగిపోతున్నాడు.

కాసేపటికి గౌరమ్మలేచి... భిక్షపతిని లోపలకు తీసుకెళ్ళి అన్నంపెట్టింది.

అన్నంపెట్టి పక్కనే మాటాడకుండా, దుఃఖాన్నాపుకుంటూ కూర్చున్న తల్లిని చూడగానే భిక్షపతి గుండె చెరువైపోయింది. కన్నీటి నాపుకుంటూ, అన్నంకెలుకుతూ కూర్చున్నాడు భిక్షపతి.

"ఇదువరకు పడ్డ కష్టాలు సాలవని... మల్లగీకస్టం నెత్తిలపెట్టుకున్నవా కొడుకా...?" గౌరమ్మగొంతు వణికింది.

"నేనేం జేసిన్నే... పానం గాపాడుకున్న...గదితప్పెట్లయిద్ది? గది తప్పుగాదు... అసలు నేను ప్యాదోన్నవుడు తప్పు... రేసముండుడింకా తప్పు నాఅసొంటె ప్యాదముండకొడ్కులు బతుకుడే తప్పు.ఇటువానికి సుకముండది... వాని నుట్టునోల్లకూ సుకముండది..."గుడ్లనీరు గుక్కుకుంటూ అన్నాడు భిక్షపతి.

పొద్దుట్నుండీ భిక్షపతి ఏమీ తినలేదు. తనిప్పుడీమాట అనకుండా వుండాల్సింది' అనుకున్న గౌరమ్మ కడుపులో ప్రేవులు మెలివేసుకున్నట్లయ్యాయి.

"గంతమాటనకు కొడుకా... ఎట్ల కావాలనుకుంటె గట్లయిద్ది. నువ్వు మనాదిపెట్టుకోకు. అన్నంతిను. దేవయ్యమామ అన్నీ చూసుకుంటడు. ఏదోచేసి కాపాడుతడు" అంటూ కలిపిన అన్నాన్ని తీసి భిక్షపతి నోటికి అందించింది గౌరమ్మ.

భిక్షపతి హృదయం ఆర్తితో చుమ్మలు చుట్టుకుపోయింది. కన్నీరు ఉబికివచ్చి అన్నంలో పడుతోంది. తల్లి అందించిన ముద్దను నములుతూ....తల్లిని తదేకంగా చూస్తున్నాడు.

గౌరమ్మ మరో ముద్ద అందించింది. అలాగే తల్లి అందించే ముద్దల్ని నోటితో అందుకుంటూ, తల్లినేచూస్తూ అన్నమంతా తిన్నాడు.

రాత్రి భిక్షపతిని లోపలపడుకోబెట్టారు. గౌరమ్మా, మల్లికాంబలు అతని పక్కనే పడుకున్నారు.

అలా పడుకున్నారేకాని... ఎవ్వరూ ఒక్కక్షణం కన్నుమూయకుండా దేవయ్య రాకకోసం ఎదురుచూస్తున్నారు.

భిక్షపతిని ఒక విధమైన నిస్పృహ ఆవ




# నెక్టై తెచ్చిన తంటా



సృష్టిలో అనుకూల దాంపత్యానికి ప్రతీకలు వాళ్లేఅనిపించేది చూసే వాళ్లెవరికయినా. భార్యను విడిచి అతను ఎప్పుడైనా టూర్‌కి వెళితే—

''ఉమాప్రియా! నువ్వులేకుండా గడపడం దుర్భరంగావుంది. మనసంతా నీచుట్టూ తిరుగుతోంది. నిన్ను కలుసుకోవాలనే కోరిక నణుచుకోలేకపోతున్నాను'' అని రాసేవాడు.

ఏదైనా పార్టీకెళ్లి ఇంటికిరాగానే- ''పార్టీలో అందరిలోకి నువ్వేమహారాణీలా వెలిగిపోయావు'' అనేవాడు. భార్య కూడా ఒక్కరోజు భర్త సరిగ్గా భోజనం చేయకపోతే- ''నువ్వుచాలా చిక్కిపోయావుడియర్! పగలంతా ఆఫీసులో కష్టపడతావు. నువ్వు సరిగ్గా తినకపోతేనేనొప్పుకోను'' అని మారాంచేసేది.

ఇలా చల్లగా సాగిపోయేవారి ప్రేమమయ వైవాహిక జీవితంలో పెనుతుఫాను సృష్టించిందో 'నెక్టై'.... ఎలా?

చీకటిపడగానే బాటిల్ ఖాళీచేస్తూబాధను మర్చిపోతూ అతను, నిద్ర మాత్రలతో నిజాలనుంచి నిష్క్రమించచూస్తూ ఆమె గడపడానికి కారణం ఎవరు?

**బహుమతి పొందిన ఒరియాకథ 'నాణానికి మరోవైపు' మే నెల 'విపుల'లో చదవండి.**

# మరెన్నో ఇతర భాషా కథలతో...

## మే సంచిక

# విపుల

## రెండున్నర రూపాయలే

రించింది. అతని ఆలోచనలు ఒకచోట నిలువ కుండా, ఎక్కడెక్కడో తిరుగుతున్నాయి. దారిని వెతుక్కుంటూ పరుగెత్తుతున్నాయి.

పొద్దంతా అలసిపోయి... ఆలోచనల్లో పరుగెత్తి పరుగెత్తి అలసిపోయిన భిక్షపతి కళ్ళమీదికి మగతగా కాసేపు నిద్ర...

భిక్షపతి బతుకునుడిగుండంలో పడిపోయాడు. అతన్ని ఆ నుడిగుండం గిరగిరా తిప్పుతూ, అడుగున నోరుతెరచుకొని వున్న చావులోనికి నెట్టివేస్తోంది. తల్లీతండ్రీ ఆక్రోశిస్తూ ఒడ్డున నిలబడి, చేతులుచాచి తనకందీయడానికి ప్రయత్నిస్తున్నారు. అంతలో పెళ్లున శబ్దం... వాళ్ల కాళ్ళకిందిభూమి విరిగిపోయి వాళ్ళుకూడా తలక్రిందులుగా, అతనివేపు పడిపోయారు. అంతలో దేవయ్యమామ వాళ్ళకాళ్ల ందుకున్నాడు. భూమ్మీద బోర్లాపడిపోయి వాళ్లను పైకి లాగడానికి ప్రయత్నిస్తున్నాడు. దేవయ్యా పక్కనే నుంచుండి మల్లికాంబ గుండెలు పగిలేలా ఏడుస్తోంది.

ప్రవాహవేగం పెరిగింది. నుడితిరిగే వేగం ఎక్కువైంది. నుడితోపాటు గిరగిరా వేగంగా తిరుగుతున్న భిక్షపతికి తల్లిదండ్రులు కనబడటంలేదు చేతులు తనవేపు చాచి ఏడుస్తున్న చెల్లెలు కనిపించింది. అప్పుడు దేవయ్యా పడుకొనివున్న భూభాగంకూడా పెళ్లున విరిగిపోయింది. తల్లిదండ్రులూ... వాళ్లను పట్టుకున్న దేవయ్యా మామా ఒడ్డుతోసహా నుడిగుండంలోకి పడిపోతున్నారు. మల్లికాంబ హృదయ విదారకంగా పెద్దగా కేకవేసింది. ఆ కేక భిక్షపతి గుండెల్ని బద్దలుచేసింది.

ఒక్కసారిగా భిక్షపతికి మెలకువ వచ్చింది. పక్కన తల్లిలేదు... చెల్లెలు నిద్రపోతూ వుంది.

దేవయ్యా మామా, తల్లిదండ్రులూ పందిట్లో గుసగుసగా మాట్లాడుతున్నారు. ఆ మాటలు భిక్షపతికి సన్నగా వినిపిస్తున్నాయి.

"గట్లంటెట్లమరి... తిప్పలబడి, తల కాకపెట్టి కొడుకును బతికిచ్చుకోవాలె. వాని కోసం పుట్టినూరొదిలి గింతచేసినం... ఇప్పుడు కొడుకును పోగొట్టుకుందామా?" తల్లి అంటోంది.

"నువ్వన్నది నిజమేనే. కని యెంత తిప్పలు బడ్డా ఇది మనతోనయ్యే పనిగాదు అదెపాయె, యేదన్నా అమ్ముదామన్నా మనదగ్గరేమున్నదే" తండ్రి.

"గట్లనకు నీ బాంచెను... కన్నోల్లం మనమే యిడిసిపెడితె, వాన్నెవలు కాపాడ్తరు? మన బూమి ఊర్లె కుదువబడున్నది. ఒపాలిపోయి తెగనమ్ముకొని రా... అంతో యింతో వస్తది. ఇప్పుడు యాన్నన్నా... బతుకులు కుదువ బెట్టన్న అప్పుతీసుకుందాం. కొడుకును కాపాడుకుందాం... బూమమ్మిన పైసల్తోని అప్పు తీర్చుకుందాం. చెట్టంత కొడుకే పోయినంక గాబూమెందుకు మనకు? నీకాల్మొక్త... కాదనకు... నాకొడుకును కాపాడు" సన్నగా ఏడుస్తూ తండ్రిని బతిమాలుతోంది తల్లి.

"నాకు గదితోననే లేదు... అయితెమానె బూంపోయినా... ఆకరికి ఆడి యిల్లుపోయినా మంచిదే... నాకొడుకు బతికి బట్టగట్టాలె. కాని యిప్పటికిప్పటికి అప్పుపుట్టుడెట్ల?" తండ్రి గొంతులో ఆవేదన.

తన గొంతెవరో నులుముతున్నట్లనిపించింది భిక్షపతికి.

"ఓరి దేవన్నా...! చిన్నోనివైనా ఇప్పుడు నా తలిదండ్రాదులు నువ్వే. గీరూపాయల్ని యాన్నో ఒకాడ నువ్వే అప్పిప్పించురా... వడ్డీతోని చెల్లుగట్టుకుంట... తనువమ్మైన తీర్చుకుంట" తండ్రి ఏడుస్తూ దేవయ్యాను బతిమాలుకుంటున్నాడు.

"మీరు గంతగనమనాల్నానె? రూపాయల్ని మాట్లాడే వచ్చిన. ఒక్కలతోనయ్యే రూపాలా యేమన్నానా...? ఇద్దరిదగ్గెర మాట్లాడిన. మనక్కరాయె మరి... వడ్డీశాన చెప్పిన్రు... మాంటె ఇన్నూరు మున్నూరు ఎక్కువైతెయ్. పైసల్తల్లి ముండమొయ్య. పైసల్దేందిగనీ... నువ్వోనేనో కష్టపడి తేర్చుకోవచ్చు. కనీ గీపని అయ్యేదే నానె...?" దేవయ్యా సందేహించాడు.

"ఏ పని తమ్మీ..? ఏపని కాదంటానవ్ తమ్మీ...?"

"బుచ్చయ్యా గావాల్లందరి ముంగట సత్తిగాని కాల్లమీనపడాలె... తెల్లరెటాలకు పైసల్నా బుచ్చయ్యనూ ఒప్పజెప్పాలె... బుచ్చయ్యో పుకుంటడా అన్నదే నాకనుమానం"




"నాకొడుకును నేనొప్పిస్తతమ్మీ... బతిమాలో బామాలో, తిట్టో కొట్టో... యేడ్చో మొత్తుకొనో... ఒప్పిస్త... అంతలావైతె నేనుగూడొస్త"

"నువ్వెందుకక్కా.... వాడొప్పుకుంటే గంతే చాలు"

"నీ అవ్వకడుపు సల్లగుండ... నాకొడుకును ఒప్పిస్త. వాన్ని కాపాడు... బుచ్చపోడై బతుకుత డు" ఏడ్చింది గౌరమ్మ.

దేవయ్య ఆమెను చాలాసేపు ఓదార్చి వెళ్లిపోయాడు.

భిక్షపతి చెవుల్లో సీసం పోసినట్లని పించింది. మెదడు కరిగిపోతోందా... తల పగిలిపోతుందా... కణతలమీద సుత్తి దెబ్బలు... హృదయం ముక్కలుచెక్కలై పగిలిపోగా... గుండె చెరువై పోగా... ఆ మిగిలిన రాత్రంతా.... భిక్షపతి దీనంగా, జాలిగా, బాధగా, మౌనంగా ఏడ్చాడు.

'తమకంటూ మిగిలిపోయిన ఒకే ఒక ఆస్తి... ఎన్ని కష్టాలొచ్చినా చెల్లెలు పెండ్లి కోసం తప్ప అమ్మొద్దనుకున్న ఆస్తి... తండ్రి ప్రాణం... అది... ఆ భూమి తన కోసం అమ్ముడుకాబో తోంది

అలా కావడానికి వీల్లేదు. చచ్చినాసరే... తనువాని కాళ్లమీద పడడు... అసలు వాడేమి చేయడు. చేసినా ప్రాణంపోయేదాకా చీల్చి చెండాడుతాడు. సత్తిగాని ప్రాణం తీసే తను చస్తాడు... అంతేకాని భూమి అమ్మడానికి వీలు లేదు'

ఈ ఆలోచనతో అతనిలోని నిస్సత్తువ ఎగిరి పోయింది. ఆ దృఢమైన నిర్ణయం అతని కెంతో ధైర్యాన్నిచ్చింది. ఒక విధమైన శాంతి అతనిలో లీనమై పోయింది.

★ ★ ★

కిరణాల కత్తుల కొసలుతాకి, చీకటిశరీరం మీద ఏర్పడ్డ నెత్తురు మరకల్లా తూర్పువేపు ఎర్రని చారికలు... వెలవెల బోతున్న ఆకాశం... అంతకంటే వెలవెలబోయి తెల్లబడిపోయిన ముఖాలతో పందిట్లో రాయలింగు, గౌరమ్మలు. వాళ్ళ వెనకే వేదనతో దీనమై పోయినము ఖంతో మల్లికాంబ.

ఆ ముగ్గురూ... శరీరంలోని రక్తాన్నంతా పిండేసినట్లుగా, కళ్ళలోని కాంతుల్ని లాగేసిన ట్లుగా, జీవం లేనివాళ్ళలా...

రోడ్డుమీద రివ్వున దూసుకుపోతున్న వాహనాలు, ఆపసోపాలు పడుతూ పాలనూ, కూరగాయల్నీ మోసుకుపోతున్న గంపలూ, సైకిళ్ళూ, రిక్షాలూ...

రాయలింగుకు కూరగాయల ధ్యాస, గౌరమ్మకు పనిధ్యాస లేదు. ఎక్కడనుండో అప్పుడే అక్కడకు విసిరేయబడి, దిక్కుతెలియనిస్థితిలో వున్నట్లుగా... కాతరదృష్టులతో భీతమనస్కులై వాళ్ళు రోడ్డుకేసి చూస్తున్నారు.

పెనుతుఫానులో కొట్టుకుపోయేవారో, సుడిగుండాల్లో గిరగిరా తిరిగేవారో... ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై పోతున్నట్లుగా వాళ్ళున్నారు.

వాళ్ళాదశలో వుండగా... ఆదారాబాదారగా వచ్చాడు దేవయ్య.

అతడింకా కూర్చోకముందే అంతా బావురుమని ఏడ్చారు.

'భిక్షపతికేమో అయినట్లుంది... సర్దార్ పంపించిన కబురు సత్తిదాదా కందనట్లుంది' అనుకుంటూ... అదురుతున్నగుండెల్ని బిగబట్టుకుంటూ 'ఏమయిందని' అడిగాడు దేవయ్య.

"ఇంకేమున్నది తమ్మీ... బుచ్చయ్య ఇంట్లకెల్లి ఎల్లిపోయిండు తమ్మీ..." ఏడుస్తూనే చెప్పింది గౌరమ్మ.

"యాడికి పోయిండు...? ఎందుకు పోనిచ్చిను...?" ఒక్కసారిగా అదిరిపడి అడిగాడు దేవయ్య.

"వానికాల్ల మీనబడి నేను కుక్కబతుకుబతుక... చెల్లెపెండ్లి కుంచిన బూమమ్మనీయి... అనుకుంట... ఎంత బతిలాడిగీమాల్నాయిన కుండా యెల్లి పోయిండురా..." రాయలింగు.

"పైసలసంగతి వానికెందుకు చెప్పిన్రే...?"

"మేం చెప్పలేదురా దేవయ్యా...! ఎట్లతెలిసిందోయేమో! నామాటిన్రా... బూమబెంక సంపాయించుకుందాంరా... అని ఎంతన్నా... ఊహూ... ఇనకుంటా పోయింటు"

"రాయలింగు బావా! లే... పోయి ఊరంతా ఎన్కులాడివాన్ని పట్టుకొద్దాంపా" లేవబోయా

డు దేవయ్య.

"వాడు రాడురా... తనకోసం ఎన్కులాడితే రైలుకింద తల్కాయిబెట్టి పానందీసుకుంటన న్నడు" అంటూ ఏడుస్తూ మోకాళ్లమీద తలపెట్టుకున్నాడు రాయలింగు.

నీ యవ్వ... యేశం తల్లిపెండ్లం ముండ మొయ్య... వాన్నిగా ఉరుకులాటే గింత నాశెడం జేస్తాంది ఎట్ల... ఇంకేంజేతు? పది గంటలు టైమిచ్చిన్రు... పదిగంటల్లోపల వాడు దొర్కుతడా...? దొరకకుంటెట్ల... పానాలతోని బతుకుతాడా..." అనుకుంటూ పరుగెత్తుతున్నట్లుగా వెళ్ళిపోయాడు దేవయ్య.

★ ★ ★

రిక్షా తీసుకొని పాత అడ్డాకు కాక, మరో అడ్డాకుపోయాడు భిక్షపతి.

'ఇవ్వాలటితో తన రిక్షా ప్రయాణం ఆఖరు కావాలి... లేకుంటే కొత్తగా మళ్ళీ మొదలవ్వాలి' అనుకున్నాడు.

'ఇవ్వాళ బయటికి పోవద్దని తల్లీ, తండ్రీ బతిమాలారు... కాని తను? భయంబతుకును పాతరబెట్టాలని వచ్చేశాడు' అతని చెవుల్లో తల్లిదండ్రుల మాటలింకా గింగురుమంటున్నాయి.

"బుచ్చయ్య! నామాటిను నాయినా... ఏగిర పడకు బిడ్డా...! నీమీదనే పానాలు పెట్టుకొని బతికే మమ్ములనన్నాలం చేయకురా... నీకాల్లు మొక్కుత. ఇయ్యాలొక్కనాడింట్లుండురా..." అన్నాడు తండ్రి.



"వాల్లు పావనాచ్చి ముండకొడ్కులట కొడుకా... పానందీత్తరటకొడ్కా... పోకు బిడ్డా! అదె పాయె... దేవయ్య మామొచ్చెదాకానన్న ఉండు నీబాంచెను..." అంది తల్లి.

వాళ్లలా బతిమాలుతుంటే తనేమన్నాడు...?

"మీరూకూకెనే బయపడుతాంద్రే... ఆ లంజొడ్కులు నన్నేంచేయరు. బయపడ్డోన్నే బయపెట్టుకుంటారు...లోకంల గావాడొక్కడే కాదు... బలవంతులు శానమందున్నరని వానికి తెల్సిపోయింది. ఇంకా తెల్వకుంటే తెలజెప్పుత... మీరు బయపడకుండ్రి" అని ధైర్యం చెప్పాడు.

"గావాడేమో చేస్తాడని.. తాతలు సంపాయించిన బూమిని అమ్ముతనంటె నేనూకోను నాకోసం అప్పుజేసుడు వద్దు. నాచెల్లె బతుకు నాశిడం కానియ్య. మీరింతజేసి పైనలిచ్చినా... నేనుమాత్రం, పానంబోయినా వాని కాల్లమీన పడ. మీరెన్కులాడినా మీకుదొర్క... దొర్కినా రాను. నన్నాపకుండ్రి... అపుతె నన్ను నంపుకుతిన్నంతొట్టు... నాకోసం మీరు తిరిగినట్టు తెలిస్తె రైలుకింద తల్కాయబెడుత..." అంటూనే, వాళ్ళు దిమ్మెరపోయి చూస్తుండగానే మరో అవకాశం ఇవ్వకుండా తను రిక్షా తీసుకుని వచ్చేశాడు.

'దేవయ్య మామ రావచ్చు... సంగతి తెల్సుకుని వెదుకుతూ వుండవచ్చు... తాను అడ్డా మార్చాడు. ఇప్పుడు రోజువెళ్ళే దిక్కు వెళ్ళవద్దు. ఒక్కచోట చాలాసేపు ఉండవద్దు. సవారీలు దొరక్కపోయినా... స్థలం మారుస్తూ వుండాలి అనుకున్నాడు' భిక్షపతి.

పగవారినుండేకాక... తనవారినుండి కూడా తప్పించుకు తిరాగాల్సివచ్చిన తన పరిస్థితి తలచుకుని తనమీద తానే జాలిపడ్డాడు.

'సత్తిగాని మనుషులు ఊరినిండా వున్నారు. ఇప్పుడో అప్పుడో మీదపడతారు. వాళ్ళ బలమెక్కువైతే చంపుతారు. వాళ్ళ కోపం పోతుంది... పగపోతుంది. లేకుంటే తనతో బాగా తన్నులు తింటారు. ఆ తర్వాత తన తెరువుకురారు... అట్లయినా పగపోతుంది. ఆ పగను పోగొట్టుకునే తనింటికి పోవాలి' అనుకున్నాడు భిక్షపతి.

'నిజంగా తన ప్రాణమే పోతే... చాలా పోతాయి. తాను చచ్చింతర్వాత కోపంలేదు, పగలేదు, కష్టంలేదు... దేవయ్యమామ చెప్పిన బతుకు... బతుకుపోరూలేదు'

'తను చస్తే... తల్లిదండ్రులకు తనవల్ల దుఃఖంలేదు. భూమమ్మేదు లేదు. అప్పులేదు. చెల్లె పెండ్లి సులభంగా అయిపోతుంది'

ఇలా ఆలోచించుకుంటూ బొడ్లోని కత్తిని ఓసారి తడిమి చూసుకున్నాడు భిక్షపతి.

అంతలో... రెడ్డి కాలనీకి పోయే ఓ సవారీ దొరికింది.

అక్కడినుండి యూనివర్సిటీ, నక్కలగుట్ట, అదాలత్, సుబెదారి, నయీంనగర్, కుమార్పె

ల్లి... అలా పదకొండు గంటలదాకా రిక్షాతొక్కాడు భిక్షపతి.

దారిలో హొటల్‌లో టీ తాగుతుంటే వచ్చాడు మదునయ్య.

బలవతంగా నచ్చజెప్పి, మెయిన్‌రోడ్డు గుండాకాక, కొత్తూరు సందులు తిప్పి, యూనివర్సిటీ రోడ్డుగుండా టీబీ హాస్పిటల్ వద్దవున్న తన గుడిసెకు తీసుకువచ్చాడు.

గుడిసెలోపల గడంచె మీద కూర్చోబెట్టి బీడీ ఇచ్చాడు.

"నతిగాని మనుసులు నీకోసం ఎన్కులాడుతాంద్రు... కనిపించిన రక్షోన్నల్ల 'బుచ్చపతెక్కడున్నడు' అని అడుగుతాంద్రు..." నెమ్మదిగా చెప్పాడు మదునయ్య.

మౌనంగా తలవంచుకు వింటున్నాడు భిక్షపతి.

"నువ్వందరికి తెల్వకపోవుడు మంచిదయింది. కాని, నువ్వు తెలిసి నోల్లందరికి నీకత తెలిస్తే మంచిగుండు. ఎవలో ఒకలు నీజాడ చెప్పుతరు.

ఒకసారి తలెత్తిచూసి మళ్ళీ తలదించుకున్నాడు భిక్షపతి.

"నిన్నరాత్రి మన లీడర్... అదే మన రక్ష యూనియన్ ప్రెసిడెంట్ దగ్గరికి పోయికల్సిన... నీసంగతి చెప్పిన..."

కొంచెం ఆశతో తలెత్తాడు భిక్షపతి.

"నందెగాడు చెప్పినట్లే అయింది. అప్పటికే ఆయిన్ని సర్దార్ పిలిపిచ్చుకున్నడట. చెయిర్మెన్ సాబ్, ఎవ్వలు నీకుసైడు చేయకుంట చూడమని చెప్పిండని చెప్పిండట...?"

"మరి... మన ప్రెసిడెంటేమన్నడు?"

"ఏమంటడు...? రక్షదొక్కుకోని బతికెటోనికి, గింతమదం పనికిరాదు... గిసొంటి కనరుగాడి కొడ్కులు చెయ్యంగానే రక్షోల్ల నోర్లల్ల మన్నుబడ్తది... వాన్ని మన యూనియన్లకెల్లి తీసిపారేసిన ఎవ్వలు వాని సైడు చేయొద్దు... అన్నాడు"

భిక్షపతి మళ్ళీ తలవంచుకున్నాడు.

"వాడు గట్లన్నడని ఎవ్వలు నీతో నుండరనుకోకు... రాములు, మంగ్యా, పాండ్యా, సీతారాం... ఇంక కొంతమందిని కూడపట్టిన" ధైర్యం చెప్పాడు మదునయ్య.

భిక్షపతి చిన్నగా నవ్వాడు... ఆ నవ్వులో జీవంలేదు.

"ఎందుకట్ల నవుతానవ్...?"

"నీ పిచ్చిగాని మదునన్నా... మీరందరు పొద్దుమాపులు ఇడువకుంట నాతోనుంటరా...?"

"ఎందుకుండం...? అసలేదో ఓటి తేలెదాక నువ్వు రక్షెందుకు తొక్కాలె...?"

అలా సముదాయించాడేకాని... మదునయ్య మనసులో కూడా 'ఎంతకాలం కాపాడగలం?' అన్న ఆలోచనవచ్చి, అతని ముఖం ముడుచుకుపోయింది.

"అంతేసాలు... గాలికి పోయేకంపనెందుకు అంటించుకోవాలె అనుకోకుంట... మీరన్న నన్ను కాపాడుతనంటాంద్రు... నాకు గదిసాలే మదునన్నా..." ఆర్ద్రచిత్తంతో అన్నాడు భిక్షపతి.

అతని కళ్ళు ఊటచెలిమల్లా నిండి, కన్నీరుకిందపడేందుకు సిద్ధంగా వుంది.

"బెంగటీలకు బిడ్డా... అన్న నాకంత చెప్పిండు. అన్న చెప్పినట్లిను... అన్నం తిందురు రాంద్రి" అంది మదునయ్య తల్లివచ్చి.

ఆమె భిక్షపతి చేత కొసరికొసరి తినిపించింది.

భిక్షపతికి తల్లిగుర్తొచ్చింది... వస్తున్న దుఃఖాన్నాపుకున్నాడు.

"కొన్రోజులు నువ్వు రక్షతొక్కొద్దు..." అన్నాడు మదునయ్య.

భిక్షపతి అందుకొప్పుకోలేదు. తప్పకుండా వచ్చే ఆపద ఎప్పుడొస్తుందా అని ఎదిరిచూసే బదులు, వెంటనే ఎదుర్కొని తాడోపేడో తేల్చుకుంటానన్నాడు.

తను మరికొందరు రిక్షా స్నేహితుల్ని జమ చేసేదాకా, కనీసం ఆ ఒక్కరోజన్నా... ఎవరికీ కనబడకుండా తన ఇంట్లో వుండమని మదునయ్య సముదాయిస్తూ బతిమాలాడు.

"తెల్సి తెల్సి అగ్గిలచేయిబెట్టొద్దు బిడ్డా... సల్లారెదాక సూడు. గీ ఒక్కరోజుకేమాయె... ఈన్నేవుండుకో..." మదునయ్య తల్లి అంది.




భిక్షపతి ఒప్పుకోక తప్పలేదు. మదునయ్యా తల్లికీ, భిక్షపతికీ జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడు.



# 9

ఉదయమనగా వెళ్ళిన దేవయ్యా సాయంత్రం తిరిగొచ్చాడు.

నీరసంగా నడిచొస్తున్న దేవయ్యను చూడగానే తమకేమీ మంచి జరుగలేదని అర్థమైపోయింది రాయలింగు దంపతులకు.

కన్నీళ్ళింకిపోయాయన్నట్లుగా వున్న చూపులతో గౌరమ్మవుంది. ఎలాంటివార్త వినాల్సొస్తుందో అన్న భయంతో, గుండెలు బిగబట్టుకొని చూస్తోంది మల్లికాంబ.

రాయలింగు అడగాలనుకొనీ అడుగకుండా ఆత్రమైన మనస్సుతో దేవయ్యాకేసి చూస్తున్నాడు.

"పొద్దట్నుంచేమన్న తిన్నరాలేదే మల్లవ్వా...?" అందరి చూపుల్నీ గమనించి, గోడకొరిగి కూర్చుంటూ అడిగాడు దేవయ్యా.

ఏమీ తినలేదన్నట్లుగా చూపులతోనే చెప్పింది మల్లి.

"ఇంతవండి నువ్వన్న తినిపించొద్దా? జప్పున వండుపో... నేనుకూడ యీడనే తింట" అన్నాడు దేవయ్యా.

మల్లిలేచి లోపలికి నడిచింది.

"మమ్ముల ఇంకా తినుకుంట బతుకుమంటానావుర?" గద్గదస్వరంతో అడిగాడు రాయలింగు.

"అదె.... తిండేంజేసిందే? సావు వచ్చేనాడే వస్తదిగాని... కూడుగ్గబట్టి సచ్చుడు మంచిదిగాదు...?"

"సర్దారయ్యేమన్నడు తమ్మీ...?" అడిగింది గౌరమ్మ.

"ఏమంటడక్క...? బుచ్చిగాన్ని తెచ్చి అప్పజెప్పమన్నడు. వానికోసం తిరిగితిరిగి కాల్లరిగిపోయినయ్... గిటేపోయిండంటరు, ఆడికిపోతె వుండడు... ఊరంతా తిరిగిన" అతడెంత అలసిపోయాడో అతని మాటలే తెలుపుతున్నాయి.

"సర్దారు కీ సంగతి చెప్పినవా మరి...?" అన్నాడు రాయలింగు.

"ఆ... చెప్పిన. అగ్గిమీద గుగ్గిలమైపోయిండు. రాత్రి వరకొప్పగించకపోతే... రెప్పొద్దుగాల గుడిసెపీకిస్తడట... పోలీసులల్లపెత్తడట"

"మల్ల పోలీసులా... నా కొడుకును వాల్లు బత్కనిస్తరా...?" గౌరమ్మ మధ్యలోనే అడిగింది.

"నాకు జూడ పోలీసులకు దొరుకుడే మంచిదక్క.... అయింత పానాలన్న దక్కుతయ్..."

"అయ్యో... ఎట్లజేసుకుంటివి కొడుకా...? ఏం రాతడు క్కొచ్చుకుంటివ్‌కొడ్కా...?" కడుపు కోతతో వివశురాలైంది గౌరమ్మ.

"అదెపాయె... గుడిసెపీకినా మంచిదేకని.. వాన్నిడిసి పెడితే మంచిగుండు... మా ఊరుకుపోయి బతికిచ్చుకుంటం... గీ సంగతి సర్దారయ్యకు చెప్పకపోయినవ్‌రా దేవన్నా" అన్నాడు రాయలింగు.

"ఎన్నడుగాల్నో అన్నడిగిన... ఎంత చెప్పాల్నో అంత చెప్పిన..." అంటూ లేచాడు దేవయ్యా.

"మల్లయాడికి పోతానవ్‌రా....?"

"యాడికిలేదే... గుడిసెలోల్లతో నోపాలి మాట్లాడొస్త..." అంటూ గుడిసెలకేసి వెళ్ళిపోయాడు దేవయ్యా.

అరగంటలో రాయలింగు పందిట్లో, దేవయ్యతో పాటు పన్నెండు మంది గుడిసెవాసులు చేరారు. మరికాసేపటికి కొంతమంది ఆడవారూ, పిల్లలూ గుంపుగా చేరారు.

దేవయ్యవెంట అరవైయేళ్ళ సాయిలూ, ముప్పైయేళ్ళ శివయ్యా వచ్చారు. వారిద్దరి మాటా గుడిసెవాసులకు ఎంతో గురి.

అంతా అక్కడా ఇక్కడా సర్దుకుకూర్చున్నారు. కొంచెం కొంచెం తెలిసిన భిక్షపతి సంగతి మాట్లాడుకుంటున్నారు.

"సర్దారయ్యేమన్నడ్రా దేవయ్యా? పోరన్ని గీ ఒక్కపాలి 'కాపాడుమనకపోయినవ్...!'" సాయిలు కదిలించాడు.

"మాగన్ననే... 'ఓరిదేవా...! అయిందానికి కానిదానికీ అడ్డంరాకు. మీకు పూర బయబక్తు ల్లేకుంటయినయ్... ఎవల దయతోని ఈడ గుడిసెలేసుకోని బతుకుతాంండ్రో... వాళ్ల కిందికే నీల్లు తెస్తాంండ్రు, చియిర్మెన్‌సాబ్‌కే ఎసరుపెడుతాంండ్రు... ఇగ మిమ్ముల పాపమనొద్దు...' అని శానశాన సదివిండు.." చెప్పాడు దేవయ్య.

"నువ్వొకెనే యినుకుంటకూసున్నవ్... అవ్ గాదే...?" వెటకారంగా అడిగాడు శివయ్య.

"ఎందుకూకుంటరా..? బుచ్చిగాని తప్పులేదు... పైసంతగూడలేదు. ఇర్గ తాగి అవ్వనక్కను బూతుగడుక్కొంట, మీదబడి సావగొడుతాంటె పానంగాపాడుకోనీకి బుచ్చయ్య చెయిలేపిండు.... తప్పొదిక్కుంటె, సిచ్చొదిక్కేయకుర్రి... అని కాల్లు గదువలు పట్టుకోని బతిలాడిన..."

"అయితేం జేస్తడటమరి...?"

"నాయాన్నాయాలు లెక్కబెడుతాంండ్రు... మునిసిపాలిటీ జాగల గుడిసెలేసుకునుడు నాయమా...? ఆ గుడిసెలల్ల సంసారాలు చేసుకుంట, పిల్లల గనుకుంట ఆనందంగుండుడు నాయమా...? బేమాన్ గాడ్దికొడ్కులారా! మీ అందరికీ నేను అప్పులియ్యాలని యాడరాసున్నదిరా... అని కసురుకున్నడు"

"గీ బూమి చెయిర్మెనోని అయ్యదా... సర్దారోని తాతదా. ఊకెనేపడున్న సర్కారోని జాగల గుడిసెలేసుకున్నం... అప్పులిచ్చిండంటె... ఊకెనే ఇచ్చిండా...? వంగబెట్టి వడ్డీవసూలు చేసుకుంటలేడా...?" శివయ్య గొంతులో ఆవేశం రెపరెపలాడింది.

"ఉన్నోల్ల మాటలు పల్లేరుగాయోలె ఎటేసినా గుచ్చుకుంటైరా శివయ్యా? అదట్లుంచుగని... అందరి అనగల్లమాటేమన్నవే దేవన్నా...?" ఇంకొకతనడిగాడు.

"ఏమన్నా మంచిగలేదు... బుచ్చిగాన్ని పట్టుకొచ్చి కాల్లమీన బడేస్తరో... రాయలింగు గుడిసె పీకి ఎల్లగొడ్తరో.... గారొండువనులల్ల ఏ పనిజేస్తరో మనందరం తెల్సుకోవాల్నట...."

"గుడిసె పీకుడానికి వాడెవ్వడో..." అన్నాడు శివయ్య.

"వాడంటెవాడే వచ్చి పీకుతడా..? మునిసిపాలిటోల్లతోని పీకించుతడు..."

"పీకనియ్ చూద్దాం... నీయవ్వగంతా గమా...?"

"ఓరి పిలగాండ్లు! అనోసరంగ ఏల్లుబెట్టి ఎలుపుచేసుకోకుర్రి. వాల్లొక్కటి పీకుదామనొస్తె... పది పీకెటట్టు చేయకుర్రి. సమందం లేనోల్లు సమందం లేనట్టుగనే వుండాలె" అన్నాడు సాయిలు.

"గట్లనా...? మరేం జేయాల్నో కస చెప్పకపోతివీ...? రాయలింగు మామ గుడిసె పీకుమనే కద... నువ్వనేది?" శివయ్య కోపంగా సాయిలు కేసి చూస్తూ అడిగాడు.

"రాయలింగును దిక్కులేనోన్ని చేయమని నేనెట్ల చెప్పుత. గట్లకాదని అందరి గుడిసెల్ను పోగొట్టుకోమని ఎట్లచెప్పాలె...?" సాయిలు నిదానంగా అడిగాడు.

"సాయుల్తాతా! అసలు మన గుడిసెలెందుకు పోతయే...? ఈడ కంపిన్లుకడుతాంండ్రా, ఆఫీసులు కడుతాంండ్రా...? లేకుంటె పంటలుగిన పండించుతాంండ్రా? నీయవ్వ... ఎందుకక్కరాని బూమిని సమానం చేసుకున్నం. అప్పుసప్పుజేసి గింత నీడేసుకున్నం.... సర్కారోని బూమిల బతుకుతానంగాని, వాల్లవీల్ల బూమిలగాదు" ఒక యువకుడు సాయిలును సముదాయించే ప్రయత్నంచేశాడు.

"ఓర్వారి... నువ్వన్నది నిజమే. మనం సర్కారోని బూమిల్నే బతుకుతానం. కని... ఇన్నాల్లబట్టిలేంది, ఇయ్యాల్నె మన గుడిసెల్ను పీకుతమని ఎందుకంటాంండ్రా.కస ఆలోశనచేయిర్రి బుచ్చిగాన్ని లొంగదీయాల్నంటె, రాయలింగు గుడిసె పీకాలె.. రాయలింగు గుడిసె పీకాల్నంటె మనందర్ని లొంగదీయాలె...

మనందర్ని లొంగదీయాల్నంటె, మనగుడి





సెల్ను పీకాలె... అగొ... గంత రామాండెమున్న దిండ...'' అన్నాడు సాయిలు.

''పోరడింట్లకెల్లి యెల్లిపోయె... ఇంకా గావాడీ యింటిమని సెనా?'' ఒకావిడ అడిగింది.

''బుజ్జిగాడింట్లకెళ్ళి ఎల్లిపోయిండు... వానికి మాకు సమందంలేదు... అని రాయలింగు ఏలాన్జేసిండామరి?'' ఒక నడివయసతను అన్నాడు.

''ఏలాన్జేయికుంటె మాత్రం...! వాడున్న జమగాదాయె, లేని జమగాదాయె... ఇంట్లున్నని రోజులు పగోనోల్నే పాడుచేయబట్టె'కుటుమాన్ని ఎప్పుడు సంబ్రంగుంచిండే...?'' ఇంకొకతను అన్నాడు.

''నీయవ్వ... పిస్సపిస్స మాటలు మాటాడకుర్రి... ఎల్లిపోయిండట... ఏలాన్జెయ్యాల్నట... పగోడట...అదెనే... బుచ్చన్న యేంతవ్పజేసిండని దూరంగొడుతాంద్రు? ఎవల్నన్న గుంజిండా? ఎవల్నన్నదేసుకున్నడా? అందరు చెవుల్దెరుసుకోనినుర్రి చెప్తానా... బుచ్చన్న ఈడున్న అందరిమనిసి...'' ఆవేశంగా అన్నాడు శివయ్య.

''అంటె... గీగుడిసెలోల్లందర్ని ఆగం గమ్మంటావురా?'' అన్నాడు సాయిలు.

''మరి గా రాయిలింగు మామనే అందరం గలసి ఆగంజెత్తాం పా... పామరి... గుడిసె పీకి అనాదోన్ని జెద్దాంపా... నువ్వేమొదటి వాసంపీకుదువుపా... పావేమరి. సాయిలు దగ్గరకెళ్ళాడు శివయ్య.

''నేనుగట్లంటాన్నారా... గంతపావనాచ్చేన్నారో... ఒక్కలకు కస్టంవచ్చుడు మంచిదో... అందరికి కస్టం వచ్చుడు మంచిదో... అలోశన చేయమంటాన.''

''ఇయ్యాల రాయలింగు మామొక్కడైతే... రేపు నేనొక్కన్నైత... ఎల్లుండి నువ్వొక్కన్నివైతౌ... అటెంక ఉంకోడు... ఉంకోడు... గట్లనే ఒక్కలై ఆగమైపోతరు''

''ఒరి శివయ్యా! మీది ఉడుకునెత్తురు... మీకనుబంలేదు... పెద్దోల్లతోని కొట్లాటంటే మాటలా? మనతానేమున్నదిరా? బూమా జాగా? పైసలా పలుకుబడా? రాయలింగున్ని మాత్రం మనం ఎల్లకాలం దూరం జేసుకుంటామా? కొంతకాలం కోపాలు సల్లబడేదాకా మనకు దూరం గుంటడు. మనందరం ఆదుకుందాం... దినాలు గడుత్తంటె, కోపాలు పోతయ్... రేసాలు పోతయి... మెల్లంగ మెల్లంగా మల్లమనదగ్గెరికె తెచ్చుకుందాం... ఎట్లమరి...? పాలుమనయె, పటువమనదె... పాలుగాపాడుకోవాలె, పటువగాపాడుకోవాలె'' సాయిలు నెమ్మదిగా చెప్పుకుపోతున్నాడు.

ఆఁ...ఈడుండుగ చేయని పాయం, దూరన బోయినంక చేస్తంతీ... ఇప్పుడుమెడలు బట్టి నూకెసి, మల్ల దగ్గెరికి చేదుకుంటామా...? అవద్దం మాట...'' ఒక యువకుడన్నాడు.

''ఎట్లరో... ఒక్కలు చెయ్యంగ ఇందరం సిచ్చననుబగిద్దామా మరి?'' సాయిల్ అసహనంగా అడిగాడు.

''నీయవ్వ... ఒక్కలట... ఏమో చేసిండట... సిచ్చట... మనందరముండంగ, రాయలింగు మామొక్కడెట్లయితాడే? మనందరమొక్కటే... అందరమొక్కలైతెనే అన్నింటయ్... లేకుంటే ఒక్కొక్కలైపోయి... అందరం నాశెడమై పోతం'' దూకుడుగా అన్నాడు శివయ్య.

''మరేంచేద్దామంటవో నువ్వు చెప్పరాదు!''

''ఏందే చేసేది? రెక్కలకస్టం చేసుకొని మన బతుకు మనం బతుకుతానం... మనమెవల తెరువుకు పోతలేం... గట్లనే మనతెరువుకెవల్ను రానీయొద్దు... వస్తె ఊకోవద్దు...''

''నువ్వు రానీయకుంటె ఊకుంటరా? ఇప్పుడు రమ్మని పిలిస్తేనే వచ్చిందా ఈ సమస్సె? గట్లనే వద్దన్నా వత్తరు... గప్పుడు గావాల్లతోని కొట్లాటకు దిగుమనేగద నువ్వుచెప్పేది...?''

శివయ్య జవాబుకోసం వెదుక్కుంటున్నాడు.

''నాకు తోసింది చెప్పుతాన... ఇనుర్రి... ఈడికొచ్చి రాయలింగేం సుకపల్లేదు. ఈ అగ్గిని వ్పుల బతుక్కన్న ఉంకోకాడ బతుకుడే మంచిది. ఈడదొరికే పని యాన్నన్న దొరుకుద్ది. రాయలింగు మల్లవాల్లూరుకుపోవుడే మంచిది.'' తాపీగా చెప్పి అందరికేసీ చూశాడు సాయిలు.

''అయితే రోజుకోన్ని వాల్లూరుకు పంపుదామంటవ్... గంతే కాదె సాయిలు తాతా!'' అన్నాడు శివయ్య.

''నేను గట్లెందుకన్నరా?'' సాయిలు బిత్తర

పోయాడు.

"నీయవ్వ... ఇగెట్లన్నవే...? అడినుండి తరిమితేనే... ఇల్లు జాగలు కుదువబెట్టుకుని ఈడికొచ్చిండు... బతుకుతోని పొరాడుతాండు... ఈడగూడా కుక్కలోలె తరుముతాంటె... అదు కుసుడుపోయి... ఎల్లగొడదామంటవ్...! ఈ పరిత్తితి నీకే వస్తె!" కోపంగా అన్నాడు శివయ్య.

"ఇగెట్లరే... నీతోనున్న పీకులాటయిది! ఏడి మాట్లాడినా యాడికో తీసుకుపోతావ్... ఇగనాపరాటయిందు... ఏంజేద్దామూ నువ్వే చెప్పు" సొయిలు తగ్గిపోయాడు.

"ఇంక చెప్పుడేంది? అందరి పానాలు పోయినంకనే రాయులింగు మామ గుడిసెపీకాలె... గంతే" గట్టిగా అన్నాడు శివయ్య.

"అంతే, అంతే..." అన్నారు మిగతా యువకులు

"ఎవలకైనా అక్కరొచ్చినోడు వుంటుకుంట... అందరికి అక్కర కొచ్చే మనుసుగాను మనిషి... గసొంటి మనిషున్న మనుకుంటిందంటే మనమెల్ల కాపాడుకుంటం! అయినంక లేకుంటిమూ..." మళ్ళీతానే అన్నాడు శివయ్య.

ఇవన్నీ విన్న రాయులింగు మనస్సు బారమైపోయింది.

"నాయినా శివయ్యా! మేమీడుండుడెందుకూ? గింతమందిని కుందాపసబెట్టుడెందుకు...? యాడికి బోయినా రెక్కల కష్టమే కద బిడ్డ! మాదుర్దెస మీకెందుకంటూకోవాలె నాయ్నన...? బుచ్చయ్యను తీసుకొని మేమింకోకాడికి పోతం... మా బుచ్చయ్యను కాపాడి మాకొప్పజెప్పుర్రి... గంతేసాలు..." అన్నాడు రుద్ధ కంఠంతో.

"నువ్వు యాడికి బోయినా గీకస్టాలు తప్పయ్మామా...! ఈడి మనుసులే ఆడగూడుంటరు. తేళ్లూ, పాములూ అంతటుంటయ్... అవి కరువకుంట చూసుకోవాలెగాని... అవిలేని కాడికి పోతమంటె, బూమ్మీదసోటె దొర్కదినీకు. అదిగాక నీపిచ్చిగానీ... గీకస్టం నీఒక్కనీ కస్టమెట్లయిద్దే? ఇయ్యాల నిన్ను పోగొట్టుకుంటే ఒక్కొక్కల్నే అందర్ని పోగొట్టుకోవాలె... అందుకే గిది మాకస్టంగూడా... అంతామేం చూసుకుంటంగాని... ఇగనువ్వూకుండు" అన్నాడు శివయ్య.

మౌనంగా అన్నీ వింటున్నదేవయ్యకు తను చేయలేని పనిని వాళ్ళు చేస్తున్నందుకు సంతోషమూ, రేపేమవుతోందోనన్న భయమూ, కలిగాయి.

రాయలింగుకు కొంత ధైర్యం కలిగినా... రేపును తలుచుకొని భయపడుతున్నాడు.

"దేవన్నా! ఇగనీరాయబారం బందిచెయ్యి... మల్ల సర్దారోని దగ్గరికే పోవద్దు... ముందుగాల మనల్నుమనం అడుకుంటె రేపు మనల్నాడుకునేటోడు తప్పక వస్తడు." దేవయ్యకేసి చూస్తు అన్నాడు శివయ్య.

"మరి బుచ్చయ్య సంగతెట్లరా?" అడిగాడు దేవయ్య.

"గదే తిప్పలయితదేమో!... మొండొర్నైబట్టుకొస్తం... బుచ్చన్న మీద చెయిబడనీయం... నియ్యవ్వ పుత్రకొయిలు పగిలినట్లు పలుగాలె తిర్గాయటు" ఒక యువకుడన్నాడు.

"యాడ దొర్కుతడురా? వానికోసం నేను తిర్గని సోటులేదు"

"సందు సందులు గాలించి పట్టుకొస్తం... నువ్వు సూడ్రాదు" అంటూ అందర్నీ తీసుకుని వెళ్ళిపోయాడు శివయ్య.

ఆతర్వాత ఒక్కొక్కరే అంతా వెళ్ళిపోయారు.

"కొడుకు సమస్యా... గుడిసె సమస్యా... గుడిసె పోయినా సరే... కొడుకును ఈ బలగమంతా కాపాడుతెంతబాగుండు"? మనసులో అనుకున్న గౌరమ్మ ఈ ప్రశ్నను అడగనే అడిగింది.

"ఈ రొండూ ఒక్క సమస్సె అక్కా... వాన్ని లొంగదీసుకోవాల్నని వాల్లు గుడిసె పీకుతమనుకుంటాండ్రు... వాన్ని కాపాడుకోడానికి, గుడిసె కాపాడుదమనుకుంటాండ్రు వీల్లు." అని చెప్పాడు దేవయ్య.

ఆ తర్వాత కూడా అక్కడే భోంచేసి, బలవంతంగా అందరిచేత తినిపించి అక్కడే మేనువాల్చి పడుకున్నాడు.

★ ★ ★

"తమ్మీ! బుచ్చవత్తమ్మీ!" గుడిసెముందు

వినిపించింది.

"ఎవలయ్యా? ఈడ బుచ్చవతెవలులేరు." బయటకొచ్చి అంది మ.దునయ్యా తల్లి.

"నాకు మదునన్న అన్ని చెప్పిండవ్వా! నేను వగోన్ని కాను... మనోన్నే" అంటూ లోపల కురాబోయాడతను.

"మదునన్నలేడు... బుచ్చవతిలేడు... లోపటికిరాకు" గదిరిస్తూ అడ్డంనుంచుందామె.

తడిక సందుల్లోంచి మల్లేశును గుర్తుపట్టాడు భిక్షపతి.

"లోపటికి రానియ్యవ్వా! మనోడే..." అన్నాడు.

"తమ్మీ! పొద్దుట్నుంచి నీకోసం తిరుగుతాన. ఆకరికి మదునన్న కల్సి నీ పత్త చెప్పిండు... నిన్నరాత్రంత ఈర్నామన్న నీకోసం ఎదిరి చూసిండు... నువ్వురాలేదు... కట్టమల్లన్నను పిల్సుకుని... ఎనుకులాడి తీసుకురమ్మన్నడు... ఆ అన్నకూ నువ్వు దొరకు తలేవట ఎందుకు తమ్మీ... పానాలతోని ఆడుకుంటవ్? ఇప్పుడన్నా పోదాంపా." లోపలకొచ్చి కూర్చుంటూ అన్నాడు మల్లేశు.

ఏం నమాధానంచెప్పాలో భిక్షపతికి తోచలేదు.

"నత్తిగాని మనుసులు నీకోసం గాలిస్తాంద్రు తమ్మీ!"

"నీకెట్ల తెలిసింది?"

"నాకెందుకు తెల్వది? నాకేకాదు ఈర్నామన్నమనుసులందరికెరికే... నీ కాడికి రాబుద్ధిగాకుంటె... నువ్వు ఊ... అను... ఈర్నామన్ననూ, కట్టమల్లన్ననూ ఈడికే పట్టుకొస్త... నువ్వు ఈర్నామన్నతోని చేతులు కలువుతె... నిన్నుకోనాయ్ అంటోడుండడు... నామాటిను తమ్మీ" ప్రాధేయపడ్డాడు మల్లేశు.

భిక్షపతి ఆలోచనలో పడిపోయాడు.

"తమ్మీ... బుచ్చవత్తమ్మీ? నీ మంచి కోరి చెప్తాన. నీ అసొంటి దయిర్యమున్న మొగోడంటె ఈర్నామన్నకు శాన యిస్టం. ఒక్కపాలి కలువు సాలు... నిన్ను పానమోలె చూసుకుంటడు. కట్టమల్లన్న ఎప్పటికి నిన్నంటుకొనే వుంటడు. అంకూసు, సాబీరు, రామ్ములు, యేసోబు..... అందరు నిన్ను కండ్లల్ల పెట్టుకోని కాపాడుకుంటరు. నువ్వు రచ్చగిచ్చ తొక్కొద్దు... మంచిగ తినుకుంట తాక్కుంటుండొచ్చు..." భిక్షపతిని ఒప్పించడానికి ప్రయత్నించాడు మల్లేశు.

"అన్నా మల్లేనన్నా.... ఇప్పుడు నేను యాడికీ రాను. ఎవల్నూ కలువ... నాకు సాయం చేయాలనుంటె, ఇప్పుడు చెయ్యరాదా?"

"అయ్యో... గట్లుండత్తమ్మీ... గాయింత నంగతి ఈర్నామన్నతోని నేను చెప్పలేదనుకున్నవా...? నమ్మడు... మీవోల్లు నిన్ను నత్తిదాదాకు కలువుడుకే చూస్తుండిరి. ఎట్ల నమ్మతడు? నువ్వొచ్చి కలువాలె.... ఈర్నామన్న నిన్ను తన మనిసని నమ్మాలె... గప్పుడు నువ్వు మా మనిసివని ఏలాన్ జేస్తడు. నిన్ను ముట్టుకున్నోడు బూడిదైతడని బయపడుతడు... మా మనిసినొక్కన్ని ముట్టుకుంటె, వాల్ల మనిసిని పట్టుకుంటం.... మా మనిసిని కొట్టిగ్రంటె, వాల్ల మనిసికి పాడె కడుతం" ఎంతో గొప్పగా చెప్పాడు మల్లేశు.

"మల్లేనన్నా... నన్ను చెమించు. నీ మాటలింటాంటె... నాకు ఏడుపొస్తాంది. కాని నేనెవల మనిసినీ కాను. ఎవల మనిసినో అయి, ఎల్లకాలం వగను వట్టుకోని బతుకుడు నానుంచి కాదు. నేను నామనిసినే... నాకోసం నేను బతుకుత... నాకోసం నేను చస్త... నాకోసం ఉంకోలు చావద్దు. వాల్లునురు నాకు తలుగొద్దు. నత్తిగానితోని అటో ఇటో తేల్సుకున్నంక... తప్పకుండ ఈర్నామన్నను కలుస్త" అంటూ మల్లేశు చేతులు పట్టుకున్నాడు భిక్షపతి.

"అట్లగాదు... నీకెరుకలేత్తమ్మీ...." చెప్పబోయాడు మల్లేశు.

"అన్నా? మల్లేనన్నా.... నాకన్నదమ్ములేరు. నువ్వే అన్నవనుకుంట. నా తోవకడ్డం రాకు. గీతోవ దాటినంక చూసుకుందాం... ఇంకేం మాటనకు" అన్నాడు భిక్షపతి.

నెత్తి గోక్కుంటూ, గుడ్లు మిటకరిస్తూ కాసేపు నించున్నాడు మల్లేశు.

"నరె... నీ యిస్టం తమ్మీ! కాని కాల్లమీనబడి నత్తిగాన్తోని కలిసే బదులు... బుజంమీన చెయ్యేసి ఈర్నామన్నను కల్సుడు మంచిది. నీకోసం మా తలుపులెప్పటికీ తెరిసే

వుంటయ్. తమ్మీ... కొంచెం జాగర్తగుండు. ఒక్కనివి తిరుగకు...'' అని జాగ్రత్త చెప్పివెళ్లి పోయాడు మల్లేశు.

తను మళ్లీ తప్పు చేస్తున్నాడా? వీరస్వామిని కలిస్తే తనను కాపాడుతాడా? ఇంక తనెప్పుడూ ఆ కత్తిమీద సాములాంటి జీవితం గడపాల్సి వస్తుందికదా? తన దారిలో తను నెగ్గుతాడా?... ఇలా ఎన్నో ప్రశ్నలు సాయంత్రందాకా భిక్షపతి మస్తిష్కాన్ని మధించాయి.

ఆ రాత్రి, పదిమంది ముఖ్యమైనవాళ్లతో... తన ఇంట్లో ఓ సమావేశాన్నేర్పాటు చేశాడు మదునయ్య.

భిక్షపతి సంగతంతా వివరించాడు. సత్తిదా దాకూ, సర్దార్‌కూ, మునిసిపల్ చెయిర్మెన్‌కూ, రిక్షా యూనియన్ ప్రెసిడెంటుకూ వున్న సంబంధాన్ని తెలిపాడు. వాళ్లు చేస్తున్న అన్యాయాలను ఒక్కొక్కటే బయటపెట్టాడు.

భిక్షపతికొచ్చిన ఆపదనూ... అతన్నా ఆపద నుండి కాపాడాల్సిన బాధ్యతనూ తెలిపాడు.

ఈ పదిమందీ తలా పదిమందిని తీసుకుని రేపు యూనియన్ ప్రెసిడెంటును బజారుకీడ్వాలని నిర్ణయించుకున్నారు. రిక్షావాళ్లంతా ఏకమై, భిక్షపతికి రక్షణ కల్పించేదాకా, భిక్షపతి రిక్షా నడుపకుండా మదునయ్య ఇంట్లోనే తల దాచుకోవాలని తీర్మానించుకున్నారు.

"మదునన్నా? నామీదెందుకే ఇంత దయ?" అంతా వెళ్లింతర్వాత నీళ్లు నిండిన కళ్లతో అడిగాడు భిక్షపతి.

"దయ నీమీద కాదు... నాయంమీద, పేదోనిమీద. పేదోన్ని పేదోడే ఆదుకోకుంటె పేదోడు బత్కడు. 'నీ కస్టం నాకు రావద్దని' అనుకునే పేదోల్లందరికి గీదయ వుంటది... గందుకే గిది నామీద నాకున్న దయ" అంటూ నవ్వాడు మదునయ్య.

భిక్షపతికి తన కష్టాలు గట్టెక్కినట్లే అనిపించింది. మళ్లీ తాను భయం లేకుండా రిక్షా తొక్కుకుని, తండ్రికి సాయపడుతూ... తన కుటుంబంతో కలిసి హాయిగా జీవిస్తాడని పించింది.



ఆ రాత్రి భోంచేసి ఒకే చాపమీద పడుకుని ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు.

మర్నాడుదయమే లేచి, ఎక్కడకూ వెళ్లవద్దని భిక్షపతికీ, వెళ్లనీయవద్దని తల్లికీ చెప్పి వెళ్లిపోయాడు మదునయ్య.

భిక్షపతి లేచి ముఖం కడుక్కున్నాడు. మదునయ్య తల్లి టీ ఇచ్చింది. టీ తాగి.. మంచం మీద కూర్చుని తన జీవితం చేస్తున్న ప్రయాణం గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఎనిమిది గంటల ప్రాంతంలో పరుగెత్తుకుంటూ వచ్చాడు రాములు.

"బుచ్చన్నా... మీ గుడిసె పీకేస్తాంద్రు. గుడిసెలల్ల బాగ లొల్లయితాంది... ఈ సంగతి



మదునన్నకు చెప్తాన్త" అని చెప్పి పరుగెత్తుకు వెళ్లిపోయాడు.

భిక్షపతికి తలమీద పిడుగుపడ్డట్లని పించింది. వెంటనే కోపంతో అతని కళ్లు నిప్పులు కురిశాయి. అతని నరాలు పొంగాయి.

ఒక్కసారిగా లేచి బయట, సర్కారు తుమ్మల చాటున వుంచిన తన రిక్షా వేపు పరుగెత్తాడు.

"వద్దు బిడ్డా... వద్దు. నువ్వొక్కనివి పోవద్దు.. అన్నొచ్చేదాకుండు..." అని మదునయ్య తల్లి వెనుకనుండి వేస్తున్న కేకల్ని వినిపించుకోకుండానే రిక్షా తొక్కుకుంటూ రోడ్డుమీదికొచ్చాడు.

రివ్వున దూసుకుపోతూ... కాసేపట్లోనే నయీంనగర్ దాటి, పెట్రోల్ పంపు దాటి.... క్రాస్ రోడ్ దగ్గరి మలుపు తిరిగింది భిక్షపతి రిక్షా.

సినిమా హాల్ ఇంకా యాభై గజాల దూరం వుంది. అక్కడ పక్క సందు నుండి నాలుగు సైకిళ్లు ఒక్కసారిగా వచ్చాయి. భిక్షపతి రిక్షాను ఓవర్‌టేక్ చేసి సినిమా హాలు ముందు ఆగాయి. అందరూ ఒకేసారి సైకిళ్లను స్టాండ్ వేసి ఎదురుగా నుంచున్నారు.

తానూహించిన క్షణం వచ్చిందని అర్థమైపోయింది భిక్షపతికి. అతని గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

భిక్షపతి సడెన్ బ్రేక్ వేసినా ముందుకు

పోయి రిక్షా వాళ్లకు పది గజాల దూరంలో ఆగింది.

గబాలున దిగి, నడుంకున్న కత్తి పిడిని తాకాడు భిక్షపతి.

అంతలోనే వ్యూహం పన్నినట్టుగా నలుగురూ అతనివేపు నడుస్తున్నారు.

ఇందాక కనిపించలేదు కాని... వాళ్ల చేతుల్లో గజం గజం ఇనుప రాడులున్నాయి.

భిక్షపతి కొంచెం జంకాడు. టాకీసు పక్క సందు చేరగలిగితే... తను గుడిసెలవాళ్లకి కనిపించవచ్చు. ఆ సందు అతని వెనుక ఐదారు గజాల దూరంలో వుంది. ఈ ఆలోచన వచ్చిందో లేదో... అటువేపు పరుగెత్తాడతను.

వాళ్లు వెంటపడ్డారు. భిక్షపతి సందు తిరిగాడో లేదో... వాళ్లతన్ని అందుకున్నారు.

ఇనుపరాడ్‌లు ఒక్కసారిగా లేచాయి. మొదటి దెబ్బకే భిక్షపతి బోర్లా పడిపోయాడు. తలను రెండు చేతులతో కాపాడుకుంటూ, దొర్లుతూ... అరుస్తూ కేకలు వేస్తున్నాడు.

డొక్కలో, ఛాతీపై, వీపుమీద కాళ్లతో తంతూ.... రాడ్లతో ఎక్కడబడితే అక్కడ బాదుతూ, దొర్లిస్తూ కొడుతున్నారు.

శరీరం నిండా రక్తం... చేతుల నిండా రక్తం... తల నుండి ప్రవహించి, నోట్లోకి వెచ్చగా... వెగటుగా ప్రవేశిస్తున్న రక్తం... డొక్కలో బలంగా తంతున్న కాళ్లు.... కత్తి తీయడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్న చేయి....

భిక్షపతి ఆక్రందన విని, జన సంచారం ఆగిపోయింది... అందరూ దూరంనుండే భయపడుతూ చూస్తున్నారు.

అలా దెబ్బలు తింటూ దొర్లుతూ... భిక్షపతి, తన మీద పడబోయే ఓ రాడ్‌ను ఒడుపుగా పట్టుకున్నాడు.

క్షణం ఆలస్యం చేయకుండా, ఆ రాడ్‌ను పట్టుకున్నవాడి తొడల మధ్య బలంగా తన్నాడు.

రాడ్ వదిలి... పెద్దగా అరుస్తూ అంత దూరంపడిపోయాడు వాడు. మిగిలినవాళ్లు క్షణంలో పదో భాగం ఖంగుతిన్నారు.

అంతే.... అంతలోనే అగ్నిజ్వాలలా, ఎర్రగా కాలిన ఇనుప చువ్వలా సువ్వున లేచాడు భిక్షపతి.

ఏమాత్రం ఆలస్యం చేయకుండా వీరవిహారం చేశాడు.

రాడ్‌తో సాముచేస్తున్నట్లుగా ఎగురుతూ... తనను కాపాడుకుంటూ.... అందినవాడినల్లా ఎడాపెడా బాదుతున్నాడు.

ఆ స్వైరవిహారంలో ఒకడి తల చెక్కురుమంది. 'అమ్మా' అని అరచి వాడు కిందపడిపోయాడు.

పడిపోయినవాని తలమీద.... ధనా ధనా తల ముక్కలైపోయేదాకా, అలా బాదుతూనే వున్నాడు భిక్షపతి.

అంతలో అతని చేతినుండి రాడ్ ఎగిరిపోయింది. అతని మణికట్టు విరిగి వేలాడుతోంది.

ఎడమచేత్తో, బొడ్లోని కత్తి తీశాడతను... అదే ఆలస్యం.... రెండు రాడ్‌లు అతని తలమీద ఒకేసారి పడ్డాయి.

కళ్ళల్లో ఒక్క మెరుపు మెరిసింది... వెంటనే చీకట్లు కమ్మాయి... అలాగే కిందపడిపోయాడు భిక్షపతి.

అంతే... ఆలస్యం చేయకుండా వాళ్లు భిక్షపతి తల నుగ్గునుగ్గయి పోయేదాకా, అతనిలో చలనం ఆగిపోయేదాకా రాడ్‌లతో అలాగే బాదారు.

దూరంగా నుంచున్న జనం.. భయంతో బిర్రబిగుసుకుపోయి చూస్తూ వుండగానే... రక్తసిక్తమైన దేహాలతో... భయంగొలిపే ఆకారాలతో... ఆ ముగ్గురూ రోడ్డుదాటి... సందులో పడిపరుగెత్తుకుపోయారు.

వాళ్లలా వెళ్ళారాలేదో... మదునయ్యా, మరో పదిమందీ అక్కడకొచ్చారు. అక్కడి భీభత్సాన్ని చూసి కొయ్యబారిపోయారు.

భిక్షపతి ముఖం గుర్తుపట్టకుండా చితికిపోయింది. వెంట్రుకలన్నీ రక్తంతో తడిసిపోయాయి. కుడిచేయి విరిగి మెలితిరిగి వుంది. ఎడమ చేయి తెరుచుకుని వుంది. చేతినానుకుని మెరుస్తున్న కత్తి వుంది.

నెత్తురు మడుగులో పడివున్న భిక్షపతి శవం దగ్గర కూర్చుండి హృదయవిదారంగా ఏడ్చాడు మదునయ్య.




కాసేపలా ఏడ్చి... ఏదో గుర్తొచ్చినవానిలా లేచి, రోడ్డుగుండా గుడిసెలవేపు నడిచాడు.

జనాన్నడిగి వివరాలు తెలుసుకున్నారు రిక్షా వాళ్ళు. క్షణంలో స్టాండ్‌వేసున్న సైకిళ్ళు తునాతునకలైపోయాయి.

దూరంనుండే గుడిసెల ముందు గుమిగూడిన జనాన్ని చూసి, పరుగెత్తాడు మదునయ్య... అతని వెంట మిగతావారు పరుగెత్తారు.

గుడిసెకు కాస్త దూరంలో పాన్ నములుతూ నుంచున్నాడు సర్దార్. అతనికిరువేపులా ఇద్దరు పహిల్వాన్లు... వాళ్ల చేతుల్లో కర్రలు...

రాయలింగు గుడిసె సగం శిథిలమైపోయింది. అక్కడా కర్రలు పట్టుకున్న రౌడీలు... పలుగూ పారలతో మున్సిపాలిటీ జవాన్లు...

వాళ్లకెదురుగా ఇరవైమంది యువకులు... వాళ్ళ ముందు ఉగ్రుడై చూస్తున్న శివయ్య... అందరి చేతుల్లోనూ కర్రలు.

గుడిసెముందు చెల్లాచెదురుగా పడివున్న సామాను.... పక్కనే చదికిలబడి కూర్చున్న రాయలింగు కుటుంబం. వాళ్ళ వెనక, కాస్త దూరంలో ఆడా మగా, పిల్లా పీచూ ఓ యాభై మంది వాళ్ళ పక్క దీనంగా తలవంచుకు నుంచున్న దేవన్న సాయిలు....

యువకులు గుడిసె పీకుతుంటే ప్రతిఘటించారనీ, మునిసిపాలిటీ అధికారుల కోసం... పోలీసు బలగాల కోసం... సర్దార్ ఎదురు చూస్తున్నాడనీ మదునయ్యకర్థమైంది.

భిక్షపతి మరణం ఇంకా వాళ్ళకు తెలియలేదని మదునయ్య గ్రహించాడు. అతనిలో కోపం ప్రజ్వరిల్లింది. ఆ కోపాన్ని నిగ్రహించుకుని, సర్దార్‌వేపు నడిచాడు మదునయ్య.

"గుడిసె పీకే పనిని, చెయిర్మేను నీకొప్పగించిండా సర్దారయ్యా!" అడిగాడు మదునయ్య.

"ఎప్పుడు తీసేయమంటే అప్పుడు తీసేసుడుకు.... రాయలింగుకు నేను జమానత్‌బడ్డ... మునిసిపాలిటోల్లు కనిపిస్తలేరా? తీసేయ్ మనంగనే తీసేస్తె గీపీకులాటెందుకు?"

"సర్దారయ్యా! బుచ్చపతిని కాల్లమీన పడేయించుకోవాలన్ని గింత చేసినవ్... అవునా...?"

గావానితోని నాకేంపనోయ్...?"

"అవద్దమాడకు... గా ఒక్కని కోసం గింత మంది బతుకుల్ల మన్నుబోస్తానవ్... అగో... బుచ్చపతి... అద... టాకీస్ కాద... ఉన్నడు పో... నీ మనుసులో, నీ చెయిర్మెన్ మనుసులో, లేకుంటే మీ ఇద్దరి మనిసి ఆ సత్తెయ్య మనుసులో... బుచ్చపతి తల్కాయ పలుగొట్టి నెత్తురు మడుగుల పండబెట్టిన్రు... అదికి పోయి కాల్లమీన పడేయించుకో పో..." అని బోరున ఏడ్చాడు మదునయ్య.

"నాకొడుకో... నాబుచ్చయ్య పోయిండు నాయినో..." అంటూ కుప్పకూలిపోయింది గౌరమ్మ. తల్లిమీదపడి గోడుగోడున ఏడుస్తోంది మల్లి.

"అయ్యిందా... అయిపోయిందా...! నాకొడుకును సంపినావ్రా! అయ్యో..."అని గుండెలు బాదుకుంటూ భూమ్మీదపడిపోయి ఏడుస్తున్నాడు రాయలింగు.

రాయలింగు భూమికి తలను బాదుకుంటుంటే, పరుగెత్తికొచ్చి ఆపుతూ... తానూ ఏడుస్తున్నాడు దేవయ్య.

అక్కడున్న పిల్లా పాపా, ఆడా మగా... అంతా ఏడుస్తూ, గౌరమ్మ నోదారుస్తూ... ఆ ప్రాంతం శోకసముద్రమైపోయింది.

"సర్దారయ్యా... ఇంకేంది మీకండ్లు సల్లబడ్డయ్‌గద. గుడిసెల్ని పీకిచ్చి ఇంకింత పాపం యెందుకు ముల్లెగట్టుకుంటవ్‌గని... .పోయి సంతోసంగ దావత్ చేసుకోపోన్రి..." అని రాయలింగువేపు నడిచాడు మదునయ్య.

అప్పటికే శివయ్య ఒక్కో అడుగేస్తూ సర్దార్ వేపొచ్చాడు. అతని వెనుక... ఎరుపెక్కిన కళ్లతో యువకులు....

"బుచ్చపతి సావుకు నాకేం సమందం....?వాడు చస్తె నేనెందుకు దావత్ జేసుకుంట..."ఒక్కొక్కడుగే వెనక్కి వేస్తూ అన్నాడు సర్దార్.

ఒక వేపు శివయ్యా, యువకులు... మరోవేపు రిక్షావాళ్ళు....మధ్య పహిల్వాన్ల వలయంలో సర్దార్.

"ఇంక యాడికి పోలేవురా సర్దారోడా...."శివ

య్య పళ్ళు కొరుకుతూ అన్నాడు.

"వాన్ని పట్టుకోని కట్టేదాం... చెయిర్మెనోడో, సత్తిగాడో వచ్చేదాకా వీన్నిడువొద్దు...." ఒక రిక్షా అతనరిచాడు.

సర్దార్ భయంభయంగా పహిల్వాన్లకేసి చూశాడు. పహిల్వాన్లు యువకులకేసి తిరిగారు.

"మర్యాదగా పక్కకుపోన్రి... లేకుంటే తల్కాయ పుర్రె లెగిరిపోతయ్..." హుంకరించాడో పహిల్వాన్.

"ముందుగాల మీ తల్కాయలుంటెగద..." కర్రలెత్తుకువచ్చారు యువకులు.

కర్రలు కర్రలు కలిశాయి....మరుక్షణంలో పెద్దగోల... తిట్లు... .... అరుపులు, ఆక్రందనలు....

ఈ సమయం చూసుకుని, కట్టదిగి పరుగెత్తుతున్నాడు సర్దార్. అతని వెంట పడ్డారు రిక్షావాళ్ళు. వాళ్ల వెనుక పరుగెత్తుతున్నాడో పహిల్వాన్.

కాళ్ళు చేతులు విరిగిపోతున్నాయ్....తలలు పగిలిపోతున్నాయి... ఏడుపులు మిన్నుముట్టుతున్నాయి.

అంతలో. విజిల్లూదుకుంటూ, బూట్ల శబ్దం చేసుకుంటూ, అందినవాడినల్లా లాఠీలతో బాదుతూ పోలీసులు... కొంతసేపు పరుగులు, అరుపులు, ఏడ్పులు మరికాసేపటికి గుడిసెల వెనుకనుండి పోలీసులమీద రాళ్ళ వర్షం....

అప్పుడు తుపాకులు పేలిన చప్పుళ్ళు... ఒకర్నొకరు తోసుకుంటూ, పడవేసుకుంటూ, తొక్కుకుంటూ పరుగులు....

రెండు నిమిషాల్లో అక్కడ... పోలీసులు తప్ప ఎవరూలేరు... గుడిసెలు వెదుకుతూ... దొరికినవాడినల్లా వ్యాన్‌వేపు లాక్కుపోతూ... గస్తీ తిరుగుతూ పోలీసులు....వాళ్లకు ఆర్డర్లిస్తూ పోలీసు అధికార్లు....

ఇదేదీ గమనించకుండా... గుండెలు బాదుకుంటూ, ఏడుస్తూ రాయలింగు కుటుంబం, దేవయ్యా, భిక్షపతి పడున్న చోటికి చేరారు.

శవాలను చూస్తూ నుంచున్న జనాన్ని ఇద్దరు పోలీసులు దూరంగా నెట్టివేస్తున్నారు. కొట్లాటను స్వయంగా చూసినవాళ్ళు... చిలువలు పలువలుగా వర్ణించి చెబుతున్నారు.

నెత్తురు ముద్దలాపడున్న కొడుకు శవంమీద పడబోయారు రాయలింగూ - గౌరమ్మలు.

పంచనామా కాకుండా తాకవద్దని ఆపారు పోలీసులు.

అరగంటలో పట్టణమంతటా గుప్పున వ్యాపించిందీ వార్త. తండోపతండాలుగా వచ్చే జనంతో రోడ్డు నిండిపోయింది.

ఎవరు ఎవర్ని చంపారు...?ఎట్లా చంపారు. మొదలైన విషయాల గురించి జనం రకరకాలుగా చర్చించుకుంటున్నారు.

కాస్త దూరంగా చతికిలబడిపోయి రాయలింగు కుటుంబం హృదయ విదారకంగా ఏడుస్తోంది.

మరో శవానికెవరూ ఉన్నట్టులేదు... వికృతంగా పడివున్న ఆ శవాలమీద గుడ్డలుకప్పారు.




పన్నెండు గంటల ప్రాంతంలో ఓ పోలీస్ జీప్, ఒక హాస్పిటల్ అంబులెన్స్ వచ్చాయి.

ఇందాక ఇన్ని విషయాలు మాట్లాడుకున్న జనం.... పోలీసులు వాకబుచేస్తే... తమకేమీ తెలీదన్నారు.

కాసేపట్లో పంచనామా పూర్తయింది. శవాలను అంబులెన్స్‌లో వేసుకుని వెళ్ళిపోయారు పోలీసులు.

దేవయ్యా హాస్పిటల్‌వేపు వెళ్లాడు... రాయలింగు కుటుంబాన్ని తీసుకుని గుడిసెలవేపు నడిచాడు సాయిలు.

రాత్రి ఎనిమిది గంటలకు భిక్షపతి శవాన్ని తెచ్చి పందిట్లో వుంచారు.

కొడుకు ముఖంలో తలపెట్టి తలపోసి తల పోసి యేడుస్తోంది గౌరమ్మ. కొడుకు కొరకు తాముపడ్డ కష్టాలను తలచుకుని ఏడుస్తోంది.

"మేమెట్లుండాలె కొడ్కా... నాయినను కూసుండబెట్టి సాత్తనంటివి గాదు కొడుకా... చెల్లెపెండ్లి నీచేతులమీదనే అయిద్దంటివిగా దు కొడుకా... మేమేం జూసుకోని బతుకాలె కొడకా..." కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది గౌరమ్మ.

"గౌరూ!ఇగెట్లనే... కస దమ్ము మింగు... ఏడ్సి తెచ్చుకుంటవా నీకొడ్కును...? అగో సూ డు..పొల్ల పూరబెంగటీలింది... రాయలింగు పిచ్చోడయిపాతాండు... ఏడిసేడిసి. ఆయింత గుండె పలిగి సచ్చి, నువ్వుగూడ వాల్లకిసం బోస్తవా? ఏడ్వకు... ఊకో బిడ్డ... ఊకో... కసూ కో...."ఒక ముసలావిడ గౌరమ్మ తలను రెండు చేతుల్తో పట్టుకుని ఓదారుస్తోంది.

"వాని గుల్లెమన్నువడ... వానిగుడికి కంప గొట్ట... ఏచేత్తోని రాసిండో వీల్లరాతలు... నాఅ సొంటి ముసలోల్లనుంచబట్టె... వైసుపోర గాండ్లను కొంచబోబట్టె... వానికి నాయంలేదు... అదెపాయె... కాలోసెయ్యో ఇరిగి, బతుకనన్న బత్కకపాయె.... హయ్యో కొడుకా..." ఒకావిడ కళ్లు తుడుచుకుంది.

"పుట్టినూరిడిసి పెండ్లాం పిల్లల్ను సాను కుందామని వచ్చిండు రాయలింగన్న. అయి పాయె చెట్టంతెదిగిన కొడ్కును పో గొట్టుకు నె...ఇంకేం జూసుకొని ఉంటడు...?" ఇంకొ కామె గద్గదస్వరంతో అంటూ కళ్ళొత్తుకుంది.

"ఎట్లమరి? మనందరం ఎల్లకాలం బత్కు తమా? ఇయ్యాలగాకుంటె రేపు, రేపుగాకుంటె ఎల్లుండి... అందరం పాయెటోల్లమే. వానికి బూమ్మీదకూడొడిసింది. వాని బాకి తీరింది...ఎ ల్లిపోయిండు...సచ్చినోనితోని సత్తరా ఎవలన్న? ఏదోగాపోరిని చూసుకోని, గుండెరాయిచేసుకోని బత్కాలె..." మరొకామె సముదాయించింది.

మరోవేపు గుడిసెల్లోని కొందరు యువకు లు, మదునయ్య, మంగ్యా, నంద్యా మొదలైన వారు అంతా కూర్చున్నారు.

"గిసొంటిదేదో జర్గుతదని నేను చెప్తనేవున్న. ఆడికి సత్తిదాదా కాల్లమీద పడుపొమ్మన్న...ఇన్న డా?" అన్నాడు నంద్యా.

"కాల్లమీనబడ్తా ఇనెటోడనుకున్నవా?ఇన డు... ఆడనే సంపిపాతరబెట్టెటోడు... ఎంత మందినిట్ల సంపలే...! బుచ్చన్న కలీజావున్న మొగోడు... సచ్చేముందోన్ని సంపిసచ్చిండు" ఒక రిక్షా అతనన్నాడు.

"ఏం మొగోడోయేందో...ఏం సాధించిండు రా? ఆకరికి అయ్యవ్వకక్కరాకుంట... కుటు మాన్నాగంచేసి పాయెనా?" ఒక నడివయసా యన అన్నాడు.

"అండ్ల బుచ్చయ్యదేం తప్పున్నదే...అసలు వాన్ని కుటుమానికక్కెరకు రానిచ్చిన్రా?" అన్నాడు ఒక యువకుడు.

"తప్పొప్పులెవలుసూత్తర్రా పిలగా? తప్పొ ఒప్పొ అన్నీ వానితోనేపోయినయ్‌తీ" మరొకత నన్నాడు.

"బతుక్కోసం మాగపోరాడిండు... కనోడిపో యిండు"

"ఓడిపోయిండంటె నేనొప్పుకోను. పెద్దపు లోలె బతికి, పెద్దపులోలె సచ్చిండు...గింత మందినొక్కటిచేసిపోయిండు. అగోసూడు...శివ య్య ఊకున్నడా? సర్దారోని కాల్రెక్కలిరిసి దావ కానకు పంపిండా? ఆయింత పోలీసోల్లంద కుంటె సర్దారోనిపని సాపయ్యేదేకదా... గుడిసె లపోరగాండ్లందరు, గావాల్లపనుల్ని బైటపె ట్టింర్రా లేదా? గవి బుచ్చన్న సాధించినయే నాయె. పానాందేందే! నీయవ్వ ఎప్పుడన్నపో యేదే..." అన్నాడు మరో యువకుడు.

"అవ్‌గాని.... శివయ్యనూ, పోరగాండ్లను ఇడిసిపెట్టింర్రా?"

"గప్పుడే యిడుస్తరా? ఎన్ని కేసులు తిర్గా లె...దావకాన్లపడ్డోల్లు కోలుకోవాలె...జమానత్‌లు దొరుకాలె... ఓ ఇంత బారతముంటది"

"గాబుచ్చన్న సత్తిగాన్ని సంపి సత్తెమంచి గుండు"

"సత్తిగాన్నా? ఎన్ని గుండెలుండాలె?"

"గాగుండెలున్నోడు పుట్టలేదనుకోకు ర్రి...యాన్నోపుట్టే వుంటడు యాల్లరావాలె గంతే..." అన్నాడు మదునయ్య.

ఇలా ఏడ్పులార్పులతో...చర్చలతో తెల్లవారింది.... పొద్దుపొడిచింది... బారెడెక్కింది.

"దేవయ్యా.... జరిగిందేదో జరిగిపోయింది. మరింక జరిగేది చూడాలెకదరా...?" దేవయ్యతో అన్నాడు సాయిలు.

"చేద్దాం నాయినా...చేద్దాం...కని..."

"ఇంకా కనేందిరా...వానికి పెండ్లామా, పిల్లలా? సంసారం చేసిండా, పిల్లలగన్నడా? వచ్చేటోల్లున్నరా యేమన్ననా? ఉప్పులా గిప్పులా? నలుగురుకలిసి, మోసుకుపోయి ఇంత మన్నుజేసి వచ్చుడేనాయె. గావని మన్న చేయక పీనుగను మురుగబెట్టుడమా?"

"అదే...గట్లెందుకు? మేమందరంలేమా? బుచ్చన్నకు పాడెగట్టాలె, ఊరేగించుకుంటపోవాలె. గీడీ నిక్కార్సైనవాళ్ల ఇండ్లముందట ఊరించుకుంటపోవాలె. గావాళ్ల రాచ్చసితనం లోకానికి తెలజెప్పాలె. ఆ పాపపు లంజొడ్కుల రూపాన్ని సర్కారుకు చూపించుకుంటపోవాలె...కర్సంత మేమే పెట్టుకుంటం" అన్నాడు మదునయ్య.

మిగతా యువకులంతా అలాగేచేయాలన్నారు.

ఆతర్వాత అన్నిపనులూ వేగంగా జరిగిపోయాయి.

దేవయ్యతోసహా గుడిసెలజనం రాయలింగు కుటుంబాన్ని ఓదార్చడంలో మునిగిపోయారు.

మదునయ్య ఆధ్వర్యంలో శవయాత్ర సిద్ధమైంది.

భిక్షపతి శరీరంనిండా పూలదండలు వేశారు. అందరూ ముఖానికి కుంకుమ పూసుకున్నారు.

ముందు బ్యాండుమేళంతో, వెనుక రెండు వందల రిక్షాలతో, ఐదారువందలమందితో సాగింది శవయాత్ర. ఆ యాత్రను చూడ్డానికి వేలాదిమంది బారులుతీరి నిలబడ్డారు.

"భిక్షపతి...జిందాబాద్" "సత్తిగాని రౌడీయిజం...నశించాలి...", "వడ్డీ వ్యాపారం నశించాలి", "రౌడీలను బద్మాషులను పోషించేవాళ్లారా...మీ అంతం దగ్గరికొచ్చింది" "దుర్మార్గులరోజులు దగ్గరపడ్డాయ్" 'బుచ్చన్న-అమర్ హై' మొదలైన నినాదాలతో బజార్లన్నీ మారుమోగాయి.

చెయిర్మెన్ ఇంటిముందూ, సర్దార్ ఇంటిముందు, రిక్షాయూనియన్ ఇంటిముందూ, శవాన్నాపి...భవనాలు దద్దరిల్లేలా నినాదాలు చేశారు.

ఆ ఇళ్ళ ముందు, ముందుజాగ్రత్తచర్యగా పోలీసులు గస్తీ తిరుగుతున్నారు.

నగరంలో ఆ శవయాత్ర అపూర్వమైందని అన్నారంతా.

సాయంత్రం నాలుగుగంటలదాకా ఊరేగించి భిక్షపతి శవాన్ని ఖూడిదచేసి అంతా తిరిగొచ్చారు.

* * *

రాయలింగు కోర్కెలగూడు కూలిపోయింది. ఆశల విస్తరాకు చిరిగిపోయింది. అతడు జీవచ్ఛవంలా మారిపోయాడు.

గౌరమ్మ నేలపట్టింది. ఏడ్చి ఏడ్చి కన్నీళ్ళింకిపోయినా ఆమె ఏడ్వడం మానలేదు.

చితికిపోయి సొట్టలుపడ్డ భిక్షపతి ముఖం, నెత్తురుముద్దలా మారిపోయిన భిక్షపతి శరీరం అహర్నిశలూ కళ్ళముందు మెదిలి వాళ్ళను రంపపుకోత కోస్తున్నాయి.

రెండు మూడురోజులు గుడిసెలవాళ్ళు అన్నంతెచ్చి తినిపించారు. తర్వాత ఆ కుటుంబానికి దేవయ్యే దిక్కయ్యాడు. అతడు రాయలింగు గుడిసెలోనేవుంటూ అంతో ఇంతో సంపాదించి, కుటుంబాన్ని పోషిస్తున్నాడు.

ఒకనాడు ఇవ్వాలటి గురించేకాక, రేపటిగురించికూడా ఆలోచించే రాయలింగు, ఇప్పుడా పూట తిండిగురించికూడా ఆలోచించడంలేదు.

ఒకనాడు బతుకు భారమనుకొని... ఆ బరువును మోయడానికి సర్వదా సిద్ధంగావుండే రాయలింగు, ఇప్పుడు తానే భూమికి భారమైపోయాననుకుంటున్నాడు.

దేవయ్య సంపాదించడం, మల్లి ఉడకేసిపెట్టడం ఇద్దరూ బలవంతంగా రాయలింగు గౌరమ్మలకు తినిపించడం అలా...కొంతకాలం గడచిపోయింది.

కాలం చాలా శక్తివంతమైంది. నిరంతరం




అవిచ్ఛిన్నంగా సాగిపోతూ లోకాన్ని తనతోపాటు తీసుకుపోతుంది కాలం. జీవుల్ని తనకనువుగా...తన చెప్పుచేతల్లో వుంచుకునేశక్తి ఒక్క కాలానికేవుంది. సుఖదుఃఖాలు కాలప్రవాహంలో ప్రయాణించి కరిగిపోతాయి. రకరకాల అనుభూతుల్ని కలిగిస్తూ...జీవితాల్ని ఎప్పటికప్పుడు మారుస్తూ కాలం ప్రాణికోటిపై తన ఆధిక్యతను రుజువుచేసుకుంటూ వుంటుంది.

రాయలింగు దంపతులమీదకూడా కొంత కాలప్రభావం పడింది. భిక్షపతి చనిపోయిన తొలిరోజుల్లా వాళ్లకిప్పుడు చావాలనిపించడంలేదు. కానీ కొడుకును మింగిన ఆ ఊళ్ళో వాళ్ళకుండాలనిపించడంలేదు. తమ ఊళ్ళోకి వెళ్ళిపోయి వుండాలనిపిస్తోంది.

ఒకనాడు ఉదయమనగా వెళ్ళిన దేవయ్య, మధ్యాహ్నం తిండికికూడా రాకుండా సాయంత్రం నాల్గుగంటలకొచ్చాడు.

దీనత్వం మూర్తీభవించినట్టుగా ఓచోట కూర్చునుంది మల్లి.

"నాయినేడే...గౌరక్కేది..?" అడిగాడు దేవయ్య.

"ఇయ్యాల్టికి అన్నపోయి నెలైందని యేడ్చేడ్చి... యాడికి పోయిండ్రో..." అంది గౌరి.

వాళ్ళెక్కడకెళ్ళారో దేవయ్య ఊహించగలిగాడు.

"మరి అన్నందినిపోయిండ్రా?"

"బలిమీటికి రెండు బుక్కలు తిన్నరు"

"నేనుపోయి తీసుకొస్తుండు" బయటకు పోబోయాడు.

"మామా...!" గాబరాపడుతూ పిలిచింది మల్లి.

అలాగే ఆగిపోయి 'ఏమిటన్నట్టుగా' చూశాడు దేవయ్య.

"ఇయ్యాల అన్నమేడ తిన్నవ్...?" కిందికి చూస్తూ అడిగింది.

"యాన్నోతిన్నగనీ... ఎందుకు?"

"నేనొండింది తినబుద్దయితలేదా? నేను...మంచిగ వండుతలేనా...?" ఎక్కడో మాట్లాడుతున్నట్టుగా వుందామె గొంతు.

"ఎందుకట్లడుగుతానవ్...?" ఆశ్చర్యపోయాడతను.

"రెండ్రోజులకోపాలి యాన్నో తింటానవ్... ఈడ తిన్నప్పుడు గూడ సగం కడుపుకే తింటానవ్... పూరబక్కబడిపోతానవ్...."

ఆమె మాటలు దేవయ్యను కదిలించాయి. తన కడుపును విచారించి, తన ఆరోగ్యం గురించి ఆలోచించే ఆమెను కాసేపు అలాగే చూస్తూ నుంచున్నాడు.

"నీ అనుమానం గదానె! నేను మంచిగానె తింటాన. నువ్వు మంచిగానే వండుతానవ్... ఉంకో నిజం చెప్తుత ఇను... మా అయ్యవున్నప్పుడు తప్ప, నాకిష్టమైన తిండి యాడ దొరికింది? ఎవలు పెట్టిన్రు...? ఆకలైనకాడ తినుడు, చీకటైనకాడ పండుడు....గట్లకుక్కబతుకు బతికిన. ఇప్పుడు మీ ఇంట్ల పావురంగవండి పెడుతానవ్... కడుపునిండ తిని, కంటినిండ నిద్రపోతాన... మా అవ్వున్నప్పటోలె తింటాన..." దేవయ్య గొంతు వణికింది.

"నేను బక్కబడ్డనని సూసేటోల్లు... మొన్నటిదాకెవలున్నరే! ఇయ్యాల నా కడుపేకాదు... నా మంచిచెడ్డలు గూడ ఇసారిస్తానవ్" దేవయ్య కన్నుల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

అతని బాధను గమనించి దగ్గరగా వచ్చింది మల్లి. మెల్లగా అతని భుజం మీద చేయేసింది.

సగం తెరుచుకుని సున్నాలావున్న నోరు... కన్నీటితో తళుక్కున మెరుస్తున్న కళ్ళు... ఆ కళ్లల్లో కనిపించే దయ... ఎప్పుడో చనిపోయిన తల్లి మల్లమ్మలో కనిపించింది దేవయ్యకు. ఎన్నాళ్ళనుండో అణగిపోయివున్న దుఃఖం పొంగుకొచ్చింది. మల్లి భుజం మీద తలానించి వెక్కివెక్కి ఏడుస్తున్నాడు దేవయ్య.

ఎన్నడూ ఆస్థితిలో అతన్ని చూడని మల్లి గాబరాపడింది.

ఆర్ద్రమైన మనస్సుతో... ఉబికి వచ్చే దుఃఖాన్నాపుకుని, ఒకచేయి అతని గడ్డం కిందపెట్టి, బుజ్జగిస్తూ... మరో చేత అతని వీపునిమురుతూ తానూ అతని భుజం మీద తలానించి ఏడ్చేసింది మల్లి.

ఒకరి భుజంపై ఒకరి తల... ఒకరి వీపు మీదొకరి చేయి... శారీరకంగాకన్నా మాన



సికంగా వాళ్ళను అతి దగ్గరగా చేర్చింది దుఃఖం. కాసేపు అలాగే హత్తుకుపోయియున్నారు వాళ్ళు.

అంత దుఃఖంలోనూ... వెచ్చగా, మెత్తగా వున్న మల్లి స్పర్శ దేవయ్య శరీరంలోకి విద్యుత్తును పంపిస్తున్నట్లనిపించింది. అతడు చెప్పరాని అనుభూతిని పొందాడు.

ఆ అనుభూతి ఐదారుక్షణాలుందోలేదో... దడుసుకున్నట్లుగా దూరం జరిగాడు దేవయ్య. తప్పుచేసినవాడిలా, మల్లికేసి చూడలేక వెనుదిరిగి గబగబా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

అతడు కనిపించేదాకా అలాగే చూస్తూ నుంచుంది మల్లి.

దేవయ్య కౌగిలిలోని అనురాగం, ఆత్మీయత, ఆర్తి...ఆమె అణువణువునూ కదిలించాయి.

"మామ లేకుంటే తమ ఇల్లు పాడైపోయేది... తండ్రి మూలబడ్డప్పటినుండీ ఇంటి భారాన్ని మామే మోస్తున్నాడు. ఆ ఇంటి బరువునుమోస్తూ ఎల్లప్పుడూ తమ ఇంట్లోనే వుండాలంటే... ఉండాలంటే...?" ఒక ఆలోచన ఆమె మనసులో క్షణకాలం మెరిసి మాయమైపోయింది.

దేవయ్య వేగంగా నడుస్తున్నాడు. 'మల్లి సుతిమెత్తని, సులివెచ్చని కౌగిలింత... ఆ కౌగిలింతకు సంబంధించిన పులకింత... ఆ పులకింతలో ఒక ఆలోచన... వెంటనే అసహ్యం'



దేవయ్యా తనను తనే ఈసడించుకున్నాడు.

'నగమీడు చేరిన తాను... అప్పుడే వయసులో అడుగుపెట్టిన మల్లి! పొద్దువాలబోతున్న తాను... పొద్దెక్కబోతున్న మల్లి! తానెక్కడ... మల్లెక్కడ? ఈ ఆలోచనరావడం ఎంతపాపం?

కడిగిన ముత్యం... అందాలకుప్ప మల్లికాంబ. చెంప చిదిమి దీపం వెలిగించుకోవచ్చు... ఆ పసిదాన్ని తాను కోరడమా? ఎంత తప్పు...! అంతా బాగుండి పిల్లల్ని కంటే... తనకు ఇంచుమించు మల్లికాంబంత కూతురుండేది. అట్లాంటి పిల్లమీదికి తన మనసెట్లాపోయింది...? నిజంగా తన మనసులో ఓ రాక్షసుడు చొచ్చాడు.' మధనపడిపోయాడు దేవయ్యా.

'మల్లికాంబకు పెండ్లి చేయాలి....మంచి పిల్లవాన్ని చూసి ముడిపెట్టాలి. అప్పుడు తన కిట్లాంటి ఆలోచనలురావు.' అని ఆలోచించుకుంటూ శ్మశానం చేరాడు దేవయ్యా.

భిక్షపతిని దహనం చేసిన చోటుకు దగ్గరగా, ఓ సమాధినీడలో కూర్చున్నారు రాయలింగూ, గౌరమ్మలు.

ఇద్దరి చూపులూ భిక్షపతిని బూడిదచేసిన ప్రదేశాన్ని చూస్తూ వున్నాయి.

వాళ్ళనలా చూడగానే అతని గుండె చెరువయింది. మెల్లగా పోయివాళ్ళ దగ్గర కూర్చున్నాడు... సౌమ్యంగా మందలించాడు.

ఒక్కసారిగా ఇద్దరూ అతని మీద పడిపోయి బావురుమన్నారు. వాళ్ళను మామూలు స్థితికి తీసుకురావడానికి చాలాసేపుపట్టింది.

"దేవయ్యా! ఇంక మేమీ బూమ్మీదుండొద్దురా... ఎవలకోసముండాలె? ఏంజూసుకునుండాలె?" దీనంగా అడిగాడు రాయలింగు.

"ఈ వూరుమీద మన్నువడ...ఈ ఊరు తొవ్వకు కంపగొట్ట... నా కొడుకును మింగి నీల్లాగిందీవూరు... మమ్ముల దిక్కులేని పచ్చులజేసిందీ వూరు..." గౌరమ్మ అంది.

"బూమేంజేత్తది... ఊరేంజేత్తదే అదట్ల జరిగింది... గంతే! గీదీన్నే ఎనుకటోల్లు పొప్తై మన్నరు... వానికష్ట మీకు బాకిలేకుంటెనే వాని జాగలకు వాడు బోతడన్నరు. ఎందుకు బతుకాలె....సావురాకపాయె... అని మీరు సావునుకోరుకుంటాంద్రు... కోరుకుంటొస్తాదె...! బతుకు మన చేతులుంటదిగని, సావు మనచేతులుంటాదె మీ పిచ్చిగాని"

ఇలా వేదాంతిలా ముఖంపెట్టి మాట్లాడుతున్న దేవయ్యాను చూస్తూ ఉండిపోయారిద్దరు.

"రాయలింగు బావా! గౌరక్కా!! ఏంజూసుకొని బత్కాలె? ఎవలకోసం బత్కాలె, అని అంటాంద్రు... మరి మల్లికాంబలేదానె? అది మీ బిడ్డగాదా...? దాన్ని చూసుకోకున్నా యేంకాదా?" అడిగాడు దేవయ్యా.

దేవయ్యా అలా అడగ్గానే ఇద్దరూ ఒకేసారి ఉలిక్కిపడ్డారు. ఒంటరిగా వదిలివచ్చిన మల్లి

మ్మ గుర్తొచ్చి భయపడిపోయారు.

''ఇంటికిపోయే వచ్చినవా తమ్మీ... మల్లవ్వె ట్లున్నది...?''

''ఎట్లుంటదే... మాట్లాడెటోల్లెవలు లేక... పులుకుపులుకున బజారుజూనుకుంట కూసున్నది. తిన్నవా అంటోల్లేక, పన్నవా అంటోల్లు లేక బెంగటీలిపోయింది. మీరేమో మీ తోవజూసుకుంట ఈడికొస్తిరి... మరింకేంజేస్తది పసిపోరి... అదెట్లుంటె మీకేందే?''

''గట్లనకురా... మా బిడ్డ మాకు చేదంటవా.?'' రాయలింగు.

''చేదుగాకుంటేందే మరి...? లేకుంటె గాపోర్ని ఒక్కదాన్నిడిసి వస్తారె...? నీయవ్వ... సచ్చినోల్తోని సత్తారెవలన్న...? పోయినోడు పోయిండు.... ఉన్నోల్లను కాపాడుకోవద్దా...?'' సముదాయిస్తూనే మందలించాడు దేవయ్య.

ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

''నిజమే... మీకు రాగూడన్దే వచ్చింది... కాగూడన్దే అయింది. మరెట్ల...? ఏంజేద్దామని ఆలోసించుకోవాలె... ఏడ్సినప్పుడేడువాలె... ఒగలకొగలు ఓదార్చుకోవాలె... ఇద్దరు గిట్లయితెట్ల. ఉన్నోల్లేంగావాలె...? సచ్చినోడొస్తడా? అగో సూడు... పొద్దుగూకుతుంది... ఇంట్ల మల్లవ్వొక్కతే వున్నది. పోదాంపాఁరి...''

అతని మాటలు పూర్తి కాకముందే దేవయ్యను పట్టుకొని లేచాడు రాయలింగు. తర్వాత ఇద్దరు కలిసి గౌరమ్మను లేపారు.

ఇద్దర్నీ నడిపించుకుని ఇల్లుచేరాడు దేవయ్య.

ఇల్లుచేరగానే బావురుమన్న బిడ్డను అక్కున చేర్చుకుంది గౌరమ్మ. రాయలింగో చోట చతికిలబడిపోయి, మల్లికాంబను చూస్తూ కుమిలిపోయాడు.

తర్వాత బతిమాలి, బామాలి, అదిరించి, బెదిరించి ఇద్దరి చేతా అన్నం తినిపించాడు దేవయ్య. ఆ తర్వాత తనూ, మల్లికాంబా కలిసి తిన్నారు.

రాయలింగూ, దేవయ్యా ఓ చోట... గౌరమ్మా, మల్లికాంబలో చోట పడుకున్నారు. పడుకున్నారే కాని ఎవ్వరికీ నిద్రలేదు.

గుడిసెల్లో చాలావరకు సద్దుమణిగింది. అప్పుడోటీ, ఇప్పుడోటీ రోడ్డు మీద వాహనాలుపోతున్న చప్పుడు వినిపిస్తోంది.

గౌరమ్మ వినిపించేటట్లూ...రాయలింగు వినిపించకుండా ఇద్దరూ ఏడుస్తున్నారు.

''ఇగో బావా! అక్కా! మీకు కోపమొచ్చినా సరెగని... మీరు పిచ్చిపని చేస్తాన్నౌ... వచ్చిన కష్టాన్ని తల్సుక తల్సుక యేడ్సి... ఇంకిన్ని కష్టాలు తెచ్చుకునుడు మంచిదికాదు. అసలు గిసొంటప్పుడే ధైర్నం తెచ్చుకోవాలె'' నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ అన్నాడు దేవయ్య.

''ఎట్ల ధైర్నం తెచ్చుకోవాల్రా... ఏంజూసుకొని ధైర్నంగా బతుకమంటవ్...?''

''మల్లగట్లనే అంటవ్... మల్లికాంబ నీ బిడ్డగాదా! అగో...గాదాన్ని చూసుకోని బత్కాలె''

''ఆఁ...చెట్టంతెదిగి చేతికొచ్చినోడే నాశిడమైపాయె... నోట్లకొచ్చిన బుక్కె మంట్లెగల్సిపాయె... ఇగ గీపొల్లా...? అది బతికి బట్టగట్టిన్నాడుగదా! ఏమొ... నాకాసె లేదురా దేవయ్యా'' నిర్లిప్తంగా అన్నాడు రాయలింగు.

''నీ ఆసెలు బుచ్చిగానితోని పోయినయని ఒప్పుకుంట. నువ్వు వాని బాకి తీర్చుకున్నావ్. కని మల్లమ్మకు నువ్వింక చేసేటియి శానవున్నయ్... దాని బాకి తీర్చుకోలే నువ్వు...''

రాయలింగు మౌనంగా వింటున్నాడు.

''మల్లవ్వ నీకింక పొల్లతీర్గనే కనిపిస్తందా...? అదింక చిన్న పోరిగాదు... ఈడేరింది. పెండ్లీకెదిగింది... కన్నందుకింత పెండ్లిచేసి దాని బాకి తీర్చుకోవా మరి...?''

'ఈ ఆలోచన తనకుండేది... భిక్షపతి ఆలోచనల్లో అన్నీ మరుగున పడిపోయాయి. ఇప్పుడు కర్తవ్యం గుర్తుకొచ్చింది' రాయలింగు ఆలోచనలో పడిపోయాడు.

''గౌరక్కా! సచ్చినోని కోసం సత్తనంటాంఁడు... మరి బతికినోల్లనేంజేసిపోదామనుకుంటాంఁడు...?''

''ఇంత చేసిందక్కెరకొచ్చిందా తమ్మీ...? ఇగ గిదక్కెర కొస్తాది...! ఐనా సద్దామనుకుంటె మాఁత్రం మాకు సావెక్కడిది?'' గౌరమ్మ నిరాశగా అంది.

''ఆఁ... గంతే అక్కా గంతే... ఏది మనకక్కరకు రాదు. గీపోరి గూడ మనకక్కెరరాదు.




గందుకే పోరిమానాన పోర్నిడిసి పెట్టి... మీరిద్ద రొక్కపాలే సావు్రి... అటెంక అదేమయితె మీకేంది...? అదూరుమీనబడి తిరిగింది మీరు చూడొస్తరా? బుచ్చమెత్తుకోని బతికేది మీరు చూడొస్తరా? అకరికి దిక్కులేక, దేసలేక యేడ్చే డ్చి యాన్నో ఒకాడ పానాలు తీసుకునేది మీరు సూడొస్తరా...?'' దేవయ్య కటువుగా అన్నాడు.

''గట్లనకు తమ్మీ...! నా కాన్పే పాపపు కాన్పు... అదిగూడ గట్లయితె...గట్లయితే'' మాటలు వెదుక్కుంటోంది గౌరమ్మ.

''తప్పకుంట గట్లనే అయిద్ది. అదూరుమీన బడి తిర్గుతది. వాడు దస్నంగ, వీడు దస్నంగ... బజార్లబడి... కొనాకు బుచ్చమెత్తు కోని తిరుగుతది... పిచ్చిదైపోద్ది... ఇసుగుబుట్టి బాయో చెరువో చూసుకోని, పానాలు తీసు కుంటుంది. ఎదిగినపోరి...ఎవలూ చూసుకోని పోరి... దిక్కులేనిపోరి... గట్లగాకుంటె మరింకెట్లయిద్దే...?''

''వద్దు వద్దు... నా బిడ్డ గట్లకావద్దు...'' గౌరమ్మ ఆక్రందన.

''సావలేక బతుకుతానం... మమ్ముల బయ పెట్టకురా... మమ్ముల ఏంజేయిమంటానవ్...? మా చేతులేమున్నది'' రాయలింగు తల్లడిల్లి పోతూ అడిగాడు.

''అగో... గదే తప్పంటాన. సావలేక బతుకుడుగాదు... బతుక్కోసం బతుకాలె బతికున్నోళ్లకోసం బతుకాలె బతుకుతో పోరాడుకుంట బతుకాలె. నేనో మాటడుగుత... తప్పుబట్టకు ౹్రి... శాతనైనంతకాలం ఇంత సంపాయిస్త... గండ్లనే నల్గురం తిందాంగనీ... రేపటికల్లా నాకేమన్నయిందనుకో... గప్పుడు అందరికి తిండెట్ల...? గదాలోసించినవా...?''

''గట్లనకురా దేవయ్యా! నీకెందుగ్గావాల్రా...? గామాట ఇంటెనే నాకు బయమయితాంది. ఇప్పుడు మాకు నువ్వు దప్పెవలున్నరు...? నా సోపతితోని నీకేమన్నయిద్దోయేమోనని... ఇప్పటికే నాకు అగులు బుగులైతాంది. నాదంటె పాపకారి బతుకు... నీకేం కావద్దురా దేవయ్యా!'' వికలమైన మనస్సుతో, వణకుతున్న స్వరంతో ఈ మాటలని, లేచికూర్చున్నాడు రాయలింగు.

''నాకేంగాదులేవే... మొండి మొదలారున్న ఏక్‌నిరంజన్‌గాన్ని... నా సంగతట్లుంచు... రేపటినుంచి కుటుమానికింద తిండిపెట్టే ఉపాయం చూస్తవాలేదా...?'' తానూ లేచి కూర్చున్నాడు దేవయ్య.

''నేనింక ఊర్లె ఏంపనిచేస్తరా...? నాకీ ఊరంటెనే బయమైపోతాంది... ఊర్లెరు పోవాల్నంటెనే వనుకుడు వుడుతాంది''

''పనిలబడితే బయంపోద్ది... మనసు కనని మ్మలమైద్ది...''

''నిమ్మలం... ఇంకీ పానానికి నిమ్మలంలేదు గనీ... మేము మల్ల మా ఊరికి పోతంరా దేవన్నా! మా ఊర్లె నా కొడుకు పోలీసులల్ల వడ్తడని, దెబ్బలు తిని జైలుపాలైతడని... బయపడి ఈ వూరికొచ్చినం. ఈడ దెబ్బలు తిన్నడు... జైల్లబడ్డడు. ఆకరికి పానాలు గూడ పోగొట్టుకున్నడు. అడనే వుంటె... తన్నులు తినుకుంట కండ్లముందు వుండెటోడు కావచ్చు. ఈడ కండ్లగ్గనుపడకుంట మాయమైండు. ఇంకీడ ఉండలేనురా దేవయ్యా! అడికేపోయి చెట్టు కావలో, చేనుకావలో ఉండుకుంట బతుకుత'' దుఃఖంతో రాయలింగు గొంతు పూడుకుపోయింది.

''నీ పిచ్చిగాని బావా! అడైనా ఈడైనా ఇంత కష్టం చేసుకుంటెనే మన కడుపులు నిండుతయ్. అడలేని కావు ఈడలేదు... ఈడ లేని సుకం అడలేదు. ఏడనైనా మన బతుకు లొక్కటేనే...''

దేవయ్య మాటలు పూర్తిగా అర్థంకాక ఆలోచనలోపడిపోయాడు రాయలింగు.

''నువ్వెన్నన్న జెప్పు తమ్మీ! అటు చూసినా, ఇటు చూసినా మాకు బుచ్చయ్యే కండ్లల్ల మెరుస్తాండు. మేమీడ ఉండలేం తమ్మీ!'' గౌరమ్మ కలిగించుకుంది.

''మరి ఆడికిబోయినంక మాత్రం కనిపించడానె అక్కా...?''

గౌరమ్మ మాట్లాడలేకపోయింది. తానూ ఆలోచనలోపడిపోయింది.

''సరె...మీకంతిష్టముంటె ఆడికే పోదురుతీ... చెట్టు కావలి, చేనుకావలి చేసుకోని బత్కురుతీ... మరి మల్లికాంబ సంగతేంది?''

దేవయ్య ప్రశ్న ఇద్దరికీ అర్థంకాలేదు.

"అదేనే... మరి దాని పెండ్లి చేయరా? ఆడ మీ తిండికే సరిపోదు. మరి దాని పెండ్లెట్ల చేస్తరే...?"

"ఎవలో ఓ అయ్యకాల్లు పట్టుకోని చేతుల పెట్టాలె..."

రాయలింగీ మాట అన్నాడే కాని... అదెంత అసాధ్యమైన విషయమో... అతనికి బాగా తెలుసు. కనీసం తలెముంతకూ, పుస్తెమట్టె లకూ, తిండి ఖర్చుకూ డబ్బు కావాలి.

"నేనంటాన్నని మనసు కస్టపెట్టుకోకుర్రి గనీ... ఆడికిపోయి మీరు దాని పెండ్లి చేయలే రు. ఒకేల చేసినా... దానికి తగ్గోన్ని మీరు తేలేరు ఆ కాల్లు పట్టుకునుడేదో... ఈడనే ఓ అయ్యకాల్లు పట్టుకోర్రి ఆయింత దాన్నే ఇంటి దాన్ని చేసిపోర్రి"

"ఈడనా...? ఇప్పుడా...? నాతోనయితదా?"

"ఈడైతే నేనున్నగదనే... పెండ్లి కర్సు నా బారం... ఆడీడ తిరిగి ఓ మంచిపిలగాన్ని సూద్దాం దానిపెండ్లి చేద్దాం... గప్పుడు మీరూరి కి పోదురుతీ"

"నా బిడ్డ పెండ్లికి నువ్వు కర్సుపెత్తవా...? పిలగాన్ని చూస్తవా?" రాయలింగు కళ్ళు చె మ్మగిల్లాయి.

"నీ బిడ్డ... నీబిడ్డ అంటానవ్... అది నా కోడలుకాదా?"

"ఇప్పటికే శానజేసినవ్ తమ్మీ... వద్దు... నీ కస్టం శాన అనుబగించినం... ఇంకా నీ కస్టాన్ని మాకు దారబోయకు. ఇప్పట్నుంచి ఇన్ని పైస లెన్కేసుకోకుంటె... రేపు మంచంల పడ్తంక ఎవలరుసుకుంటరు తమ్మీ..."అంది గౌరమ్మ లేచి కూర్చుంటూ.

"మంచంల బడితె గుడుసెలోలు లేరా...? లేరనుకో... మీ దగ్గరికొస్త... మీరు లేరనుకో... మల్లికాంబింటికి పోత" గలగలా నవ్వుతూ అన్నాడు దేవయ్య.

దేవయ్యనేమనాలో వాళ్లకర్థం కాలేదు. ఆశ్చ ర్యంగా అతన్నే చూస్తూవుండిపోయారు.

"అయిన మీ పిచ్చిగాని... నేను మంచంలెందుకుపడ్తనే? నేను మీకేదో చే సిన్నని, కస్టం దారబోసిన్నని శానశాన సదువు తాండ్రు... నా సాయెం మీకెక్కడా అక్కెరకు రాలే. చూసుకున్న యాల్లో... ఇంకేదోకాని... గింతమందిల మీరంటె, నాకు నావోల్లని పిస్తది... ఎప్పుడో పోగొట్టుకున్న నావాల్లు మీ ఇంట్ల కనిపిస్తరు. నన్ను కన్నకొడుకోలె, సొంత తమ్మునోలె చూసుకున్నరు. నా సాయమేది మీ కక్కెరకు రాలే. గిప్పుడు ఆకరిసాయం... కోడలి పెండ్లి, నా చేతులమీద చేయనీయిర్రి ఆకరికి గాతురితన్న నాకు మిగలనీయిర్రి..." ప్రార్థిస్తున్నట్లుగా అన్నాడు దేవయ్య.

"మా అదురుస్టానికి నువ్వేం జేత్తవ్ తమ్మీ... దేవుడు మాకు గింతే రాసిపెట్టిండు నీ అవ్వక డుపు సల్లగుండ... నువ్వు నా ఆవుసుగూడ పోసుకోని బతుక. నీరునం తీరది తమ్మీ..." బొంగురుపోయిన గొంతుతో అని కళ్ళు తుడు చుకుంది గౌరమ్మ.

"సచ్చి నా కడుపులబుట్టి నా రునం తీర్సు కుందువుతీ అక్క..." నవ్వుతూనే అన్నాడు దేవయ్య.

"గా అదురుస్టం నాకేడున్నతమ్మీ! గట్ల పుడదామంటె, నీకు పెండ్లే కాదాయె..."

దేవయ్య నవ్వాగిపోయింది... అతని ముఖక వళికలు మారిపోయాయి. తానన్నమాట ఎంత అర్థంలేనిదో తెలిసి, అతని ముఖం వివర్ణమై పోయింది.

ఈ మాటలు వింటున్న రాయలింగు మెద డులో మెరుపులా... ఒక ఆలోచన ప్రవే శించింది. దానికాకారమివ్వడానికి అతడు ప్ర యత్నిస్తూ వున్నాడు.

"రునం రునం అని ఊకె అనకక్కా...! మనిసికి మనిసి సాయంగాకుంటె మానుకైత డా? మాను సాయంజేస్తదా...?" కొంచెం తేరు కుని అన్నాడు దేవయ్య.

రాయలింగు ఆలోచనకో ఆకారం వచ్చింది.

"వారీ దేవన్నా! నేనిట్లంటాన్నని ఏమను కోకు... నీకేమంత యీడుపోలేదు. లోకంల నీ యీడోల్లు పెండ్లిల్లు చేసుకుంటనే వున్నరు... పిల్లలు గంటనే వున్నరు. నువ్వుగూడ పెండ్లి చేసుకోరా దేవయ్యా..." అన్నాడు రాయలింగు.

ఈ మాటలు విని చిన్నగా నవ్వుకున్నాడు దేవయ్య.




"మా మల్లవ్వకు పెండ్లి చేయమని ను వ్వంటానవ్... నువ్వు పెండ్లి చేసుకొమ్మని నేనంటాన. ఇద్దరికీ పెండ్లిల్లు కావాలె... పిలగా న్నీ, పిల్లనూ ఉంకోకాడ ఎనుకులాడేకన్న... నువ్వొప్పుకుంటె... మా మల్లవ్వను నీకిస్త... నిన్ను మల్లవ్వకిస్త... మా మల్లవ్వను పెండ్లి చేసుకోరా దేవయ్యా!" నిదానంగా ఒక్కొక్క మాటే అన్నాడు రాయలింగు.

ఒక్కసారిగా దేవయ్య నవ్వాగిపోయింది.

అతని నెత్తిమీద పిడుగుపడ్డట్లుగా అదిరిప డ్డాడు. నాలుగైదుక్షణాలు ఎలాగో నిభాయించు కుని...

"నీకు పిచ్చిగిన లేసినాదె బావా? ఏం మా టలు మాట్లాడినవ్...? నాయిడెక్కడ...దానీడె క్కడ? నిన్న మొన్నటిపిల్లను పట్టుకొని...గీమా టెట్లనబుద్ధయింది నీకు?" కోపంగా అన్నాడు దేవయ్య.

"ఈడుదేమున్నత్తమ్మీ? ఎంత పున్నెంజేసు కుంటే నీఅసొంటి భర్త దొర్కాలె నాబిడ్డకు.? నువ్వొప్పుకుంటె...గిది నాగ్గూడ ఇష్టమే తమ్మీ?" మల్లిని పొదివిపట్టుకుంటూ అంది గౌరమ్మ.

దేవయ్యకేం మాట్లాడాలో తోచలేదు. ఉక్క పోసినట్లుగా, అతని శరీరం నుండి వేడిసెగ లు వస్తున్నాయి. అతని మెదడునిండా ఆలోచ నల కందిరీగలు...

'వీళ్లు నిజంగా అంటున్నారా? ఏదోవిధంగా పిల్లపెళ్ళి చేయాలని అంటున్నారా? తాను మల్లికాంబకు తగినవాడా? తనతో ఆ పిల్ల సుఖపడుతుందా? అసలాపిల్లకిది యిష్ట మేనా? ఇలా ఎన్నో ప్రశ్నలు...అతడు సమాధా నాలకోసం వెతుక్కున్నాడు. ఆ తర్వాత చాలా నిదానంగా అన్నాడు—

"పిలగానికోసం యాడెన్కులాడాల ని...పెండ్లి పైసలేడతేవాలని ఎట్లనో అట్ల పిల్ల నొదిలించుకుందామని అంటానారె మీ రు...?మీరే తిప్పలూపడొద్దు...ఈడుజోడున్న పిలగాణ్ని నేనేచూసి పెండ్లిచేస్త...మీరూకెనే చూసుకుంటుండుర్రి..."

"నేను గట్లంటలేనురా...కస్టపడి యాన్నో ఓపిల్లగాన్ని దొరుకబడ్తం. నీ అసొంటోల్ల సాయంతోని కతకతపెండ్లిజేస్తం...కని అటెంక? నాబిడ్డనెట్ల సాదుకుంటడో...నాబిడ్డ యేకస్టంపడుతాందో— గొరందిలబడి సావాలె. నా బిడ్డను పువ్వులపెట్టుకొని సాదు కునే మనసు నీకున్నది. నువ్విస్టపడితే గిది కానియ్యి... మా జీవనాలకు గీ తురితన్న మిగు లనీయి" ప్రాధేయపడ్డాడు రాయలింగు.

"తమ్మీ! కులపోనివి కాకపోయినా...తోడబు ట్టిన తోడోలె, అడుగకుంటెనే మాకెన్నో సాయా లు చేసినవ్. నాకు సొంత తమ్మునివే అయి నవ్... ఇప్పుడు నోరిడిసి అడుగుతాన...నువ్వు కాదనకు తమ్మీ!" ప్రార్థించినట్లుగా అంది గౌరమ్మ.

ఎక్కడో అడుగున...అణిగిపోయివున్న ఉత్సాహం పైకిచిమ్మి, దేవయ్య హృదయం గాలిలో తేలిపోయింది.

"మల్లికాంబ చిన్నపిల్లగాదు...దానిగ్గూడ యిస్టముంటది, అయిస్టముంటది. మరి దాని కి నేనంటిస్టమో లేదో తెలుసుకున్నారె?" ఈ మాటలంటున్నప్పుడు, ఎన్నడో అతన్ని వదిలి వెళ్లిపోయిన సిగ్గు ఇప్పుడతని ముఖంలో చే రింది.

"పసిపిల్ల ...గాదానికేమెరుకరా?" అన్నా డు రాయలింగు.

"మరి పసిపిల్లను నామెడకెట్లకడుతారే?" నవ్వాడు దేవయ్య.

అప్పటికే గౌరమ్మ బిడ్డతో గుసగుసగా మాట్లాడుతోంది. ఆ మాటలు పైకి వినిపిస్తూనే వున్నాయి.

"బిడ్డా! దేవయ్యమామ నీకిస్టమేనా?" మల్లి కాంబ సిగ్గుకెరటాల్లో ఉక్కిరిబిక్కిరైపోతూ తల వంచుకుంది.

"దేవయ్యమామ దేవునసొంటోడు...కన్న తండ్రోలె నిన్ను కడుపుల పెట్టుకొని కాపాడు కుంటడు. పానానికి పానంగా చూసుకుంట డు...చెప్పు బిడ్డా"

మల్లికాంబ ఓసారి తలెత్తిచూసింది. తర్వాత తల్లిని గట్టిగా కౌగిలించుకుంది. ఆ తర్వాత ఆమె ఒడిలో ముడుచుకు పడు కుంది.

"నా బంగారుతల్లే...నువ్వన్న సు కంగుంటవ్ బిడ్డా! మాకంతేసాలు" మల్లికాంబ

తలనిమురుతూ అంది గౌరమ్మ.

రాయలింగు హృదయం తేలికైపోయింది.

"నా బిడ్డ కిస్మతుమైంది దేవన్నా! కట్నకానుక లు, బట్టబాతలు, తలెముంతలు...ఇప్పుడేవి పెట్టకపోయినా ఉండంగుండంగ అన్ని చేస్త. ఊర్లెకు పోయినంక నా ఓపానశక్తి... ఒక్కొక్కటి సదురుత... మీరు సల్లగ బతికి, సక్కగ సంసారం చేసుకొన్రి..." తృప్తిగా అన్నాడు రాయలింగు.

"కట్నకానుకలు...బట్ట బాతలు అన్నీ నాకు మల్లికాంబనే" అన్నాడు దేవయ్య సంతోషంగా.

"మా బుచ్చయ్యుంటే... ఎంత సంబ్రపడేవాడో" అంటూ కళ్ళు తుడుచుకుంది గౌరమ్మ.

★ ★ ★

దేవయ్య మల్లికాంబను పెళ్ళి చేసుకున్నాడు. తన గుడిసెలో కాపురంపెట్టి, రాయలింగునూ, గౌరమ్మనూ తమతోనే వుండమన్నాడు.

దేవయ్య జీవితం ఓమలుపు తిరిగింది. ఇప్పుడతడు గుడిసెవాసులకు సలహాలు చెపుతూ, పనిచేసుకుంటూ బతుకు కొనసాగిస్తున్నాడు. ఆ బతుకులో కలిగే అలుపూ, బరువులను...తోడు నీడగావుంటూ పంచుకొని సేదదీరుస్తోంది మల్లికాంబ.

మునుపటిలా సర్దార్ వసూళ్లకు తోడ్పడటంలేదు దేవయ్య. సరిగదా వడ్డీపేరుతో సర్దార్ చేస్తున్న దోపిడిని ఎదిరిస్తూ... గుడిసెవాసులందరికీ నిజమైన నాయకుడయ్యాడు దేవయ్య.

నెలరోజులపాటు హాస్పిటల్‌లోవుండి డిశ్చార్జైన సర్దార్ ఇప్పుడు కర్రలసాయంతో మాత్రమే నడువగల్గుతున్నాడు.

అతని పాతబాకీలేవీ వసూలు కాలేదు. కొత్తగా అతని వద్దకు బాకీలకెవరూ రావడంలేదు...మర్డర్ కేసులో అవిటివాడై కోర్టుచుట్టూ తిరుగుతున్న సర్దార్‌ను అంతా తిడుతున్నారు.

సర్దార్ దగ్గరి పహిల్వాన్లమీదా, సత్తి దాదా మీదా మర్డర్ కేసు నడుస్తోంది. మునిసిపాలిటీ చెయిర్మన్ పూర్వంలా పొగరుగా లేడు.

శివయ్యా...మరికొందరు యువకులు పోలీస్‌స్టేషన్‌లో చావు దెబ్బలుతిని, కోర్టులచుట్టూ తిరుగుతున్నారు.

రాయలింగు, గౌరమ్మల మనసులనుండి తమ ఊరికి తిరిగి పోవాలన్న కోర్కె తుడుచుకుపోయింది. బిడ్డ సంసారం చూసుకుంటూ వాళ్ళు అక్కడే వుంటున్నారు.

బిడ్డా, అల్లుడూ పువ్వుల్లో పెట్టుకుని చూసుకుంటున్నా... నెలరోజుల తర్వాత వాళ్ళు తమ గుడిసెకు తిరిగొచ్చారు. కాళ్లూ, రెక్కలు ఆడినంతసేపు పనిచేసుకుంటూ... బిడ్డను చూసుకుంటూ అక్కడే కాలం గడుపుదామని నిర్ణయించుకున్నారు.

రాయలింగు మళ్లీ అప్పు పుట్టించుకున్నాడు. గుడిసె బాగుచేయించుకున్నాడు. మళ్లీ తన కూరగాయల వ్యాపారం మొదలుపెట్టాడు.

గౌరమ్మకూడా ఓ ఇంట్లో పనికి కుదిరింది.

అప్పుడప్పుడు వాళ్లకు భిక్షపతి జ్ఞాపకం వస్తున్నా... మల్లికాంబ సుఖాన్ని చూసుకుని, ఆ దుఃఖం మరిచిపోతున్నారు.

హోల్‌సేల్ మార్కెట్‌కు పోవడం... కూరగాయలు కొనుక్కొని రావడం... బండిమీద పేర్చుకుని కాలనీవెళ్లడం... రోజు పదో ఇరవయ్యో సంపాదించడం... తాము తినగా మిగిలింది, మల్లికాంబకు పంపడం... రాయలింగు నిత్యజీవితమై పోయింది.

"దేవుని పున్నేన గిట్లనే కొంతకాలం తిప్పలుబడితె... సొంత పెట్టుబడితోని యాపారం సాగుద్ది. కొన్రోజులకు మనమో బండి కొనుక్కుందాం... ఇంకా నసీబు కలిసొస్తె, ఆ కాలనీల్నే ఓ కూరగాయలడబ్బా తెరుసుకుందాం. అటెంక మెల్లమెల్లగ ఇన్ని పైసలెన్కేసుకుని, ఊర్లె బూమి నిడిపిద్దాం... ఇద్దరు ముగ్గురు పిల్లలు పుడితె మల్లికాంబ కక్కెరకొస్తద్, బూమి. అటెంక... గిట్లనే గడుపుకుంట, మనుమలతోని మనుమరాండ్లతోని ఆడుకుంట బతుకుదాం" అని గౌరమ్మకు వీలు దొరికినప్పుడల్లా చెబుతున్నాడు రాయలింగు.

అలా కలలుకంటూ... కాలనీకేసి బండిని తోసుకుంటూ బతుకు సాగిస్తున్నాడు రాయలింగు.

★



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర' "**చతుర సమీక్ష**" శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆనవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు :

1. '**చతుర సమీక్ష**' కు పంపే మీ రచన అరఠావుకుమించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈకింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై "**చతుర సమీక్ష**" కు అని పేర్కొనాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మూడింటికి రు.100, రు.75, రు.50 చొప్పున, మరో మూడింటికి రు.25 చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచేలక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనేవంతు పాఠకులదే.

## కూపన్

**మే 'చతుర' నవల : బతుకు**

**సమీక్షకుని పేరు** ..........................................

**చిరునామా** ..........................................

..........................................

..........................................



# చతుర కథలు

## ఎందుకోసం....?

సుబ్బారావు భార్య పంకజాక్షి కొత్తగా కాపురానికి వచ్చింది.

పంకజాక్షికి ఆడబిడ్డ ఆరళ్లు, అత్తమామల పోరు లేదు.

సుబ్బారావు బాంకు ఆఫీసర్.

ఆరోజు ఆదివారం. ఏదయినా సినిమాకు వెళ్లామనిపించింది సుబ్బారావుకి.

''ఈరోజు ఏదయినా సినిమాకు వెళ్దామా?'' టిఫిన్ వడ్డిస్తున్న భార్యని అడిగాడు సుబ్బారావు.

''మార్నింగ్ షోకా? మ్యాట్నీకా?'' అడిగింది పంకజాక్షి.

''మ్యాట్నీకి''

''తెలుగు సినిమాకా? హిందీ సినిమాకా?''

''తెలుగు సినిమాకు''

''డబ్బింగ్‌దా...? డైరెక్ట్‌దా?''

''డైరెక్ట్‌దే''

''సాంఘికమా? జానపదమా?''

''సాంఘికమే''

''హీరో ఎవరు?... కమల్‌హాసనా? చిరంజీవా??''

''చిరంజీవి''

''హీరోయిన్ విజయశాంతా? రాధా?''

''ఇద్దరూ...!!''

''డైరెక్టర్ కోదండరామిరెడ్డా? రాఘవేంద్రరావా?''

''కోదండరామిరెడ్డి''

''కెమేరా కె.యస్.ఆర్.స్వామిదా? లేక ప్రకాష్‌దా?''

''ప్రకాష్...!''

''సంగీతం కె.వి.మహదేవనా? చక్రవర్తా...?''

''చక్రవర్తి''

''ఇంతకీ సినిమా థర్టీ ఫైవ్ యమ్.యమ్.దా? సినిమా స్కోపా?''

''థర్టీ ఫైవ్ యమ్.యమ్.''

''సినిమా హాలు దగ్గరా? దూరమా?''

''కొంచెం దూరమే''

''అయితే రిక్షాలో వెళ్దామా? ఆటోలో వెళ్దామా?''

''ఆటోలోనే వెళ్దాం''

"పట్టు చీర కట్టుకోనా? విమల్ చీర కట్టుకోనా? నీలి రంగుది బావుంటుందా? కనకాంబరం రంగుది బావుంటుందా?"

"నీలి రంగే"

"అన్నట్లు తల్లో మల్లె పూలు పెట్టుకోనా? లిల్లీ పూలు పెట్టుకోనా?"

"మల్లెపూలు"

"మరి మీరు...??"

"తెల్ల రంగు షర్టు, నల్ల పాంట్‌లో టక్ చేసి కాళ్లకి మాస్ వేసుకొంటాను. కళ్లకి గాగుల్స్ పెట్టుకొంటాను.... అన్నట్లు ఇంతకీ మనం డ్రెస్ చేసుకొని తయారయేది ఎందుకోసం....?" బుర్ర గోక్కుంటూ అడిగాడు సుబ్బారావు.

"అయ్యో? నేను కూడా మర్చిపోయానే...!!" వంత పాడింది పంకజాక్షి వాపోతూ.

## రాజకీయం

ఎన్నికలు దగ్గరకొచ్చేయి. గత ప్రభుత్వంలో మావుళ్ళయ్య మంత్రిగా పనిచేశాడు.

ఇప్పటి ఎలక్షన్లలో మళ్ళీ తన నియోజక వర్గంలో నిలబడ్డాడాయన.

ప్రతిపక్షాలన్నీ కలిసి ఓ ఇండిపెండెంటుకు మద్దతు ఇచ్చి మావుళ్ళయ్యకు పోటీగా నిలబెట్టాయి.

పోటీ ఉధృతంగా వుంది.

ఇండిపెండెంటుగా నిలబడిన రాజనర్సయ్యకు రాజకీయ అనుభవం బొత్తిగా లేదు. కానీ నియోజకవర్గంలో ప్రజలకు సుపరిచితుడు తను. కరువు కాటకాలవంటి ఉపద్రవాలు వచ్చినపుడు తోటిప్రజలకు నిస్వార్థంగా సహాయపడ్డాడు.

మంత్రిగా ఉన్నప్పుడు మావుళ్ళయ్య తన నియోజకవర్గానికి వరగబెట్టింది ఏమీలేదు. తను మాత్రం బ్రహ్మాండమైన బంగళా కట్టించుకొన్నాడు. నగరం నడిబొడ్డులో చక్కటి థియేటరు నెలకొల్పాడు.

యువకులు, స్త్రీలు అంతా రాజనర్సయ్యకే మద్దతు ప్రకటించారు.

ఊళ్లోని ప్రతి ఇంటి మీద రాజనర్సయ్య పోస్టర్లు వెలిసాయి.

మైకుల్లో ఇరవైనాలుగ్గంటలూ రాజనరసయ్య నుత్తే వినబడుతోంది వాడవాడలా.

మావుళ్ళయ్యకు సంబంధించిన ఒక్క వాల్ పోస్టర్ కూడా లేదెక్కడా! కనీసం ఒక్క మీటింగయినా ఏర్పాటుచేయలేదు! రాజనర్సయ్య తరపున రాష్ట్రస్థాయి ప్రతిపక్ష నాయకులు వచ్చి ప్రసంగిస్తున్నా మావుళ్ళయ్యలో ఎలాంటి చలనం కనబడ్డంలేదు.

నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నాడు మావుళ్ళయ్య. దాంతో రాజనర్సయ్య వర్గానికి మరింత ఉత్సాహం కలిగింది. తమ ప్రచారాన్ని ఇంకా ఉధృతం చేశారు. రాజనర్సయ్య ఇంటింటికీ వెళ్ళి ప్రతిఒక్కరి యోగక్షేమాలు కనుక్కొని వస్తున్నాడు.

ఎన్నికలు మరింత దగ్గరకు వచ్చేసాయి. సరిగ్గా ఆ సమయంలో ఓ రోజు మావుళ్ళయ్య హైదరాబాదు వెళ్ళివచ్చాడు.

ఆ మర్నాడు రాజనర్సయ్య పోటీనుంచి ఉపసంహరించుకొన్నాడన్న వార్త కారుచిచ్చులా వ్యాపించింది.

ప్రతిపక్షాలు ఎలాంటివ్యాఖ్య చేయలేదు. పోటీ లేకపోవడంతో ఏకగ్రీవంగా మావుళ్ళయ్య ఎన్నికయినట్లు ప్రకటించారు.

"మొత్తానికి ఒక్కపైసాకూడా ఖర్చుపెట్టకుండా గెలిచారు!" మావుళ్ళయ్యను ప్రశంసిస్తూ అన్నాడో తోటి నాయకుడు.

"భలేవారే! రాజనర్సయ్య ప్రచారపోటీ నుంచి తట్టుకోడానికి అధిష్ఠాన వర్గం నుంచి పదిలక్షలు తీసుకొన్నాను!!"

"కానీ ప్రచారానికి ఏమీ ఖర్చు చేయలేదు కదా!?"

"పోటీ నుంచి తప్పుకోవడానికి రాజనర్సయ్యకు ఆరు లక్షలిచ్చాను. ఎన్నికల్లో ఎలాగయినా మా పార్టీయే గెలుస్తుంది. అప్పుడు నేను మంత్రినవడం ఖాయం. రాజనర్సయ్య కొడుక్కి మంచి ఉద్యోగం కూడా ఇప్పించగలను. అదే రాజనర్సయ్య గెలిస్తే ఏమవుతుంది....?ప్రతిపక్షసభ్యుడిగానే మిగిలిపోయేవాడు. ఆ విధంగా ఇద్దరం నష్టపోయేవాళ్ళం. ఇప్పుడయితే ఇద్దరం లాభపడ్డాం కదా...!?"

—కె. శ్రావ్య

## దానికి బదులుగా పాఠకులు 'సితార'కు తిరిగి ఇచ్చేదేమిటి?

వారం వారం పెరుగుతున్న
వారి ఆదరణ, అభిమానం











"ఆగు" గద్దించింది ఆమె. తుళ్లిపడ్డ మనోహరి మళ్లీ నిటారుగా నిల బడింది. వెర్రిగా ఆమె వైపు చూస్తూ ఉండిపోయింది.

"కూర్చోమని నేను చెప్తేగానీ ఎవరూ నా ఎదుట కూర్చోడానికి వీలులేదు. జ్ఞాపకం ఉంచుకో! నీ పేరు?" అని అడిగిందామె మళ్లీ.

శరీరంతోబాటు గొంతు కూడా ఒణికింది మనోహరికి. అంతలో, మునిగి పోతున్న మనిషికి గడ్డి పోచలా ఒక ఊహ వచ్చింది ఆమెకు. వాయిస్ టెస్ట్ కోసం సురాజ్‌మల్ సినిమాల్లోలా ఒక సన్నివేశం కల్పించి తన గొంతు రికార్డ్ చేయిస్తున్నాడేమో! ఆ తలపుతో కొద్దిగా ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా 'మనోహరి' అంది అక్షరాలు కూడబలుక్కుంటూ. తర్వాత "మీ...మీ...రు...మీ రెవ్వరు?" అంది వణికిపోతూ.

పకపక నవ్వింది ఆస్త్రీ. హాలు గోడలు ఆ నవ్వును పదిరెట్లు ఎక్కువ చేశాయి. అతి కష్టంమీద నవ్వడం ఆపిన ఆమె "నేనా? నేను ఇవ్వాల్టి నుండి నీ యజమానిని! నన్ను 'మేడం' అని పిలు. అదే నాపేరు." అంది.

ఎవరా మేడం...?

ఎవరీ మనోహరి...?

ఆ విషమ పరిస్థితి ఎలా ఎదురయింది మనోహరికి?

మారుమూల పల్లెటూరి పిల్ల 'గవిరి' 'మనోహరి'గా ఎలా మారింది?

ఆపై ఏమయింది?

## వచ్చేనెల చతురలో...

### భట్టిప్రోలు కృష్ణమూర్తి నవల 'ఊబి'

చతుర నిర్వహించిన నవలల పోటీలో రు. 3000/-ప్రత్యేక బహుమతి పొందిన నవల 'ఊబి'ని. జూన్ చతురలో మీరు చదవబోతున్నారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications; Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016, TEL: 220728.
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500482

URA Telugu Hyderabad-500 004 Regd No. H